# గుర్తుంచుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళలోని ఆహారాన్నివ్వకపోతే జరిగేదిది-మీ పాప విటమిన్, మినరల్ వీటి లోపానికి గురికావచ్చు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

విటమిన్‌లు, మినరల్స్ సమపాళ్ళలో ఉన్నట్లయితే పోషక పదార్థాలను హరించుకొనడంలో తోడ్పడతాయని మీకు తెలుసా. ఇది, మీ పాపాయి కొరతకు గురి కాకుండా చూస్తుంది.

మీ డాక్టర్‌ని అడగండి. ఈ విటమిన్‌లనూ, మినరల్స్‌నూ పొందేందుకు పోషణ రూ పేణా సమతూకంలోని ఆహారమే ఉత్తమ మార్గమని మీ డాక్టర్ చెబుతారు. అటువంటి సమతూకమైన పోషకాహారంలో ప్రొటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వుపదార్థాలు, ఇనుము, కాల్షియం కూడ సరైన పాళ్ళల్లో ఉంటాయి-ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు, ప్రతి రోజు క్రమం తప్పకుండా రోజు రోజూ లభించాలి.

చాలా మంది తల్లులకు మామూలుగా పారంపర్యంగా యిచ్చే ఆహారంతో యిలా సమతూక ఆహారం యివ్వడం సాధ్యం కాని ది.

మరి దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఇది పాపాయిలకు యిచ్చేందుకు పోషణ రూ పేణా సమతూకమైన ఘన ఆహారం వారికి నాలుగు నెలల నుంచి యిచ్చేందుకు. ఎందు కంటే, పిల్లలకు ఆ వయసు నుంచి పాలు మాత్రమే చాలవు.

సెరిలాక్ ఏ.డి.సి.బి కాంప్లెక్స్ మరియు 'ఇ' విటమిన్లతో బలవర్ధకం చేయబడింది. దీనిలో ప్రొటీన్లూ, కొవ్వు పదార్థలూ, కార్బొహైడ్రేట్లూ, ఇనుము, కాల్షియం కూడా ఉన్నాయి-అన్నీ మంచి సమపాళ్ళలో. దాని రుచి పిల్లలకు చాలా యిష్టం.

కనుక, పోషణ నిచ్చే సమతూకంలోని సెరిలాక్ సమకూర్చే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలలు రాగానే వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు ప్రయోజనాన్ని పాపాయికి సమకూర్చండి.

ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్

వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బ్యాగ్ నం. 21, న్యూఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

జూన్ చతుర నవల 'రాలిన స్వప్నం'

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482



# 'మాతృమూర్తి' పై చతుర సమీక్షలు

**ఏప్రిల్ నెల 'చతుర' లో ప్రచురితమైన వింజమూరి విజయ శాంభవి నవల 'మాతృమూర్తి' పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం**

## రూపం-ప్రతిరూపం

*(ప్రథమ బహుమతి రు.100/-లు పొందిన సమీక్ష)*

**చ**తుర నవలలు సమాజాన్నీ, సహజత్వాన్నీ సమానంగా చూపిస్తాయనడానికి వింజమూరి విజయశాంభవిగారి రచన 'మాతృమూర్తి' ఒక చక్కని నిదర్శనం. సవతితల్లులపై సమాజపు ముద్ర ఎలా ఉంటుందో ఈ నవలలో చాలా చక్కగా చూపించారు.

రెండవ పెళ్లికి ఏ కన్నెపిల్లా ఇష్టపడి సిద్ధపడదు. ఆర్థికదుస్థితే వారినాస్థితికి తీసుకు వస్తుందనడానికి తులసి పాత్రే పెద్ద ఉదాహరణ. అందులోనూ పిల్లల తండ్రిని చేసుకోవడం భావిజీవితాన్ని మధుర స్వప్నంగా భావించే ఏ ఆడపిల్లకైనా కష్టసాధ్యమే. సవతితల్లిగా మూర్తి ఇంటికి వచ్చిన తులసి అంతర్గత మథనాన్ని రచయిత్రి చాలా చక్కగా వివరించారు. తులసి మానసిక వ్యతిరేకతకు తోడు అంబుజమ్మ లాంటివాళ్లు మనసులను మరింతగా చిదిమివేయడం సమాజంలో తరచూ జరుగుతూ ఉన్న సత్యమే. అలాగే మూర్తి తల్లి అరుంధతమ్మలాంటి అమాయకులు ఇంటి క్షేమాన్ని కోరుకుంటూనే తమకు తెలియకుండానే ఇంటి విధ్వంసానికి ఎలా కారకులౌతారో విశదంగా తెలియజేశారు రచయిత్రిగారు. అగ్నికి ఆజ్యంపోసి ఎగదోసినట్లే వీరి మాటలు తులసిలాంటివాళ్లను మరింత ఉద్రేకపరుస్తాయి. మరింత కఠిన హృదయులుగా మారుస్తాయి.

అయితే స్త్రీ మాతృమూర్తి గా వచ్చునుగానీ, సవతిపిల్లలకు 'మాతృమూర్తి' అయిన దృష్టాంతాలు స్వల్పం. అందువల్లే సమాజంలో 'సవతితల్లి'కి చెడ్డ వ్యక్తిగా ముద్ర పడిపోవడం జరిగింది. ఈ ముద్రను అంబుజమ్మ బామ్మగార్లవంటివారు తొలగిపోకుండా బలంగా నిలవడానికి శాయశక్తులా ప్రయత్నిస్తూనే ఉంటారు. 'అమ్మా' అని సవతి పిల్లలతో పిలిపించుకోవడానికి ఇష్టపడని తులసి, భారతిని చందూని చంపుకు తిన్న తులసి, సవతితల్లికి సమాజం చూపిస్తోన్న సవతితల్లికి పరాకాష్ఠ. నవల ప్రారంభంలో పిరికితనమే ఆభరణంగా గల భారతికి సౌదామిని టీచరు సాన్నిహిత్యంలో మారిన భారతికి ఎంతో వ్యత్యాసం కనిపిస్తున్నది. సమాజపరంగా సమాజం చూపిస్తోన్న సవతితల్లికి తులసి రూపమైతే, సమాజం చిత్రించని రచయిత్రి భావనాలోకంలో ఉన్న తత్వాన్ని రంగరించుకుని పుట్టిన సవతితల్లికి భారతి ప్రతిరూపం.

ఆడవాళ్లతోపాటు సవతి మగవాళ్లను కూడా చూపించడానికి జరిగిన ప్రయత్నమే శేషు - సింగరాజుల పాత్రల చిత్రణ. నవల ప్రథమార్థంలోని కాత్యాయని, ఉత్తరార్థంలోని సీత పాత్రలు అటు తులసి మనస్తత్వాన్ని ఇటు భారతి మానసిక ఔన్నత్యాన్ని పెంచడానికి మాత్రమే తోడ్పడినాయనిపిస్తోన్నది. చదువూ - ఆర్థిక స్వాతంత్ర్యం మాత్రమే మనిషిలో ధైర్యాన్ని ఇవ్వలేవనడానికి సుష్మామేడమ్ ఆత్మహత్య ఓ ఉదాహరణ. సాటిమనిషిని ఆదరించగలిగిన మనసు సహజంగా పుట్టుకతో రావాలేగానీ, చదువుగానీ ఆర్థిక స్వాతంత్ర్యంగానీ తీసుకురాలేవన్నది మనిషి మరిచిపోగూడని మరో సత్యం. మాతృత్వమనేది అనుభవిస్తేగాని తెలియనిది. మాతృత్వ మమకారభావనవేది కేవలం భావనలో మాత్రమే కనబడేది. రెండూ ఒకటి కావు - కాలేవు. మొత్తానికి ఈ నవల

---

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: జగ్‌మోహన్

ద్వారా ఒక సమస్యను వివరించడంలో రచయిత్రి చాలావరకు సఫలీకృతులయ్యారనే చెప్పాలి.

-ఎస్.కె.ప్రసాదరావు
మద్దిపాడు

## అసలు పాత్ర

(ద్వితీయ బహుమతి రు.75/-లు పొందిన సమీక్ష)

పదిమందికి జన్మనిచ్చినామె గయ్యాళి అయినా పర్వాలేదు. కానీ మంచిమనసుండీ సంతానం లేకపోతే 'గొడ్రాలు' అనే తిరుగులేని బిరుదును తగిలిస్తారు. అసలు సవతితల్లి అయినా, కన్నతల్లి అయినా ఎవరైతే ఏమి? మాతృత్వపు మమకారాన్ని అందించినపుడే కదా స్త్రీమూర్తి నిజమైన మాతృమూర్తి అయ్యేది. అలా ప్రేమనందించటానికి ఒక్క కన్నతల్లే కానక్కర్లేదనుకుంటా!

ముందు అనూయపుట్టి ఆడది తరువాత పుట్టిందంటారు గత కాలపువారు. కాని 'మాతృమూర్తి' నవలలోని కొన్ని పాత్రలను చూస్తే ఇది నిజమనిపించదు. తమకు దక్కనిది ఇతరులకు కూడా దక్కకూడదు అనేది కొందరి అభిమతం. ఏ చిన్న అవకాశం దొరికినా తమ ఈ నైజాన్ని ప్రదర్శించి ఎదుటివారిని సాధించాలనీ, పరుషమైన మాటలతో కలవరపెట్టాలనీ చూస్తారు. కానీ వారికి తెలియకుండానే వారిలో వుండే ఈర్ష్య, ఉక్రోషం, తెలివి తక్కువతనంలాంటివి బహిర్గతమౌతున్నాయనీ, ఎదుటివారికి తాము చులకనైపోతున్నామనీ తెలిసికోలేరు.

భారతి పాత్ర నవలకే హైలైట్. 'కక్షతో సాధించలేనిది కరుణతో సాధించవచ్చు' అనే సత్యాన్ని భారతి పాత్ర ద్వారా చక్కగా నిరూపింపజేశారు రచయిత్రి. కడుపున పుట్టిన బిడ్డలనే రకరకాల కారణాలు చూపించి భేదభావంతో చూచే తల్లులు కూడా ఉన్న మన సమాజంలో తాను జన్మనివ్వకపోయినా అంతకంటే ఎక్కువగా మమతానురాగాల్ని పంచియిచ్చే భారతిలాంటి చల్లని తల్లులు ఎంతమంది వుంటారు? తాననుభవించిన నరకం మరొకరికి రాకూడదని భారతి తీసుకున్న నిర్ణయం ఎంతైనా అభినందనీయం.

సౌదామిని పాత్ర నిజంగా మంచిముత్యంలాంటిది. భారతిలాంటి వజ్రానికి మెరుగుపెట్టిన ఘనత సౌదామినిదే. సౌదామిని భారతికి పరిచయం కాకపోతే కథ ఎలా వుండేదో? ఆమెది హర్షించదగిన ఉత్తమపాత్ర.

సౌందర్యమ్మగారి పాత్ర పెద్దరికంగా ఎంతో హుందాగావుంది. పరిస్థితులను అవగాహన చేసికొని వచ్చిన ఆపదలకు కృంగిపోకుండా ఆత్మస్థైర్యంతో నిలచిన పాత్ర అది. తాను వగచి అందరినీ విలపింపజేసేకంటే తాను నవ్వుతూ అందరినీ సంతోషింపజేసే పాత్రగా కూడా చెప్పుకోవచ్చు.

దుర్గ, వాళ్లత్తగారు, కాత్యాయిని - వీళ్ళు, భారతి, సౌదామిని, సౌందర్యమ్మ అనే తులసి మొక్కల పక్కన గంజాయి మొక్కలు అని చెప్పుకోవచ్చు.

మమతానురాగాలు, మాతృత్వపు విలువలు, ఆత్మీయత, అమ్మయొక్క అమృతమైన ప్రేమ వీటికి అర్థం లేకుండా పోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో 'చతుర' అందించిన ఏప్రిల్ నెల సమగ్రనవల 'మాతృమూర్తి' నడివేసవిలో ఎడారిలో దప్పికగొన్నవారికి ఒయాసిస్సులా అనిపించకమానదు.

రచయిత్రి ఎన్నుకున్న ఇతివృత్తం, మలచిన తీరు బాగున్నాయి. ఓ మంచి నవల చదివామన్న తృప్తి కలుగుతుంది. ఇలాంటి మంచి నవలలు ఈనాడు ఎంతో అవసరం. వాస్తవ పరిస్థితుల్ని చక్కగా నేర్పుగా మనసునకు హత్తుకునేట్లు వ్రాసిన రచయిత్రిగారికి, అందించిన 'చతుర'కు హృదయపూర్వక కృతజ్ఞతలు.

- జి.భానుమతి
పడాలి

## ప్రయోజనాత్మక నవల

(తృతీయ బహుమతి రు.50/-లు పొందిన సమీక్ష)

మంచి నవలలు రాయడానికి రచయితకు ధైర్యాన్నిచ్చే 'చతుర' విలువను ముందుగా శ్లాఘించకుండా వుండలేకపోతున్నాను. సాహిత్యం వ్యాపారంగా మారినవేళ నానా ఛండాలన్నీ రచనగా చెలామణీ చేయిస్తున్న కాలంలో రచయిత్రి వింజమూరి విజయశాంభ

విగారు ఓ నిత్య నూతనమైన పాత సమస్యనే ఎంచుకొన్నా దాని విశ్వరూపాన్ని విప్పి చెప్పిన తీరు బహుధా ప్రశంసనీయం.

సవతితల్లులు పెట్టే బాధలకి సవతిపిల్లలు బలికావడం గూర్చి అనేక కథలూ, నవలలూ వచ్చాయి. అయితే ఇంత విస్తృతంగా చర్చించిన రచన మరేదీ కానరాదు. అనేక కుటుంబాల్లో నిత్యం రగులుతున్న సమస్యని కథగా ఎంచుకొని ప్రయోజనాత్మక నవలగా సమర్పించడంలో రచయిత్రి సఫలమయ్యారు. సవతితల్లుల, సవతిపిల్లల మధ్య అగాధానికి గల కారణాలను ఈ నవల సమర్థవంతంగా ఎత్తిచూపింది. భార్యగా ఆ తల్లి ఆశలు ఒక కోణమైతే, ఆ తల్లి మీద ఆ పిల్లలు పెంచుకునే అపోహలు మరోకోణం. వీటిని సృష్టించే దుష్టసమాజమే అసలైన కారణం. రెండో పెళ్లివాణ్ణి చేసుకున్న యువతి కానీండి, రెండోపెళ్లి చేసుకున్న ఆ భర్త కానీండి, ఆ సవతిపిల్లలు కానీండి, వాస్తవిక పరిస్థితులలో ఇమడలేకపోవడం, మానసికంగా ఒకరికొకరు దూరం కావడం ప్రధానంగా ఈ దుస్థితికి దారితీస్తుంది.

ఈ నవలలో రచయిత్రి ప్రధానంగా రెండు అంశాలపట్ల శ్రద్ధ చూపారు. అవి రెండు ముఖ్యప్రయోజనాలను సాధిస్తాయి. ఒకటి వీరి మధ్య సంబంధ బాంధవ్యాలు చెడిపోవడానికి దోహదపడే కారణాలను చర్చించడం. దీనివల్ల ఆ స్థితిలోవున్న అనేకమంది తల్లుల, పిల్లల భ్రమలు తొలగిపోతాయి. రెండు - ప్రేమతో ఈ సమస్యని ఎలా పరిష్కరించవచ్చునో చూపడం. ఇది భారతి పాత్రద్వారా నెరవేరింది.

రచనలో మెచ్చదగ్గ విషయం ఏ పాత్ర చేతా నేలవిడిచి సాము చేయించకపోవడం. పాత్రల వాస్తవ చిత్రీకరణ ఈ నవల ప్రత్యేకత. ఏ పాత్ర కూడా అతిమంచిగానూ అతి చెడ్డగానూ రూపొందలేదు. ప్రతి మనిషిలోనూ వుండే మంచి చెడ్డలతో పాత్రలు సహజసిద్ధంగా రూపుదిద్దుకున్నాయి. పాత్రల మానసిక విశ్లేషణ బావుంది.

అయితే ఓ విషయం చెప్పక తప్పదు. కథ నిడివి పెంచడానికో, చెప్పిందే మరింత బలంగా చెప్పడానికో సవతితల్లులు, సవతి తండ్రులు సవతిపిల్లలగూర్చి పదేపదే ప్రస్తావించారు. కేవలం ఈ ఒక్క సమస్యనే హైలైట్ చేయదల్చుకున్న నవల కాబట్టి ఇది తప్పులేదేమో. అయితే కొన్ని విషయాలు సరిగ్గా అవే వాక్యాలతో పదాల కూర్పుతో చర్వితచర్వణం కావడం గమనించి సవరించుకోవలసింది.

నవల చదివాక ఓ మంచి రచన చదివామన్న సంతృప్తి పాఠకులకి మిగుల్తుంది.

— వి.వి.సాగర్,
విశాఖపట్నం

# సమాజమా! నీ ప్రవర్తన మార్చుకో!

(రు. 25/-లు పొందిన సమీక్ష)

అమ్మ- ఆ స్థానం ఎంతో విలువైంది. అమ్మ అనురాగాన్ని చూపిస్తుంది. అభిమానాల్ని స్తుంది. ఆప్యాయతను పంచుతుంది. అటువంటి నిస్వార్థ ప్రేమనందించే అమ్మని కోల్పోయిన అనాథలు నిజంగా దురదృష్టవంతులు. ఈరోజు ఎన్నో కుటుంబాలలో అమ్మ ప్రేమలేక అల్లాడిపోతూ ఎంతోమంది పిల్లలు సంఘవ్యతిరేక శక్తులుగా మారుతున్నారు.

''మాటకు మాట తెగులు నీటికి నాచుతెగులు సంఘానికి స్వార్థపు తెగులు'' అన్నట్లు ప్రతిరోజూ ప్రక్కవారి గురించి మాట్లాడకపోతే కొందరి నోళ్లకు పక్షవాతం వస్తుంది.

సవతి తల్లన్నా సవతి తండ్రన్నా ఈ సమాజానికి చిన్నచూపు. దానికితోడు ఇతరులు లేనిపోని కృత్రిమ అభిమానాలు చూపి పచ్చగా ఉండే సంసారాలను కూలద్రోస్తారు. ''ఈ సమాజం చాలా క్రూరమైంది. దాన్ని నువ్వు లెక్కచేయకు'' అన్న సూక్తి భారతిలాంటి తల్లులకు వర్తిస్తుంది. సమాజంతో నిమిత్తంలేకుండా ఆ సమాజాన్ని తన రుజు ప్రవర్తనతో నోరు మూయించి తన సంసారాన్ని ఆనందమయం చేసుకోగల భారతిలాంటి తల్లులు నూటికి ఒక్కరున్నా తమ స్వార్థంకోసం, నీటిబుడగల్లాంటి సంఘప్రతిష్ఠలకోసం వెంపర్లాడుతూ సంసారాలని నరక ప్రాయం చేసుకొనే తులసిలాంటి అజ్ఞానపు సవతి తల్లులు కోకొల్ల




లు. వారివల్లే సరిగా ఎదగాల్సిన చందులాంటి పిల్లమొక్కలు వంకర్లు తిరిగి పెరుగుతాయి.

విజయశాంభవిగారు తన "మాతృమూర్తి"లో నేటిసమాజంలో మనం చూస్తున్న పాత్రలనే సజీవంగా, సహజంగా అతిశయోక్తి ఏమాత్రం లేకుండా చిత్రీకరించారు. జీవితానికి మంచి గుణపాఠాలు నేర్పే సౌదామినిలాంటి స్నేహితులు అరుదుగా కనబడితే, అరుంధతమ్మలాంటి చాదస్తపు వ్యక్తులూ, అగ్నికి ఆజ్యంతోడైనట్లు సంసారాలలో కలతలు సృష్టించే అరవింద, గోవిందమ్మ, అంబుజంలాంటి వాళ్ళూ నిత్యజీవితంలో అడుగడుగునా కనిపిస్తారు. తల్లి పోయిన పిల్లలను సరిగా చూసే ప్రకాశ్‌లాంటి తండ్రులు అరుదైతే, పిల్లలను సరిగా చూడని మూర్తి, సింగరాజులాంటివాళ్లు పుట్టగొడుగులు. ప్రేమరాహిత్యం వల్లనే చందులాంటి వ్యతిరేక ధోరణులు కలిగే పిల్లలూ, ఎదగాల్సిన వయసులో ముడుచుకుపోయే సీతలూ తయారవుతున్నారు.

ఈ నవలలో రచయిత్రి ఆశించినట్లు తమ మంచి ప్రవర్తనతో తులసిలాంటి కఠిన మనసులు గల సవతి తల్లులను మార్చడం ఆచరణలో క్లిష్టతరం. మనం నవలలో చదివినంత తేలిగ్గా వాళ్ళను మార్చలేం. ఏది ఏమైనా ఈ సమాజాన్ని నిరసిస్తూ దాంట్లో మనం భాగస్వాములం కనుక సంఘాన్ని సంస్కరించాలి. అందుకు ఇటువంటి నవలలు దోహదపడాలి.

-ఎం. ఈశ్వరమ్మ,
చిల్లకల్లు.

## మాతృత్వంకంటే

*(రు. 25/-లు పొందిన సమీక్ష)*

"మాతృత్వంలోనే ఉంది ఆడజన్మ సార్థక్యం, "అమ్మా" అని పిలిపించుకొనుటే స్త్రీమూర్తికి గౌరవం". 'అమ్మా' అన్న పిలుపులో అంత మాధుర్యం, మమతా, మమకారం నిండిఉన్నాయిమరి. సవతితల్లి అయినా అందరూ అలా ఉండరు. మాతృహృదయమనేది ఆమెక్కూడా ఉంటుంది అని చాటిచెప్పే చతుర నవల 'మాతృమూర్తి'.

సవతి తల్లయిఉండి కూడా తన కన్నబిడ్డలకంటే మిన్నగా, రెండోభార్యగా వచ్చి ప్రేమానురాగాలు పంచే గృహిణిగా, ప్రకాష్ కుటుంబాన్ని ఆదరాభిమానాలతో చూస్తూ తల్లిగా, భార్యగా గౌరవాన్ని సంపాదించుకున్న భారతి అభినందనీయురాలు. ఒకప్పుడు సవతి తల్లి బాధల్ని కష్టాల్ని చవిచూసి తాను కూడా బిడ్డలు గల భర్తకు భార్యగా ఉండి ఆ వచ్చే పిల్లలకు కన్నతల్లి ప్రేమను పంచాలని భారతి నిర్ణయించుకోవడం హర్షదాయకం.

ఇరుగుపొరుగువాళ్ల తప్పుడు మాటలతో సవతి తల్లికి, బిడ్డలకు మధ్య భేదాభిప్రాయాలు కలుగజేసే సమాజానికి అద్దంపట్టినట్లు రాశారు రచయిత్రి సౌదామిని. బోధనలద్వారా భారతి కళ్లు తెరిపించి సవతితల్లి కూడా ఒక మనిషేననీ, ఆమెను అర్థం చేసుకొని ఆమె ప్రేమను పొందడం కూడా బిడ్డల బాధ్యత అనీ నిరూపించారు. కనువిప్పు కల్గించిన భారతిని కన్నకూతురులా తులసి చూసుకోవడం చాలా బాగుంది. ప్రేమతో అన్యోన్యంగా ఉంటూ ఏ మనిషి మనసునైనా అనురాగం, ఆత్మీయతవైపు మళ్లించవచ్చునవే నగ్నసత్యాన్ని అపురూపంగా మలచారు విజయశాంభవి గారు. సవతితల్లేగాక సవతి తండ్రి ప్రేమలు కూడా ఎలా ఉంటాయనేది సీత జీవితంద్వారా తెలియజేశారు. పిల్లల మనసులు ఎటు వంచితే అటు వంగే లేత మొక్కల్లాంటివని, అలాంటి మనసుల్ని తమ అనవసరపు మాటలద్వారా పాడుచేయడం తగని పనని, మంచి మాటలతో మల్లెపూవులాంటి పిల్లల మనసుల్లోని మాలిన్యాన్ని కడిగేసి మాణిక్యాలుగా మార్చవచ్చుననే సందేశం బాగుంది.

తన కొడుక్కి రెండవ భార్యగా వచ్చిన కోడల్ని పిల్లలకు సవతి తల్లిగా చిత్రించి, ఆమె ఒక రాక్షసిలాంటిదనే భావన పిల్లల్లో కలుగజేసే అరుంధతమ్మల్లాంటి తల్లులకు ఈ నవలలో కనువిప్పు. కుటుంబాల్లో చిచ్చుపెట్టే దుర్గ, గంగమ్మల్లాంటి చీడపురుగులుగాక మంచి మనసున్న సౌందర్యమ్మలాంటివాళ్లు ఈ సమాజ శ్రేయస్సుకు ఎంతో అవసరం. సవతి తల్లి, సవతి తండ్రుల బాధల్ని భరిస్తున్న



పిల్లల కష్టాలు అక్కడక్కడ కన్నీళ్లు తెప్పించాయి. మాతృత్వంకంటే మాతృత్వపు మమకారం గొప్పది. కన్నతల్లా, సవతి తల్లా అనికాదు, ప్రేమించదగిన మనసు ముఖ్యం అనే గొప్ప సత్యాన్ని తెలియజెప్పిన రచయిత్రి కి అభినందనలు.

-అవుసలి ఆంజనేయులు,
మూసాపేట.

## జీవన విశ్లేషణ

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

'సాధనమున పనులు సమకూరు ధరలోన'- అన్న ఆర్యోక్తిని నిజంచేస్తూ వచ్చిన నవల వింజమూరి విజయశాంభవిగారి ''మాతృమూర్తి''. నవల అంతా సవతితల్లుల నిరాదరణకు గురైన పిల్లల మనోవేదన నేపథ్యంగా అర్థవంతంగా సాగిపోతుంది. భారతి-చందూలు చిన్ననాటే తల్లిని పోగొట్టుకున్న నిర్భాగ్యులైన పిల్లలు. వారి తండ్రి మూర్తి జీవితంలో రెండవ భార్యగా తులసి ప్రవేశించేక ఆ పిల్లల జీవితాలు ఎంత దుర్భరంగా తయారయ్యాయో అనే విషయాన్నీ కాలక్రమంలో ప్రకాష్ జీవితంలో ప్రవేశించిన భారతి అతని పిల్లలకు నిర్మలమైన - ప్రేమమయమైన జీవితాన్ని రుచిచూపిస్తూ ఆదర్శమాతృమూర్తిగా ఎలా మిగిలిపోయిందన్న విషయాన్నీ విశ్లేషిస్తూ నవల నడుస్తుంది.

లోకంలో సవతి తల్లులంతా యిలానే ఉంటారా అని ప్రశ్నించుకుంటే తులసిలాంటివారికి తొంభైతొమ్మిది శాతమూ - మిగిలిన ఆ ఒక్కశాతమూ భారతిలాంటివారికే కేటాయించుకోవాలిమరి. కాలాలు మారి - ఆ మారిన కాలాల్తోపాటు మనుషులూ మారుతున్నా సవతితల్లులూ - తండ్రులూ మాత్రం మారడంలేదు. ఎన్ని కోణాలనుంచి ఎన్ని రకాలుగా ఆలోచించినా ఈ సమస్యకు సమాధానం మాత్రం వాళ్ల ప్రేగు తెంచుకుని పుట్టలేదన్నదొక్కటే ప్రధానంగా కనిపిస్తుంది. ఈ విషయం కేవలం నవలకే పరిమితం కాదు, యదార్థ జీవితాలకూ వర్తిస్తుంది. ఏ ప్రేమకు తన పిల్లలు కరువవుతున్నారో ఆ తల్లిప్రేమను పంచడానికే మూర్తి రెండవభార్యగా తులసిని తీసుకువచ్చాడు. కాని, ఆ తులసి లోకంలోని కల్తీవస్తువుల సరసన తల్లిప్రేమను కూడా చేర్చడం కాస్త బాధగా అనిపిస్తుంది. నవలలో పరిచయమైన ముఖ్యమైన ప్రతి పాత్ర వెనకనూ ఓ సవతి తల్లో - తండ్రో దర్శనమీయడం శోచనీయం. ఒకరకంగా చెప్పాలంటే రచయిత్రి సవతితల్లుల జీవితాలపై - వారి నిరాదరణలో మగ్గిపోయిన పిల్లల జీవితాలపై పరిశోధన చేసి, ఎనాలసిస్‌ను పాఠకులకు సమర్పించినట్లుగాఉంది. కాకపోతే ఈ విషయాన్ని నవలగా చెప్పాలనుకున్నారు. అంగవైకల్యం, అనారోగ్యాలతో అలమటించే సౌందర్యమ్మలాంటివారు భూషణంలా భాసించే వ్యక్తిత్వమున్నవారైనప్పటికీ భారతికిమాత్రం పనిమనిషి అవసరాన్ని గురించి చెప్పడమూ, తన భర్త - తన నలుగురు మగపిల్లలూ చెయ్యికాల్చుకుని బాధపడుతుంటే తమకు పనిమనిషి అనవసరమని చెప్పడమూ అనౌచిత్యంగా వుంది.

భారతిలో గొప్ప ఆవేదన వుంది, ఆశ వుంది, అభిమానం వుంది, జీవితం వుంది. తానునుభవించిన జీవితంలోంచి యేది సబబో, కాదో తెలుసుకోలేని స్థితిలో ఆమె లేదు. భూదేవంత ఓర్పూ, సీతమ్మంత సహనమూ ఉన్న భారతికి సౌదామినిచేత 'నీ సవతి తల్లికి నీవుగా దగ్గరయ్యే ప్రయత్నం చెయ్యి' అని సలహాయిప్పించడం ఎందుకు? నిజానికి భారతి యెన్నోసార్లు తులసికి దగ్గరయ్యే ప్రయత్నాలు చేసింది. తులసిమాత్రం ఆ భారతీ-చందూల నీడ తనకు సోకనంత దూరంలో వారి నుంచింది. ప్రకాష్ జీవితంలో ప్రవేశించిన భారతి అతని పిల్లలకు సవతితల్లేగదా! ఆమె తన గత జీవితాన్ని వర్తమాన జీవితానికి ఫ్లాష్‌బాక్ స్టోరీలా చెప్పడంలో గొప్ప జీవన విశ్లేషణ కనిపిస్తుంది. అందుకే నవల విసుగు లేకుండా చదువుకోవచ్చు. ప్రకాష్‌కు భార్యగా - అతని పిల్లలకు నిండు ప్రేమనందించిన మాతృమూర్తిగా భారతిని గొప్పగా చిత్రీకరించిన రచయిత్రికి అభినందనలు.

-కనగాల రామచంద్రరావు,
వెంకటపాలెం.




# శృంగార కథలు



**సెన్సేషనల్ రైటర్**

**మ**న్మథరావుకి శృంగార రచయితగా గొప్ప పేరుంది. అయితే అది అతని స్వంత పేరో లేక కలం పేరో ఎవరికీ తెలియకపోయినా- అతనికి పేరు మాత్రం వచ్చేసింది.

ఆ మాటకొస్తే, అతను రాసేవి శృంగారకథలు కాదు, బూతుకథలు. శృంగారానికి, బూతుకు తేడా తెలీని చాలామంది అమాయకపాఠకులు అతని కథల్ని ఆబగా చదివి మనసు పాడుచేసుకుని వికారచేష్టలకు, పైత్యప్రకోపానికి గురైపోతుంటారు.

కుర్రాళ్లు అతని కథల్ని చాలా క్రేజ్‌గా, పెద్దవాళ్లకు తెలియకుండా రహస్యంగా చదువుతుంటారు. చీకటిబజార్లో అతని పుస్తకాలు విపరీతంగా అమ్ముడయిపోతుంటాయి. బ్లూ ఫిల్ములకి, అతని పుస్తకాలకీ అట్టే తేడా లేదని చెప్పుకుంటుంటారు. ఉన్నతేడా అల్లా ఒకటి చదివేది, మరోటి చూసేది- అంతే.

అయితే శృంగార కథల్ని పేరుమోసిన రచయితలు కూడా రాశారు. కాని ఆ శృంగారమే వేరు. మనసుకెలాంటి వికారం పైత్యం



పుట్టించకుండా సున్నితంగా మధురమైన ఆలోచనల్ని సుతిమెత్తగా రేకెత్తించి గిలిగింతలుపెట్టి పిల్లతెమ్మెరలా అలా తాకివెళ్లే కథలవి. నవరసాల్లో అదీ ఓ రసమే కాబట్టి ఆ శృంగారం శృతిమించితే, బూతుకథ రాగానపడటం ఖాయం. మన్మధరావు ఎప్పుడో శృతిమించి 'రాగాన'పడ్డాడు. అతని కథలు చదివిన చాలామంది శృతిమించి రాగాన పడ్డారు.

అతని పబ్లిషర్సు కూడా వ్యాపారదృష్టి బాగా వున్నవాళ్లు కావటంతో అతన్ని మరింత లోతుగా శృంగారసాగరాన్ని మధించమని ప్రోత్సహిస్తూవచ్చారు. తానేం రాస్తున్నాడో ఏనాడైనా వెనక్కితిరిగి చూసుకుంటే తనమీద ఎలాంటి ముద్రపడిపోయిందో అతను గ్రహించుకునేవాడు. తను మెడవరకు ఊబిలో కూరుకుపోతున్న నిజాన్ని తెల్సుకుని జాగ్రత్త పడుండేవాడు.

కాని డబ్బుకు దాసోహమైపోయిన మన్మధరావు పరిసరాల్ని పరిస్థితుల్ని పట్టించుకునేస్థితిలో లేడు. ఓసారి అతని పదిహేడేళ్ల కూతురు, పంతొమ్మిదేళ్ల కొడుకు అతను రాసిన కథల్ని చదువుతూ అతని కంటపడిపోయారు.

తండ్రిగా తన బాధ్యతని గుర్తించి ఆనాటితో తన రచనలకి స్వస్తిచెప్పివుంటే అతను మూడు ప్రమాదాల్ని రాకుండా అరికట్ట కలిగివుండేవాడు. కాని అతనూ చెయ్యలేదు. కొడుకును చూసీచూడనట్టు వదిలేశాడు. కూతుర్ని మెత్తగా మందలించాడు. ఇకమీదట ఎన్నడూ ఆ కథల్ని చదవనని కూతురు తండ్రికి వాగ్దానం చేసింది.

నిజంగానే ఆతర్వాత అతని పిల్లలు అతనికి తన కథలు చదువుతూ ఎన్నడూ కంటపడలేదు.

మన్మధరావు డబ్బు మత్తులో మరింతగా మునిగిపోయి విజృంభించి రాయటం మొదలెట్టాడు. సాటిరచయితలు కూడా అతన్నసహ్యించుకునేటంత దిగజారుడుతనం అతని రచనలలో చోటుచేసుకుంది. ఓ కేటగిరికి చెందిన పబ్లిషర్సు మాత్రమే అతని రచనల్ని అచ్చేసుకునేవారు. వాళ్లు కేవలం చీకటిబజారులో మాత్రమే తమ పుస్తకాల్ని రిలీజ్ చేస్తున్నారు.

వార మాసపత్రికలన్నీ దాదాపు అతని రచనల్ని వెయ్యటం పూర్తిగా మానేశాయి. పాఠకులు కూడా అతన్ని అసహ్యించుకోసాగారు. అతని రచనలు చీకటి పాఠకులకు మాత్రమే పరిమితమైపోయాయి.

ఇలాంటి పరిస్థితుల్లో అతని కూతురు అకస్మాత్తుగా కనిపించకుండాపోయింది. ఆతర్వాత తెలిసింది- ఎవరితోనో లేచిపోయిందని. మన్మధరావు ప్రాణం సగం చచ్చిపోయింది. తన కొడుకు వేశ్యావాటికల్లో తిరుగుతూ రోగాలతో కుళ్లిపోయాడని తెలిశాక తక్కిన ప్రాణం కూడా పోయింది.

అందుకే ఆతర్వాత అశ్లీల సాహిత్యం రాస్తున్న నేరానికి పోలీసులు తనని అరెస్టు చెయ్యటానికి వచ్చిన సమయానికి మన్మధరావు కేవలం జీవచ్ఛవంలా మిగిలిపోయాడు.

ఆ శవమే పోలీసులవెంట నడచి వేసెక్కింది.

-రావు

## కృష్ణార్జునులు

రమాకాంతరావు, అర్జునరావు సివిల్ ఇంజనీర్లు. ఇద్దరు ఒకే సూపరింటెండెంటు ఇంజనీర్స్ ఆఫీసులో గత రెండేళ్లుగా పనిచేస్తున్నారు. వాళ్లు పనిచేసే ఆఫీసు ఓ ప్రాజెక్టు కిందికి వస్తుంది.

ప్రాజెక్టు పరిధిలోకి వచ్చే ముంపుకు గురికాబోయే ప్రాంతంలోని ఇళ్లకు ఎస్టిమేట్స్ వేసి ప్రభుత్వం వాళ్లకిచ్చే నష్టపరిహారాన్ని బిల్లుచేయించి ఆ ఇళ్ల యజమానులకిప్పించటం, కాంట్రాక్టర్స్ చేత ప్రాజెక్టు వర్క్ చేయించటం ఇద్దరూ జంటగా చేస్తుంటారు.

వాళ్లెంతగా కలసిపోయారంటే వాళ్లనందరూ కృష్ణార్జునులని పిలుస్తారు. అయితే ఇక్కడ అర్జునరావు కృష్ణుడు, రమాకాంతరావు అర్జునుడు. అర్జునరావు ఎన్నో వృత్తి రహస్యాల్ని విత్త రహస్యాల్ని రమాకాంతరావుకి బోధిస్తుండేవాడు. అతను రమాకాంత రావు కన్న అన్ని విధాల అనుభవజ్ఞుడు. స్టేషన్ సీనియార్టీలో కూడా అతనే సీనియర్.




అందుకే కాంట్రాక్టర్స్ ఇచ్చే మొత్తాల్లోను, కాంపెన్సేటర్స్ ఇచ్చే వాటాల్లోను పెద్దవాటాలు అర్జునరావే స్వీకరించేవాడు. రమాకాంతరావు అందుకేనాడూ అభ్యంతరం చెప్పలేదు. అయితే ఇక్కడో కిటుకుంది. కాంపెన్సేటర్స్తోను, కాంట్రాక్టర్స్తోను రమాకాంతరావు ముందుగానే ఒప్పందం కుదుర్చుకునేవాడు.

వాళ్లిచ్చే మొత్తంలో నాలుగో వంతు తానే ముందుగా తీసేసుకుని ఆ తక్కిన మొత్తాన్నే వాళ్లిచ్చిన మొత్తంగా అర్జునరావుకు చెప్పేవాడు. ఆ తర్వాత అర్జునరావు అందులో సగంవాటా అతనికిచ్చేసేవాడు. సీనియర్ ఇంజనీర్ అయ్యుండీ కూడా, రమాకాంతరావు చేస్తున్న మోసాన్ని అతను గుర్తించలేకపోయాడు. అయితే తాను బోధించిన విత్తరహస్య



జ్ఞానాన్ని రమాకాంతరావు బాగా వంటబట్టించుకుని గురువును మించిపోయాడు.

వీరిద్దరితోబాటు మరో ఇంజనీర్ కూడా అదే ప్రాజెక్టులో పనిచేస్తున్నాడు. అయన పేరు బోసుబాబు. నిజాయితీకి మారుపేరు. అవినీతికి అమడదూరంలో వుంటాడు. అందుకనే రమాకాంతరావు, అర్జునరావులకన్నా సీనియరై వుండి కూడా ఇంకా డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్గానే పని చేస్తూన్నాడు. వాళ్లిద్దరు రెండేళ్ల క్రితమే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లుగా ప్రమోటైనారు.

రమాకాంతరావు, అర్జునరావు తమ ప్రాజెక్టు పరిధి కింద వచ్చే ఏరియాలోనే బినామీ పేర్లతో మరో అయిదువందల చదరపు గజాల ఇళ్ల స్థలాల్ని ఉచితంగా ప్రభుత్వంనుంచి పొందారు. అది వాళ్ల చేతుల్లో పనే. ఎలాగైనా ఆ స్థలాల్లో పెద్ద భవంతులు కట్టుకోవాలనే కృతనిశ్చయంతో ఉన్నారిద్దరూ. కాంట్రాక్టర్లు తలో చెయ్యి వేస్తామన్నారు. ప్రాజెక్టు పనికోసం తెప్పించిన స్టీలు, సిమెంటు గోడౌన్స్లో మూలుగుతున్నాయి.

అయితే వాటినుపయోగించుకునే బదులు, కాంట్రాక్టర్స్నుంచి నేరుగానే స్టీలు, సిమెంటు తమ స్థలానికి రవాణా చేయించి గోడౌన్కి తరలించినట్టు స్టాక్ రిజిష్టర్లో ఎంట్రీలు వేసెయ్యటం క్షేమకరంగా వుంటుందని ప్లాన్ చేశారు ఇంజనీర్ ద్వయం.

అంతా పకడ్బందీగా సిద్ధమై ఇళ్ల నిర్మాణం మొదలైన సమయంలో రమాకాంత రావు అదే సి.ఇ. పర్యవేక్షణలో వున్న మరో సెక్షన్కి ఇన్ఛార్జిగా వెళ్లాల్సి వచ్చింది. తన ఇంటి నిర్మాణాన్ని కూడా అర్జునరావు కప్పగించి, ఆ సెక్షన్కి డిప్యూటేషన్ మీద వెళ్లిపోయాడు రమాకాంతరావు.

ఈ మధ్యకాలంలో అర్జునరావుకి కొన్ని నిజాలు తెలిశాయి. తన కన్నుగప్పి రమాకాంతరావు కాంట్రాక్టర్లనుంచి కాంపెన్సేటర్స్ నుంచి ముందుగానే డబ్బు గుంజిన సంగతి తెల్సిపోయింది.అర్జునరావు పిడికిళ్లు క్రోధంతో, ప్రతీకారవాంఛతో బిగుసుకున్నాయి.

ఇళ్ల నిర్మాణం చాలా తొందరగానే పూర్తయింది. మధ్య మధ్య రమాకాంతరావు వచ్చి చూసుకుని వెళ్లేవాడు. అర్జునరావుకి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు కూడా.

రెండు ఇళ్లు ప్రారంభోత్సవం ఒకేసారి జరపాలనుకున్నారు. అయితే ఆ ముందురోజు బ్రహ్మాండమైన వర్షం ఈదురుగాలితో పెనుతుఫానులా వచ్చి ఆ రాత్రంతా కురుస్తూనేవుంది.

మర్నాడు తెల్లారి చూసేసరికి రమాకాంతరావు ఇల్లు కుప్పకూలిపోయివుంది. అర్జునరావిల్లు చెక్కుచెదర్లేదు. అయితే మరో వారంరోజుల తర్వాత అతని ఇల్లు ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

అయితే అందుక్కారణం బోసుబాబేనని అర్జునరావుకెవరు చెప్తారు?

-బొమ్మిడి అచ్చారావు

# చతుర

సంపుటి:14 సంచిక: 5 జూన్ 1991

"నిన్ను నిన్నుగా ప్రేమించుటకు - నీకోసమే కన్నీరు నించుటకు - తోడొకరుండిన అదే భాగ్యమూ, అదే స్వర్గమూ" అని కవి వాక్కు. తనలోని ఆర్తినీ, ప్రేమనీ, అర్థంచేసుకుని వేదనలోనూ, వేడుకలోనూ పాలుపంచుకునే తోడుకోసం తపించేవా రెందరో ఉన్నారు. కానీ ప్రేమికుల్ని విడదీసి తమ పంతాలు, పరువులు నిలబెట్టుకోవా లనే పెద్దలే సమాజంలో అధికం.

"ప్రేమంటే... ఇదీ అని నేను చెప్పలేను. కాని నాకు ప్రేమించడం తెలుసు. ప్రేమను అనుభూతి పొందడం తెలుసు" అని స్థిరంగా పలికిన అతను తమ ప్రేమించిన అమ్మాయికి మరింత చేరువయ్యాడు. విషాదమయమైన అతని గతాన్ని మరిపించి అతని జీవితంలో మల్లెలు పూయించాలని ఆమె మనస్ఫూర్తిగా తనను తాను అతనికి అర్పించుకుంది. బ్రతుకంతా రంగుల స్వప్నంగా, అందాల హరివిల్లుగా సాగిపోవాలని ఆశలపందిళ్లు అల్లుకున్నారు వాళ్లు.

కానీ...

చరిత్ర పునరావృతమై వారి రంగుల కల కరిగిపోయి, హరివిల్లు విరిగిపోయి, అమృతభాండం బద్దలై వారి గుండెల్లో చిచ్చు రగిలింది...

గులాబీ సొగసులతో, సుమసుకుమారమైన ఆమె తనువు అగ్నిజ్వాల లకు ఆహుతి కావడానికి కారణం ఏమిటి?

ఆ అమర ప్రేమికుల్ని విడదీసి తమ మూర్ఖత్వానికి మూల్యం చెల్లించిన చరిత్రహీనులెవరు?

హృదయాలను కదిలించే ఆర్తితో సునిశితమైన శైలిలో యార్లగడ్డ రాఘవేంద్రరావు లేఖినినుండి వెలువడిన

# రాలిన స్వప్నం

ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

"అసలు ప్రేమంటే ఏమిటంటావ్ జీవన్?"

ఇదే ప్రశ్న ఇదివరకు చాలాసార్లు అడిగా జీవన్ని.

అతడేవేవో సమాధానాలు చెప్పాడు. కాని నాకవి ఏమాత్రం బోధపడలా, ఏనాడూ.

చుట్టూ నిశ్శబ్దం. సడి లేకుండా లోకంలోకి అడుగుపెడుతున్న పూర్ణ చంద్రుడు. అతగాడు చేస్తున్న పసిడివెన్నెల సంతకం. బంగారు ఛాయకోల్పోయిన చంద్రుడు తన మీదుగా సాగే మబ్బుతెరల మీద ప్రసరింపచేస్తున్న తెల్లనికాంతి.

ఆ కాంతిలో మెరుస్తున్న వాటి అంచులు.

అక్కడక్కడ విసిరేసినట్టున్న మబ్బుతునకల చాటునుండి బయటపడి ఉనికి చాటుకుంటున్న తారకలు.

మామిడి చెట్టు, బాదంచెట్టు సాంద్రపత్ర సమూహంగుండా మేం కూర్చున్న చోట పడుతున్న వెన్నెల చారికలు.

విరబూచిన లిల్లీ, మల్లెపూల గుత్తులు కలబోసిన పరిమళం. ఉండి ఉండి వచ్చి వాటిపై ఏవో రహస్యాల్ని ఒలకబోసి పోతున్న గాలి. ఆ గాలికి ఒడలంత పులకరించి నృత్యం చేస్తున్న అశోక చెట్లు.

దూరంగా దీపాల వరుస.

అందమైన నిశీధి. నిశ్శబ్దపు ఏకాంతం.

నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే గ్లాసులోకి బీరు ఒంపాడు.

మెల్లిగా ద్రవం గొంతులోకి జారడం ప్రారంభించింది.

"ప్రేమంటే... ప్రేమంటే ఇదీ అని నేను చెప్పలేను. కాని నాకు ప్రేమించడం తెలుసు" స్థిరమైన కంఠంతో పలికాడు జీవన్.

గట్టిగా నవ్వుతూ నోటి దగ్గరపెట్టుకోబోతున్న గ్లాసు కిందపెట్టాను. నా నవ్వులో కాస్త ఎగతాళి కూడా ధ్వనించిందనిపించింది నాకే. "ప్రేమించడం తెలుసంటావ్. మరి ప్రేమంటే ఏమిటో చెప్పలేవూ?" అన్నాను.

"దాన్దేముంది. ఆకలేస్తుందని తెలుసు... కానీ ఆకలంటే ఏమిటో సైంటిస్ట్లాగా మనం చెప్పగలమా?"

జీవన్ ఇలా ఎదురడిగేసరికి నాకు ఈ ప్రశ్న కాస్తంత సబబుగానే తోచింది. ఈసారి ఎగతాళిగా కాక సిన్సియర్గానే అడిగాను. "అది కాదు జీవన్. నువ్వు నీ ప్రేమల గురించి బాధల గురించి చెప్పినప్పుడల్లా నాకు నిజంగానే అర్థం చేసుకోవాలనిపిస్తుంది. ప్రపంచంలో రకరకాల ప్రేమలు. అవి నాకు కొంత అర్థమయినట్లే అనిపిస్తాయి. కానీ ఈ ఆడామగా ప్రేమలే గొప్ప పజిల్. అందమా? మంచితనమా? ఓ యువతికి కట్టుబడి ఉండడమా? ఏది ఓ స్త్రీని ఓ పురుషుడు ప్రేమించేలా చేస్తుంది ఇంతకీ..."

అప్పటిదాకా కుర్చీలో వెనక్కువాలిపోయి సిగరెట్ తాగడంలో మునిగిపోయి ఉన్న జీవన్ హఠాత్తుగా నా మాటల్ని మధ్యలోనే ఆపాడు.

"చెప్పానుగదా. నాకు ప్రేమించడం తెలుసు. ప్రేమను అనుభూతిపొందడం తెలుసు. అంతే..."

మళ్లీ ఓ బీర్ ఓపెన్ చేశాం.

రెండు చిప్స్ నోట్లో వేసుకుని నమిలి, సిగరెట్ ముట్టించాను.

ఏప్రిల్ ఎండల్లో పగలంతా మగ్గి ఆవేడిని చిల్డ్ బీర్తో చల్లార్చుకోవడం ప్రారంభించి అప్పటికే గంటదాటిపోయింది.

జీవన్ ఏదో చెప్పాలని తాపత్రయపడుతున్నాడు.

నాది విషయాల్ని కాస్త క్యాజువల్గా తీసుకునే స్వభావం కావటంతో తను సీరియస్గా భావిస్తున్న విషయం ఏదయినా చెప్పడానికి జీవన్ కాస్త సందేహిస్తాడు. కాని నాకు తప్ప మరొకరికి చెప్పుకోలేడుకూడా. ఆ విషయం ఇద్దరికీ తెలుసు.

మళ్లీ ఏదో సమస్య వచ్చిపడ్డట్టుంది. గొంతులో బీర్తోపాటు అది సుళ్లుతిరుగుతున్నట్టుంది. ఇంకాసేపట్లో తనే చెబుతాడు. అయినా ఇంకా ముందే రాబట్టాలని మళ్లీ అన్నాను.

"ప్రేమించడం, మోసపోవడం అంతా నరకం అనిపిస్తుంది. అసలు వాటి ద్వారా సాధించేదేముంటుందంటావ్?"

ఆకాశంలోకి సారించిన చూపుల్ని తిప్పకుండానే అన్నాడు జీవన్. "మనిషి మనిషిగా





జీవించడానికి అవసరమైన ఒక అనుభవాన్ని ఒక జీవిత కాలమంతామిగిలే ఒక అనుభూతిని, ఒక ఆర్ద్రతను, ఒక స్పందనను సొంతం చేసుకోవడం''

నేను నవ్వి ''నావెల్ ఫీలింగ్స్. అవన్నీ వినడానికి బాగుంటాయ్. అంతే...'' అన్నాను.

''కాదు అనుభూతిచెందడానికి, ఆ అనుభూతిలో ఉనికికే ఒక కొత్త అర్థం ప్రసాదించుకోవడానికి.

''అది తాత్కాలికమే. శాశ్వతతత్వం దానికి సిద్ధించదు''

''శాశ్వతమా.... తాత్కాలికమా అనేది ఎంతగా హృదయం లోతుల్లోకి తీసుకుంటున్నాం. అందులోని స్వచ్ఛత, గాఢత ఎంతనేదాన్ని బట్టి నిర్ణయమవుతుంది.

''స్త్రీకి పురుషుడు, పురుషుడికి స్త్రీ అవసరం. వారిద్దరినీ కలిపి ఉంచడానికి ఓ బంధం అవసరం. ఇద్దరి మధ్య అవగాహన, వారు ఎంచుకున్న విలువలు, అవి ఆచరణలో వహించే నిర్ణయాత్మకపాత్ర ఆ బంధాన్ని నిలిపి ఉంచుతాయి. కాని ఇద్దరి మధ్య ఒక ఆకర్షణ... అదే ప్రేమ భావన అనేది ఉన్నంత మాత్రాన ఇద్దరి మధ్య అనుబంధం పెరిగిసిలిచిపోదు. ఏమంటావ్''

''ఆకర్షణ ప్రేమలో కొంత భాగం మాత్రమే కాని ఆకర్షణే ప్రేమ కాదు. నువ్వు వాదించడంకోసం తర్కిస్తున్నావు అంతేకాని ప్రేమ ప్రాతిపదికగా అవగాహన, అవగాహన ప్రాతిపదికగా ప్రేమ కలుగుతాయన్నది తెలియక కాదు. మనుమల్ని ప్రేమించగలిగి ఆర్ద్రత నిండిన నీ మనసు ఇది అర్థం చేసుకోలేదని నేననుకోను. కాకపోతే నీకలాంటి ప్రేమానుభవం ఎదురుకాలేదు'' అన్నాడు జీవన్.

మనుమల్ని చదువుతూ వారి స్వభావాల్ని అన్ని కోణాల నుండి అంచనా వేస్తూ అవగతం చేసుకోవాలని యత్నించే నా మేధ ఈ స్త్రీ పురుషప్రేమ దగ్గరకు వచ్చేసరికి ఒక పరిధికే పరిమితమవుతుంది. బహుశా దానికి కొంత కారణం జీవన్ అన్నట్లు అనుభవరాహిత్యమే కావచ్చు. బ్రతకడంలోకి అడుగుపెట్టాక ఎవరినైనా ప్రేమించే సమయమూ దొరకలేదు. అవసరమూ కలగలేదు. ఏ ఒంటరి క్షణంలోనో నాలోని లోతుల్లోకి ముడుచుకున్నప్పుడు నేనూ ప్రేమించబడాలి అనే భావన అంతర్గతంగా తారట్లాడుతూ కన్పిస్తుంది. అది నా సబ్ కాన్షియస్ నుండి కాన్షియస్‌లోకి రావాలని ప్రయత్నించినా నొక్కి పట్టేసే వాణ్ణి. కారణం ఇథమిథంగా నాకే తెలియదు.

బీర్ ఖాళీ చేసి గ్లాసు టేబుల్ మీద పెట్టి లేచి వెళ్లి పిట్టగోడ మీద కూర్చున్నాను.

జీవన్ మాటలతో ముసురుకోబోయే ఆలోచనల్ని తరిమి వేసి మరో సిగరెట్ అంటించి, ''ఇంతకీ నువ్వు డల్‌గా ఎందుకున్నావో చెప్పలేదు'' అన్నాను.

అతడేం మాట్లాడలేదు.

''మళ్లీ ఓ ప్రేమానుభవం....'' అర్థోక్తిగా ఆగిపోయాను.

చెప్పడానికి సందేహిస్తున్నట్లుగా నెమ్మదిగా తల ఊపాడు.

''పొందిన అనుభవాలు చాలవూ'' అన్నాను.

ఈసారీ మౌనమే అతడి సమాధానమయింది.

''ఇతరుల విషయమేమోగాని నీ అనుభవాలనుండి నీవు నేర్చుకోవలసింది స్త్రీలతో ఆడుకోవడం. అంతేకాని ప్రేమించడం, ఆ తర్వాత రోదించడంకాదు''

''అది నాకు చేతకాదు''

''ఏది''

''స్త్రీలతో ఆడుకోవడం. జీవితాన్ని ఆటగా భావించలేను''

''కాని నరకం సృష్టించుకోవడం మాత్రం చేతనవుతుంది కదూ. నీ అనుభవాలన్నీ మానసిక నరకానికి సోపానాలే'' కొంత కఠినంగా అన్నాను. నా మాటల్లో కాస్త విసుగు కూడా ధ్వనించకపోలేదు.

''గతం వేరు. ఇప్పుడు వేరు''

''అహా అలాగా'' హేళనగా అని ''గతం, వర్తమానం వేరు వేరని నిర్ధారణ అయిందా'' అన్నాను.

''.......''

''ఎప్పటికప్పుడు అలాగే అనుకుంటూ

ఉండు. అసలు నీవుదేన్ని ప్రేమించేది? దేహ సౌందర్యాన్నా? ఆత్మసౌందర్యాన్నా?''

''రెండిటినీ. అందం నిండిన ఆత్మను''

''ఫలితంగా పొందగలిగేదేమిటి?''

''ఏం పొందాలి. ఆత్మానందం తప్ప. తనలో లయించిపోవాలని తహతహలాడే ఆ ఆత్మను అందుకోవడం మినహా''

''ఊహలు అందంగాను, వాస్తవాలు చేదుగాను ఉంటాయన్న సంగతి నీకు తెలియంది కాదు. కాని వాస్తవం ముళ్లకంచెలా పొడుస్తుంటే ఆ ఆనందం, సౌందర్యం ఎక్కడకను పిస్తాయి. అసలు ఊహల్లోకి ఎలా వెళ్లగలవు?''

''ఊహ కూడా ఒక్కొక్కప్పుడు వాస్తవంకావచ్చు. అప్పుడది అందంగానే కాదు, ఒక మధురానుభవంగా మిగులుతుంది'' దృఢంగా అన్నాడు.

''అది చాలా అరుదుగా జరుగుతుంది. అయినా గతం మిగిల్చిన అనుభవాల పాఠం ఒంటబట్టనప్పుడు ముందు ముందు మరింత గట్టి దెబ్బ తినవలసి వస్తుంది''

నా మాటల్లోని భావం పసిగట్టి, ''అనుభవం నేర్పిన పాఠాలు ఎన్నైనా నీరసించని ఆశాతత్వం ముందుకు అడుగువేయిస్తోంది'' అని ఒక క్షణమాగి ''నువ్వేమైనా అనుకో. ఇంత కాలం నీతో చెబుదామనుకునే చెబితే నీవు అసహ్యించుకుంటావేమోననే భయంతోనే ఈ సంగతి చెప్పలేదు. అయినా నీకంటే నాకు ఆప్తులెవరున్నారు. నేనేమిటో తెలిసిన నీవు ముందు ఛీకొట్టినా తర్వాతైనా అర్థం చేసుకోగల విశాలత్వం నీలో ఉందనే ఇప్పుడు చెబుతున్నాను'' అన్నాడు నెమ్మదిగా.

రెండు నిమిషాలు నేనేం మాట్లాడలేదు. పిట్ట గోడ మీద నుండి లేచి వచ్చి కుర్చీలో కూర్చుని బీర్ గ్లాసులోకి వంపుకుని సిప్ చేసి జీవన్‌ని చూస్తూ ఆలోచనలో పడ్డాను.

జేబులో నుండి చిన్న స్లిప్ తీసి దానిమీద ఒక పేరు రాసి అది మడచి సిగరెట్ పెట్టె కింద పెట్టాను. ఆ తర్వాత ''చెప్పు'' అన్నాను

సందిగ్ధంగా నావైపు చూసి తలవంచి బీర్ బాటిల్ మీది తడితో టేబుల్‌మీద మూడక్షరాలు రాసి నన్ను చూసి తలదించేసుకున్నాడు మళ్లీ.

నా బీర్ గ్లాసు చేతుల్లోకి తీసుకుని పెదవులకు ఆనించి గ్లాసును నెమ్మదిగా అటూ ఇటూ తిప్పుతూ జీవన్‌ని పరికించి చూసి గట్టిగా నిట్టూర్చాను.

తలపరికించి ''సిగరెట్ ప్యాకెట్ కిందున్న ఆ స్లిప్ తీసి చూడు'' అన్నాను.

అది తీసి నేను రాసింది చదివి ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసి చూసాడు. అంతలోనే నా రెండు చేతులు అందుకుని ముద్దుపెట్టుకున్నాడు.

ఏదో భారం వదలినట్లు నిట్టూరుస్తూ చిన్నగా నవ్వాడు.

ఆ నవ్వులో ఎంతో రిలీఫ్ కన్పించింది. అతడి తలను మెల్లగా నిమిరి మరో రెండు బీర్లు ఓపెన్ చేశాను.

తన గ్లాసులోని బీర్ ఖాళీ చేసి గ్లాసులోకి బీర్ వంపుకుని కుర్చీలో వెనక్కి జారగిలబడి ''ఆమెను ప్రేమిస్తున్నాను'' అన్నాడు.

''అదెలాగూ తెలుసు. మరి ఆమె....'' అని ప్రశ్నార్థకంగా ఆగిపోయాను.

'ఆమె కూడా' అన్నట్లుగా నన్ను చూసి తలూపాడు. ''నన్నేకోరుకుంటోంది'' అన్నాడు.

''కేవలం కోరికేనా''

ఏష్ ట్రేలో సిగరెట్ నులుముతున్న వాడల్లా చటుక్కున తలపైకెత్తి చూసాడు నన్ను.

''జోక్ చేయడంలేదు ఫ్రెండ్. సీరియస్‌గానే అడుగుతున్నా''

''కోరిక మాత్రమేకాదు. మనస్ఫూర్తిగా నన్నే అభిమానిస్తోంది'' కొంత కరుకుగా అనడానికి ప్రయత్నించాడా మాటల్ని.

నేనేం మాట్లాడకుండా సిగరెట్ తాగుతూండిపోయాను. ఆఖరి పఫ్ పీల్చి సిగరెట్ పీక పారేస్తూ అడిగాను.

''ఏం చేద్దామనుకుంటున్నారు'' అని.

''నేను వాళ్లన్నయ్యలకు తెలియజేద్దామనుకుంటున్నాను. కాని ఆమెవద్దంటోంది. అయినా నేనింకా అదే ఆలోచనలో ఉన్నాను'' అని చెప్పాడు.

''వాళ్లు వప్పుకుంటారంటావా'' నా ప్రశ్న.

''ఒప్పుకోకపోతే ఇక్కడనుండి వెళ్లిపోయి

పెళ్లి చేసుకుంటాం'' అతడి సమాధానం.

"ఎక్కడికి వెళతారు''

"ఏమో ఎక్కడికనేది ఇంకా నిర్ణయించుకో లేదు. అయినా వాళ్లు వప్పుకోనప్పుడుకదా'' చాలాధీమాగా అన్నాడు.

"వాళ్ల సంగతలా ఉంచు. మీవాళ్లు వప్పు కుంటారా?''

"నా తరపున నాకేమీ దిగుల్లేదు. మావాళ్ళు నామాట కాదనరు. నేను వాళ్లకి నచ్చచెప్పుకోగ లను. కాకపోతే నీవే ఈ విషయం సమయం చూసి ఆమె పెద్దన్నయ్యే చెవిని వేసి ఒప్పించాలి''

"నేనా''

"ఊ... కాదనకు. మేమిద్దరం నిన్నే నమ్ము కున్నాం. అతడికి నీమాట మీద గౌరవం ఉంది. నేనయినా చెప్పగల్ను. కాని ఎందుకైనా మంచిదని ఆ భారం నీ మీద వేస్తున్నాను'' అన్నాడు జీవన్.

ఒక్క గుక్కలో గ్లాసునిండా ఉన్న బీర్ తాగేసాను. కుర్చీలో నుండి లేచి అటుఇటు పచార్లు చేస్తూ సిగరెట్ అంటించాను.

"నేను చెప్పేది వినే ఓపిక ఉందా?'' అడిగా ను. ఉందన్నట్లు తలూపాడు. నేను పచార్లు చేయడం ఆపి కిందపడుకున్నాను. ఒక చేయి తలకింద పెట్టుకుని ఆకాశంలో విహరిస్తున్న చందమామను చూస్తూ సిగరెట్ దమ్ము గట్టిగా పీల్చి వదిలాను. ఆ తర్వాత నెమ్మదిగా ప్రా రంభించాను.

"జీవన్... స్త్రీతో ఆడుకోలేను, ప్రేమించగల ను అన్నావు. ఓకే... అందుకు అభ్యంతరం ఏమీలేదు. కాని ప్రేమంటూ నీ జీవితంతోనే ఆడుకుంటున్నావు. అది అంతటితో ఆగిపోదు. ఇంకొన్ని జీవితాలకు వ్యాపిస్తుంది. నీ జీవితం వరకే పరిమితమైతే లాభించినా, నష్టపడినా అది నీ ఒక్కడికే. అలా కానప్పుడు ఈ ప్రేమా టలో ఎన్నో హృదయాలు రగులుతాయి. ఈనాటి నీలోని సంఘర్షణ ఆ హృదయాలకూ పాకితే మీ అందరికీ మిగిలేదేమిటి?...''

జీవన్ ఏదో అనబోతుంటే అతడికి ఆ అవకాశం ఇవ్వక "నీలో సంఘర్షణలేదని బుకా యించబోకు. నీ అంతరంగంలో అదెంతగా ఉందో నాకు తెలుసు. నీ చేదు అనుభవాల నుండి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ, లేని పోని భ్రమలు కల్పించుకుంటూ ఏదో ఆరాటా న్ని పెంచుకుని మరిన్ని తప్పులు చేయడం అవివేకమే అవుతుంది. అనుభవాలకోసం ఆరాటపడటం, అందులోపడి బ్రతుకుల్ని కా ల్చుకుని కొన్ని మధుర క్షణాలు మిగుల్చుకోవ డంలో తప్పులేదు. కాని వాటి అన్వేషణలో జీవితాలతో ఆడుకోవడం తప్పు.

నువ్వొక థ్రిల్లింగ్ ఫీలింగ్‌కి లోనవుతు న్నావు. అసలు నీకెందుకాఫీలింగ్? కన్నెతో పొందు కమ్మగానే ఉన్నా పొందు తర్వాత జీవితాన్నే పోగొట్టుకోవడం ఎంత మూర్ఖత్వమ వుతుందో ఆలోచించు. జీవితం సిగరెట్ కాదు. దమ్ములాగి పారేసి మరో సిగరెట్ అంటించుకో వడానికి'' అని నా చేతిలో ఉన్న సిగరెట్‌ను విసిరేసాను.

"నాలోని ప్రేమభావన నువ్వన్నట్లు నాకొక థ్రిల్లింగ్ ఫీలింగ్ అయితే అయుండవచ్చు. కాని అది క్షణికమైంది. గాఢతలేనిది మాత్రం కాదు. నేను జీవితాలతో ఆడుకోవడంలేదు. కోరివచ్చిన జీవితాన్ని అందుకుని నా జీవితా న్ని దానితో ముడిపెట్టుకుని ఆనందంగా గడ పాలనుకుంటున్నాను. అది తప్పుకాదుగా'' అన్నాడు జీవన్.

"అని నీవనుకుంటున్నావు. సరే నువ్వెంత మందిని ప్రేమించగలవు? నిన్ను ఓదార్చి లాలించిన ప్రతి ఆడదాన్ని, నీకు శరీరం అప్పగించిన ప్రతి ఆడదాన్ని ప్రేమించగ లవా?'' కించిత్ కోపంగా అడిగాను.

"నన్ను అర్థం చేసుకుని ఆదరించగల ప్రతిహృదయాన్ని ప్రేమిస్తాను''

"ఆఁ ఆఁ ఎందుకు ప్రేమించవు. బాగానే ప్రేమించగలవు'' వ్యంగ్యంగా అని "నువ్వు ప్రేమించేది ప్రేమ అనే పదాన్ని. ఆ పదం నీలో కలిగించే తృప్తిని. ప్రేమించబడాలనే కోరికను''.

"కాదు''

చాలా కూల్‌గా అతడు ఆ మాట అన్న తీరుకు నాకు ఒళ్లుమండింది. వెల్లకిలాగా కిందపడుకున్న వాణ్ని లేచి కూర్చుని... "అ యితే ఎవరు నిన్నర్థం చేసుకుంది. ఇదివర




కటి వాళ్లా? ఇప్పుడీమా? రేపు ఇంకొకళ్లు అర్థం చేసుకుని లాలించే వాళ్లు దొరికితే'' అన్నాను కొంచెం గట్టిగా.

''పూర్తిగా అర్థం చేసుకుని ఆదరించగలవాళ్లు ఒక్కరు చాలు'' తన ధోరణిలోనే జవాబిచ్చాడు.

లేచివచ్చి కుర్చీలో కూర్చుని బీరు గ్లాసులో పోసుకుని తాగి నేను చూస్తున్న వాస్తవాన్ని అతడూ చూడాలన్న భావంతో అన్నాను.

''జీవన్ 'బ్లైండ్'గా మాట్లాడకు. ఇప్పుడిప్పుడే టీనేజ్ దాటిన వయసులో చుట్టూ ఉన్న పరిస్థితుల్ని గమనిస్తూ వాటి నుండి దూరంగా పోవాలనుకుంటూ అందుకో అవుట్ లెట్‌కోసం, తపనతో అల్లుకోవడానికి ఒక ఆకర్షణకోసం వెదుక్కుంటూ చనువుని తన ఆకర్షణతో బంధించి తేలిగ్గా అందుతున్నందున ఆ బంధాన్ని ముడిపెట్టుకోవాలనే ఆరాటంలో అంతగా ఆలోచన ఉందని అనుకోను నేను...''

నా మాటలు పూర్తిగాకుండా అడ్డుపడి ఏదో చెప్పబోయిన జీవన్‌ని చేతి సైగ తోనే ఆపుతూ- ''కాని ఉందంటావు నీవు. నీకు తెల్సు. చూసిన పరిస్థితులు, చుట్టూ ఉన్న పరిస్థితులు కల్పించిన ఆలోచనలవి. వాటిలో పరిపక్వతలేదు. ఆమెలో మనసును నిలకడగా ఉంచనీయని వయసు, జంటకోసం హృదయం తపన. ఓదార్పులకోసం ఆరాటం. ఆర్తి నీలోనూ అంతే. అందుకే దగ్గరై ఉండవచ్చు మీరు. ఆమెలోని స్తబ్దత గమనించే ఉంటావు. నా ఊహ ప్రకారం అది ఆమె సబ్ కాన్షియస్‌లోదాగిన కసి....''

''కసా? ఎందుకూ'' మళ్లీ అడ్డుపడి ఆశ్చర్యంగా అడిగాడు.

''అవును కసే. అది కోరికగా మారి ఆకర్షణ పథంలో పయనించిందనేది పచ్చినిజం. ఆ కసి, కోరిక నీపై చిలుకరించిన చినుకులకు నీలో మండే హృదయం చల్లబడిందని భావించడం, ఆ చినుకుల్ని ఆత్రంగా అందుకుని చిగురించాలని అనుకోవడమూ పచ్చి నిజం. ఆమెస్థితి ఆమెకు తెలిసేలా వివరంగా చెప్పి తనని తను గుర్తించేలా చేయడం మంచిది'' అన్నాను.

''ఆమెలో కసి అనేది ఉందని ఎలా అనుకుంటున్నావు''

''ఆమె పెరిగిన వాతావరణం,తండ్రి ప్రేమకు దూరమైన ఆడపిల్లగా, తల్లి పతనం, అన్నల చెడుతిరుగుళ్లు చూస్తూ ఎదిగింది. బాకుల్లాంటి లోకుల మాటలు, అపహాస్యాలు ఇంకేమైనా కుటుంబ అంతర్గత విషయాలు అన్నీ ఒకటని కాదు. ఇంకెన్నో కలిసి ఆమె సబ్ కాన్షియస్‌లో తిష్టవేసి ఒకవిధమైన కసిని కోపాన్ని పెంచి ఆమెకే తెలియక ఒక సినిక్ ఫీలింగ్‌ని పెంచాయి''

''అది నీ ఊహ మాత్రమే. ఆమెలో ఆలోచన ఉంది'' అన్నాడు జీవన్.

''ఆలోచన లేదని నేనడంలేదు. నేను చూపించేది ఆమెలో నీవు చూడని లోతుల్ని భావాల్ని. నీకెలా తెలుసంటావేమో. ఆమెను చూస్తూ పరికిస్తూ నా మనసు రూపొందించుకున్న అవగాహన. దాని మీద నీకు నమ్మకంలేక పోవచ్చు. అయినా దాన్ని చూపించడం నా బాధ్యత. ఒక స్నేహితుడిగా అదీ మీ మేలుకే సుమా. నా ప్రయత్నమంతా - ఆమెలోని కసి, ఇతరమైన భావాల వేళ్లెక్కడ ఎలా పాతుకున్నాయో వివరించడమే. నీలోని వివేకం ఏమవుతోంది. ఇంతగా మనసును నమ్మించుకుని మమ్మల్ని మీరెందుకు మోసం చేసుకుంటారు'' అని ఆగాను.

''నీవనుకుంటున్నట్లు మేము భ్రమలో లేము. మమ్మల్ని మేము మోసం చేసుకోవడంలేదు. అన్ని విషయాలు తర్కించి చర్చించుకుని ఏ పరిస్థితికైనా తట్టుకుని నిలబడగలమనే ధైర్యం ఉండబట్టే ఈ నిర్ణయానికి వచ్చాం. నీకంటే ఆప్తుడెవరూలేరు కనుక సాయంచేయగల వన్న నమ్మకంతో నీతో చెప్తున్నాను'' చివరి మాటలు కాస్త నిష్ఠూరం ధ్వనించేట్లుగా అన్నాడు జీవన్.

''నీవసలు నీ పరిస్థితి, నీ చుట్టూ ఉన్నవారి గురించి ఆలోచించవెందుకని? తెలిసి తెలిసి ఊబిలో దిగుతూ అందుకో అని చేయందిస్తే నా చేయి అందించకుండా ఉండనా? లేక చేయి అందించి నేనూ ఊబిలో దిగబడనా'' అనడిగాను.

జీవన్ బదులు చెప్పకుండా తల కుర్చీకి ఆనించి ఆకాశాన్ని చూస్తూండిపోయాడు. అతడు మాట్లాడక పోవడంతో, ''వేరే పరిస్థితుల్లో

మమ్మల్ని మీ అవసరాల్ని మీ లోపలి కదలికల్ని వాటి కారణాల్ని సమర్థించగలనేమోకాని ఎన్నో బాధ్యతల్ని తెంచుకోని బంధాల్ని ఉంచుకుని ఈ ముడిలో ఇరుక్కుని నీ చేతుల్తోనే దాన్ని మరింత చిక్కు చేసి విప్పలేక సతమతమవడాన్ని సమర్థించను. ఆమె పెంచుకున్న ప్రలోభాన్ని ఇంకా పెంచకు జీవన్. స్నేహితుడవని చేరదీసి తమతో ఉంచుకున్నందుకు ద్రోహంచేసావని భావించరా వాళ్లు'' అన్నాను.

''నేను ద్రోహంచేయడంలేదు'' అన్నాడు జీవన్.

''అని నీవనుకుంటే సరిపోదు. రేపు వాళ్లు నిన్నన్నే మాట అదే. అవసరాలు కల్పించిన అవకాశం నీలోని ఇంగిత జ్ఞానాన్ని చంపేసింది. నా మాట విని ఇక్కడితో దానికి ఫుల్ స్టాప్ పెట్టేయి. ఈ కోతతో ఎన్ని గుండె కోతలో తగ్గుతాయి''

''మాలో లేనివి ఊహించి వాటిని మాకు అంటగడుతున్నావు నీవు'' అన్నాడు చాలా సీరియస్‌గా.

''లేవని ఇప్పుడంటున్నారు. ముందు ముందు కూడా అనగలిగితే మంచిదే'' అని ఊరుకుండి పోయాను.

ఎంతగా చెప్పినా కనీసం ఆలోచించడానికి కూడా ఒప్పుకోని జీవన్ ధోరణి నాకు చిరాకు కలిగించింది.

ఇద్దరం మౌనంగా ఉండిపోయాం బీర్ ఒక్కో గుటక వేస్తూ ఎవరి ఆలోచన్లో వాళ్లం.

ఎంతో సేపటికి ఆఖరి ప్రయత్నంగా నచ్చచెబుతూ- ''జీవన్... సుఖంలేని బాధని మిగిల్చే గెలుపుకన్నా తాత్కాలికంగా బాధను కలిగించినా మరోసారి గెలుపు దిశగా నడిపించే ఓటమి గొప్పది నా దృష్టిలో. ఓడిపోయి గెలుస్తావో, గెలిచి ఓడిపోతావో అది నీకై నీవు నిర్ణయించుకోవాలి. జీవితం విషమైతే తాగి జీర్ణించుకోవడం అలవాటు చేసుకోవాలి. కాని నిన్ను నీవే తెలివి హీనతతో పోగొట్టుకోవడం మంచిది కాదు'' అన్నాను.

నేను చెప్పింది పట్టించుకోకుండా ''నువ్వు వాళ్లన్నయ్యలతో మాట్లాడుతావా లేదా'' అనడిగాడు జీవన్.

''చూడూ... నువ్వు చెప్పకముందే ఆమెతో ప్రేమలో పడ్డావని పసికట్టినా ఆ విషయం నాకే ఎంతో చికాకు కలిగించింది. మరి అది వాళ్లకు తెలిస్తే అర్థం చేసుకోలేక, సెంటిమెంట్స్‌కి తగిలే దెబ్బని వాళ్లెలా భరించగలరు. మొరటుగా ఉద్రేక ఉద్వేగాల్ని వ్యక్తం చేసే వాళ్లు ఎలా సాఫ్ట్‌గా తీసుకోగలరనుకుంటావు. అలా తీసుకుని ఆదరిస్తే అదృష్టవంతులే మీరు. అయినా వాళ్లతో మాట్లాడాలంటే ముందు నేను ఆమెను ఒంటరిగా కలిసి మాట్లాడాలి. అది ఆ ఇంట్లో కుదరదు కనక నా తిప్పలేవో నేను పడతాను. నీవు మాత్రం నేను చెప్పేంత వరకు ఒక్క అడుగుముందుకు వేయరాదీ విషయంలో. ఏమంటావ్?'' అన్నాను.

ఒక నిముషం ఆలోచించి ''అలాగే'' అన్నాడు.



నాగభూషణం, కరుణాకర్ అన్నదమ్ములు. పూర్ణిమ వాళ్ల చెల్లెలు. వాళ్ల స్వస్థలం విజయవాడ సమీపంలోని ఓ పల్లెటూరు.

ఆ అన్నదమ్ములిద్దరితోను నాకు స్నేహం.

మొదట పరిచయం కరుణాకర్‌తో, అతను మోటార్ మెకానిక్. మా ఇంటికి రెండిళ్ల అవతల ఉన్న ఖాళీస్థలంలో షెడ్ పెట్టుకున్నాడు. రెండు, మూడుసార్లు నా స్కూటర్‌కి మైనర్ రిపేర్ రావడంతో అతడికి చూపించాను. అలా అతడితో పరిచయం కలిగింది.

అతనిలో ఒక విధమైన అమాయకత్వం, వినయం కన్పించి, మాట తీరు నన్నాకర్షించి అతడితో పరిచయం పెంచుకునేలా చేసాయి. వయసులో నాకంటే నాలుగైదేళ్లు చిన్నయినా కరుణాకర్‌తో పెరిగిన పరిచయం స్వల్పకా

లంలో సన్నిహితంగా మారింది.

కరుణాకర్ తండ్రి వీళ్ల చిన్నతనంలోనే భార్యను, పిల్లల్ని వదిలేసి దేశంమీదపడి ఎక్కడెక్కడో తిరిగి తిరిగి వచ్చి విజయవాడలో ఒకావిడతో కలిసివుంటూ ఏదో వ్యాపారం చేసు కుంటున్నాడు. ఆయన తనకుటుంబంతో సంబంధాన్ని పూర్తిగా తెంచేసుకున్నాడు. అందుకు కారణం నాగభూషణం, కరుణాకర్‌ల కి కూడా స్పష్టంగా తెలియదు. వీళ్లకీ తండ్రి అంటే పెద్దగా గిట్టదు. తండ్రి వదిలేయడంతో వీళ్ల భారం తల్లిమీద పడింది.

వీళ్ల చిన్నతనంలోనే తల్లికి మరొక వ్యక్తితో సంబంధం ఏర్పడింది. అది బలపడి కాలంతో పాటే కొనసాగుతూవస్తోంది. అతడుండేది తెనా లిలో అయినా తరచుగా వీళ్లదగ్గరకు వచ్చిపో తుండేవాడు. ఆ వ్యక్తిని వీళ్లు బాబాయి అని పిలిచేవారు. అతడే పిల్లల బాగోగులు, కుటుంబానికి అవసరమైన చిన్నా చితక ఖర్చులు చూసేవాడు. నాగభూషణం కొంచెం పెరిగి పెద్దయ్యాక కుటుంబ భారాన్ని తన భుజాలమీద వేసుకుని కొంతకాలం లారీమీద క్లీనర్‌గా ఉంటూ డ్రైవింగ్ నేర్చుకుని లారీ డ్రైవర్ అయ్యాడు. ఆ తర్వాత ఒక ఖండసారి చక్కెరఫ్యాక్టరీలో, చివరకు లారీ సప్లై ఆఫీ సులో గుమస్తాగా ఉద్యోగాలు చేసాడు. ఇప్పుడు తనే ఒక సెకండ్‌హ్యాండ్ లారీ కొని దాన్ని ట్రాన్స్‌పోర్టు కంపెనీలో కాంట్రాక్టుకు పెట్టాడు.

కరుణాకర్ నాలుగో తరగతి ముచ్చటగా మూడుసార్లు తప్పి చదువుకు గుడ్‌బై చెప్పేసా డు. అల్లరి చిల్లరిగా తిరుగుతున్న అతణ్ణి వాళ్ల బాబాయి తనకు తెలిసిన ఒక మోటార్ మెకా నిక్‌షెడ్‌లో చేర్పించాడు. అందులో తొమ్మిదేళ్ల అనుభవం సంపాదించాక తెనాలి చుట్టుప క్కల ప్రాంతాల్లో ఒకటి, రెండేళ్లు షెడ్డు స్వంతంగా పెట్టుకున్నాడు. ఐదేళ్లక్రితం ఇక్క డికి వచ్చి ముందు ఇంకొకరితో కలిసి, ఆ తర్వాత స్వంతంగా షెడ్డు పెట్టుకుని స్థిరపడ్డా డు. చిన్నవయసే అయినా మోటర్ ఫీల్డులో సహజమైన అన్ని వ్యసనాలు కరుణాకర్‌కి అబ్బాయి.

ఇవన్నీ కరుణాకర్‌ద్వారానే నాకు తెల్సిన విషయాలు.

ఎన్నో విషయాలలో నేనతడితో విభేదించేవా ణ్ణి. అయినా అది మా స్నేహానికి అడ్డేమీ కాలేదు. పెరిగిన చనువుని పురస్కరించుకుని కొంతవరకు అతణ్ణి మార్చాలని ప్రయత్నించే వాణ్ణి. అలాంటి ప్రయత్నం చేసినప్పుడల్లా "మీరంత శ్రమ పడడం అనవసరం గురువు గారూ" అనేవాడు నవ్వేసి.

నేను కరుణాకర్‌తో చనువుగా ఉండడం మా ఇంట్లో నచ్చక "ఆ మెకానిక్‌తో నీకు స్నేహమే మిటిరా" అని ఏవగించుకునేవారు. అయినా నేను లెక్కచేసేవాణ్ణి కాదు.

మొదటినుండీ నాది ఒకరు చెబితే వినే స్వభావం కాదు. ఎవరేమనుకున్నా నాకు నచ్చింది చేసుకుపోతూండేవాణ్ణి. మా వాళ్లకు అది గిట్టక "'మొండి ఘటం', వినిచావడు" అని విసుక్కునేవారు. ముఖ్యంగా అన్నయ్య వీలుదొరికితేచాలు నామీద విరుచుకుపడి నన్ను సంస్కరించెయ్యాలనుకుంటాడు.

కరుణాకర్ వచ్చిన కొంతకాలానికి నాగభూ షణం ఇక్కడ క్వారీ తోలకాలు లాభసాటిగా ఉన్నాయని వచ్చి ఒక కాంట్రాక్టరు దగ్గర సబ్‌కాంట్రాక్టు తీసుకున్నాడు. అన్నదమ్ములిద్ద రూ కల్సి మా పక్కవీధిలోనే చిన్న పోర్షను తీసుకుని ఉండడంతో కరుణాకర్‌దగ్గరకు అప్పుడప్పుడు వెళ్తుండే నాకు నాగభూష ణంతో కూడా మంచి పరిచయం ఏర్పడింది. అతడిలో నీతిపరుడిగా కన్పించాలనే తాప త్రయం ఎక్కువ. అది నాకు చికాకు.

వీళ్ళ ద్వారానే నాకు జీవన్‌తో పరిచయమ యింది. జీవన్ నాగభూషణానికి చిన్ననాటి నుండి మిత్రుడు. ఇక్కడ ఒక ప్రైవేటు స్టీల్ రోలింగ్ మిల్లులో ఉద్యోగం చేస్తున్న జీవన్ నాగభూషణం వచ్చాక ఆ అన్నదమ్ములతోటే కలిసి ఉంటున్నాడు.

ఒక్కొక్కర్ని చూస్తే నాకు ఎంతో సన్నిహితు ల్లా అన్పిస్తారు- మొదటిసారి చూసినప్పుడు. నాకు ఆ వ్యక్తితో ఎక్కడో ఎలాంటిదో గాఢాను బంధం ఉన్నట్లు ఫీలవుతాను. అటువంటి వ్యక్తితో కలిసే పరిచయం గాఢమైన స్నేహ బంధంగా మారుతుంది.

జీవన్‌ని మొదటిసారి చూసినప్పుడే నాకు ఇతడితో సన్నిహితత్వం ఏర్పడబోతోంది అన్పించింది. కాలం నా భావనను నిజంచేయ

డమేకాక జీవన్‌ని నా కత్యంత ఆప్తుడిగా మిగిల్చింది.

తనకు సంబంధించిన ఏ విషయాన్నీ - ఆది ఎటువంటిదైనా - జీవన్ నా దగ్గర దాచలేదు. ప్రతిదీ నాతో చెప్పుకునేవాడు.

కరుణాకర్ తల్లివిషయం, అతడి వ్యసనాలు, శ్రీరంగనీతులు వల్లించే నాగభూషణం చేసిన ఘనకార్యాలు, జీవన్ జీవితంలో ఎదురైన ఒడిదుడుకులు, వాటిని తట్టుకోలేని అతడి ప్రవర్తన - అన్నీ నాకు తెల్సినా అవేవీ నా ధృక్పథాన్ని మార్చలేదు. పైగా వీళ్లతో తిరిగి వీళ్లు పెరిగిన వాతావరణం, వీళ్లని అడుగడుగునా చరిత్రహీనతలోకి నడిపిస్తున్న చుట్టూవున్న పరిస్థితులు, వీళ్ల మనస్తత్వం తెలుసుకుని అర్థంచేసుకునే అవకాశం కలిగి నాలో ఒక విధమైన విశాలతా ధృక్పథం ఏర్పడిందేకాని వాళ్లని నేను ఏనాడూ ఈసడించుకోలేదు. వాళ్ల మనస్తత్వాలను, వాళ్ల తప్పుల్ని వాళ్లకే వివరించి చెప్పి, విశ్లేషించి చూపించి, వాళ్లలో మనిషిగా ఉన్నతంగా పెరిగే స్వభావం కల్పించాలని, నైతికంగా వాళ్ల స్థాయిని పెంచాలని అనుకునేవాణ్ణి, ఆరాటపడేవాణ్ణి.

జీవన్‌లో సున్నితమైన మనసుందని, దానికి స్పందన తెలిసినా కలిగిన అనుభవాలవల్ల అతడి ఆలోచన, నడవడి తప్పుదారి పట్టి మనుషులపట్ల తప్పుడు అవగాహనలో ఉన్నాడని గ్రహించి అతడికి ఎన్నో విషయాలు చెప్పి ఆలోచన పెంచి మానసికంగా అతడెదిగేలా చేయాలని ప్రయత్నించాను.

వీళ్లందరికంటే నా ఆలోచనాస్థాయి మెరుగనే ఆత్మవిశ్వాసం నాలోఉండడవల్లే అలా ప్రయత్నించేవాణ్ణి.

నాగభూషణం చెల్లెలి చదువువల్ల - తను ఇక్కడికి వచ్చేసినప్పటికీ - తల్లి, చెల్లిని కొంత కాలం తమ ఊళ్లోనే ఉంచాడు. అప్పుడప్పుడు సెలవులకు తన అన్నయ్యలదగ్గరకు వచ్చివెళ్తుండేది పూర్ణిమ. నాగభూషణం, కరుణాకర్‌లతో కూడా సన్నిహితంగా ఉండే నన్నూ అన్నయ్యా అని పిలిచేది.

పూర్ణిమలోని నెమ్మదితనంలో ఏదో స్తబ్దత ఉందనిపించేది నాకు. 'ఈ పిల్లలో ఇంత చిన్నవయసులో ఇంత నిస్తేజత ఏమిటా' అనుకునేవాణ్ణి. పెద్ద చలాకీగా ఉండేదికాదు. ఎప్పుడూ ఏదో ఆలోచనాస్రవంతిలో ఈదుతున్నట్లుండేది. బిడియంగా, ఎవరైనా - ఆఖరికి నేనైనా - ఉంటే తన అన్నయ్యలతోటే స్వతంత్రంగా మాట్లాడేది కాదు. మెల్లమెల్లగా నేనే చొరవగా చెల్లీ అని పిలుస్తూ మాట్లాడడం ఆ బిడియాన్ని తగ్గించి కొంత చనువుగా ఉండేలా చేసింది. అయినా ఆమెలో సహజమైన స్తబ్దత తొలగినట్లనిపించేది కాదు నాకు.

పూర్ణిమ అప్పుడప్పుడు నన్ను పరీక్షగా, ప్రశ్నిస్తున్నట్లు చూసేది. మొదట్లో అది నాకర్థం కాలేదు. తర్వాత తెలిసింది - ఇంత చదువుకున్న వ్యక్తి వీళ్లతో ఇంత సన్నిహితంగా, చనువుగా ఎలా, ఎందుకు ఉంటున్నాడా అనేది దానర్థమని.

పూర్ణిమ పరీక్షలయ్యాక నాగభూషణం తల్లిని, చెల్లిని తీసుకువచ్చేసాడు. వాళ్ల బాబాయి ఇక్కడికీ అడపాదడపా వచ్చిపోతూండేవాడు. నేనెప్పుడూ ఆయనతో పరిచయం పెంచుకోలేదు. ఎందుకో నాకు మనసొప్పేది కాదు. ఆయనతో నా పరిచయం నమస్కారాలవరకే పరిమితమయింది.

★ ★ ★

వన్ తన విషయం చెప్పాక రెండు మూడు రోజులు ఆఫీసుపనుల ఒత్తిడితో నేను ఎవరినీ కలవలేదు. ఆ తర్వాత వారంరోజులు అమలాపురం క్యాంప్ వెళ్లవలసివచ్చింది. క్యాంప్ నుండి వచ్చాక మళ్లీ నాలుగైదురోజులు పనిఒత్తిడి.

అలా రెండువారాలుపైనే గడిచిపోయింది.

ఒక ఆదివారం ఉదయం-

నాగభూషణం ఇంటికి వెళ్లి వాళ్లమ్మతో చెప్పి పూర్ణిమను మా ఇంటికి భోజనానికి తీసుకువచ్చాను.

పూర్ణిమ వాళ్లమ్మ ఇక్కడికొచ్చాక ఒకసారి పూర్ణిమను తీసికెళ్లి అమ్మకు పరిచయం చేశాను. తీరికగా ఉన్నప్పుడల్లా ఆమె మా ఇంటికి వస్తుండేది. వచ్చినప్పుడల్లా చిన్న చిన్నపనుల్లో అమ్మకు సాయం చేస్తుండేది. లైబ్రరీనుండి పుస్తకాలు తెచ్చిపెట్టేది. పూర్ణిమ నెమ్మదితనం, పెద్దలకు ఇచ్చే గౌరవం, వినయం అమ్మకు నచ్చి ఆమెతో ఆప్యాయంగా ఉండేది.




భోజనం చేశాక పూర్ణిమను నా గదిలోకి తీసికెళ్ళి కూర్చోమన్నాను.

నేను తనతో ఏదో మాట్లాడదలచుకున్నానని గ్రహించింది. కూర్చుని 'ఏమిటన్నయ్యా' అన డిగింది.

నేనేం మాట్లాడకపోవడంతో టేబుల్‌మీదు న్న వీక్లీ తీసుకుని పేజీలు తిరగేస్తోంది.

ఎలా మొదలుపెట్టాలా అని ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించి కిటికీ దగ్గరకు వెళ్లి నుంచుని పూర్ణిమను నఖశిఖపర్యంతం పరీక్షగా చూశాను.

గుండ్రటి ముఖం. వెడల్పైన పెద్ద కళ్లు. ఒత్తుగా తుమ్మెదరెక్కల్లా ఉన్న కనురెప్పలు. చిన్నదైనా తీర్చిదిద్దినట్లున్న ముక్కు. ముక్కుకు చిన్న ఎర్రరాయి ముక్కుపుడక. లేత గోధుమ రంగులోని చిన్న పెదిమలు- చిన్నపిల్ల మారాంచేసి అలిగి మూతిముడుచుకున్న ట్లుంటాయి ఆ పెదవులు కలిసిఉన్నప్పుడు పొడవు, పొట్టీకాక, మధ్యస్తంగా ఉన్న జుట్టు. కాఫీరంగు అంచు, అదేరంగు చుక్కలున్న తెల్లని పట్టులంగా. తెల్లజాకెట్, కాఫీరంగు ఓణీ. లేత పసుపువచ్చని మేనిఛాయ. కళ్ళు చెదరగొట్టే అందం కాకపోయినా పూర్ణిమ అందగత్తెకిందే లెక్క. ఆ అందం ఆరాధనను కలిగించే అందం. వయసుకు మించిన పెద్ద రికం వుంది మనిషిలో.

పూర్ణిమనే చూస్తూ గొంతు సరిచేసుకుని అన్నాను- "పూర్ణిమా... మనం మీ ఇంట్లో మాట్లాడుకోలేని విషయమై మాట్లాడటానికే నిన్నిక్కడకు తీసుకువచ్చాను. ఈ విషయంలో నీ అభిప్రాయాలు, ఆలోచనలు తెలుసుకుందా మని మాత్రమే"

నా మాటలువిని పూర్ణిమ ఏం మాట్లాడలే దు. అసలు ఏమిటో చెప్పమన్నట్లు చూసింది.

జీవన్ ప్రస్తుతం ప్రేమించేది పూర్ణిమనే. ఆమె కూడా అతణ్ణి ఆరాధిస్తోంది.

చిన్నప్పటినుండి అంటే నాగభూషణంతో స్నేహం మొదలైననాటినుండి జీవన్ పూర్ణి మకు తెలుసు. అప్పటికి ఆమె చాలా చిన్న పిల్ల. ఇప్పటి పూర్ణిమ చిన్నదికాదు. ఎదిగిన వయసుతోపాటు మనసూ ఎదిగింది. మొదట్లో జీవన్‌లో ఆమెపట్ల ఏ భావమూ లేదు. తన గతానుభవాల దృష్ట్యా స్త్రీ గురించి ఆలో చించడం మానేశాడు జీవన్. కనీసం మానేశా నని అనుకున్నాడు. పూర్ణిమ ఒకసారి దసరా సెలవులకు ఇక్కడికి వచ్చినప్పుడు ఆమె అత డిపట్ల ప్రదర్శించిన ఆసక్తి, ఆమె ప్రవర్తన జీవన్‌లో నిదురించిన కలను లేపాయి. మళ్లీ స్త్రీ గురించి ఆలోచించేలా చేశాయి.

అతడి గురించి పూర్ణిమకు పూర్తిగా అంటే అతని జీవితంలోని ఒడిదుడుకులు అన్నీ తెలుసు. అందుకే ఆమె ప్రవర్తన మొదట అతడికి ఆశ్చర్యం కలిగించినా తర్వాత తర్వాత అతడిలో ఆశ చిగురించింది. ఆమె మాటల్లో వ్యక్తంచేసే అనురాగభావన గుర్తించి ఆమెకు తెలిసినవే అయినా తన విషయాల న్నీ చెప్పి- "నేనూహించినటువంటి భావాన్ని నామీద నీవు ఏర్పరచుకుంటే అది తగద"న్నా డు.

"నాకన్నీ తెలుసు. చిన్నప్పటినుండీ నిన్ను చూస్తూనేవున్నాను. నాకు వయసు వచ్చాక, నా మనసు పెరిగాక నీ గురించి నా దృష్టితో ఆలోచించాను. నీ జీవితంలో ఎదురైన అనుభ వాలు నీ దోషఫలితం కాదు. వాటి మూలంగా నీ ప్రవర్తనను తప్పు పట్టను. జీవితం దారిత ప్పినస్థితిలో ఏదో ఆలంబనం కోసం నీవుపడే ఆరాటంలో అందినవాటిని ఆలంబనగా చేసు కున్నావు. అవి కొన్ని మజిలీలు మాత్రమే. నీవు పెట్టుకున్న సంబంధాలలో బంధం లేదు. కా దంటావా" అంది పూర్ణిమ.

"బంధం ఉందనుకున్నాను. కాని నీవన్న ట్లు జీవితగమనంలో అవి మజిలీలు మాత్రమే నని ఆలస్యంగా తెలిసింది. అయినా నీవు నాతో బంధం ఏర్పరచుకోవాలని చూడడం తప్పు" అన్నాడు జీవన్.

"ఎవరి దృష్టిలో"

"నా దృష్టిలో. నా గతాన్ని దృష్టిలో పెట్టుకు న్నా ఒక మనిషిగా నేను ఆలోచించినా"

"దానికి నా జవాబు చెప్పేశాను. నాకన్నీ తెలిసి నా దృష్టిలో ఆలోచించుకునే చొరవచేసి నేనే ఈ ప్రస్తావన తెస్తున్నాను" అంది పూర్ణిమ.

"మీ వాళ్లందరి దృష్టిలో, లోకం దృష్టిలో తప్పవుతుందేమో. అదీ ఆలోచించాలిగా" అన్నాడు జీవన్.

"వాళ్లేం పవిత్రులు కారు. అయినా వాళ్ల దృష్టిలో ఇది తప్పు కావచ్చు. కాని నా దృష్టిలో కాదు. జీవితంలో దెబ్బతిని ఉన్నావు కాబట్టి అందరినీ అనుమానించే స్థితిలో ఉన్నావు నీవు. నన్ను నేను సంవత్సరకాలంగా సమీక్షించుకుంటూ నేనే కోరుకుంటున్నదానికి ఒక అర్థాన్ని ఒక విలువను కల్పించుకున్నాను అది ఎవరో ఏదో అంటారని మార్చుకోలేను. అది ఆలోచన శూన్యమైనవాళ్లు చేసేపని. నాలో ఆలోచన వుంది. స్థిరత్వమూ ఉంది. కులాలను మించిన పరిణతి చెందిన మానసికమైన దృక్పథం ఉంది. అర్థం చేసుకోగల హృదయం ఉంది. నీపట్ల నేనేర్పరచుకున్న భావానికి నీ సమాధానం మాత్రమే కావాలి" అంది. ఆమె మాటల్లో వయసు చాపల్యం ఎంతమాత్రం లేకపోగా గొంతులో స్థిరనిశ్చయం ధ్వనించింది.

"సమయం కావాలి. ఇప్పుడే చెప్పలేను" అన్నాడు జీవన్.

"నీ ఇష్టం. నాది మాత్రం స్థిరాభిప్రాయం" అంది.

"ఒకవేళ నేనంగీకరించకపోతే" అన్న జీవన్ని ఒక నిమిషం మౌనంగా చూసి- "తప్ప



కుండా అంగీకరిస్తావు. నాకా నమ్మకం వుంది'' అని అక్కడినుండి వెళ్లిపోయింది పూర్ణిమ.

సెలవులయిపోగానే వెళుతూ కాలేజి అడ్రసు జీవన్ కిచ్చివెళ్లింది. పూర్ణిమ ఇక్కడకు వచ్చేవరకు వాళ్లిద్దరి మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు సాగాయి.

జీవన్ ఇదంతా నాకు చెప్పి- ''పూర్ణిమవైపు నేను వెంటనే ఆకర్షితుణ్ణి కాలేదు. నా భయాలు నాకుంటాయిగా. అందుకే ఎన్నోసార్లు నాలో నేను తర్కించుకున్నాను. ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాల్ని అనేకమార్లు విశ్లేషించి ఆమె లేఖల్లో కనిపించే హృదయమార్దవాన్ని, ఔన్నత్యాన్ని గమనించి క్రమంగా పూర్ణిమపట్ల ఆకర్షితుడనయ్యాను. అది బలపడింది. పూర్ణిమ మళ్లీ క్రిస్టమస్ సెలవులకు ఇక్కడకు వచ్చినప్పుడు ఎప్పుడైనా నాగభూషణం, కరుణాకర్ ఇంట్లో లేనప్పుడు ఇద్దరం ఎన్నో చర్చించుకునేవాళ్లం. అలాంటి ఏకాంతం మాకు తక్కువగా లభించినా అవకాశం దొరికినప్పుడు మా గతం, వర్తమానం, సాధ్యమైతే మేము కలిసి గడిపే భవిష్యత్ గురించి మనసువిప్పి మాట్లాడుకునేవాళ్లం. అలా మా అనుబంధం పెరిగింది. ఒకసారి మాకు లభించిన ఏకాంతంలో అనుకోకుండా శారీరకంగా కలిశాం. ఆమె ఓదార్పు, చూపే జాలి, ప్రేమతో భౌతికమైన ఆమె సన్నిధి నన్నాకర్షించి అమితంగా ఉద్వేగం పెంచిన క్షణమది. ఆమె కూడా తనకు తానుగా ఏ అభ్యంతరం లేకుండా అర్పించుకుంది'' అని చెప్పాడు.

''ఇదంతా ముందుగానే నీకు చెప్పాలని నా మనసెంతో ఉబలాటపడేది. కాని నువ్వెలా రిసీవ్ చేసుకుంటావోననే సందేహంతో బలవంతంగా నాలోనే దాచుకున్నాను. మేం కలియడాన్ని తొందరపాటుని నీవు ఈసడించుకోవచ్చు. కాని మేం నిజమైన అనురాగాంతరంగాలలో ఒకటయ్యాం. అది మానసికంగా మా ప్రేమను మరింత బలబరిచింది'' అన్నాడు

ఒకటి రెండుసార్లు వీళ్లు ఒంటరిగా ఉండడం చూశాను. నాగభూషణం కుటుంబంలో జీవన్ ఒకడిగా మెలగడంవల్ల అప్పట్లో నాకే అనుమానం కలగలేదు.

నేను క్యాంప్‌కి వెళ్లకముందు ఇదంతా వివరంగా చెప్పిన జీవన్, క్యాంపునుండి వచ్చాక తమ విషయం నాతో చెప్పినట్లుగా పూర్ణిమకు తెలిపానని, ఇంకొక వ్యక్తికి తమ శారీరక సంబంధంతోసహా తెలిసిందనే బెదురు లేకపోగా ఆ అన్నయ్యకు చెప్పి 'మంచిపని చేశావం'దని చెప్పాడు నాకు.

అయినా జీవన్ నాకీ విషయాలు చెప్పడం గురించి చెప్పి, వాళ్లపై నాలో ఉన్నభావాలు, అభిప్రాయాలు మానసికంగా ఆమె ఎలాంటి స్థితిలో ఉందని జీవన్‌తో అన్నానో అదంతా చెప్పి- ''ఇదీ నేననుకుంటున్నది. అబద్ధమంటావా పూర్ణిమా'' అనడిగాను.

పూర్ణిమ నోరు విప్పలేదు. బిడియపడుతుందేమో నన్పించింది. ఆమె దగ్గరకు వెళ్లి భుజంతట్టి ఎదురుగా మంచంమీద కూర్చుని-

''పూర్ణిమా. మౌనం వహించాల్సిన విషయం కాదిది చెప్పు. నీ మనసులోని ఆవేదన, నీ ఆలోచన అన్నీ చెప్పు. నీ అన్నయ్యలతో నాకున్న సన్నిహితత్వం నువ్వూ నన్ను అన్నయ్యా అని పిలిచేలాచేసి నిన్ను నాకు చెల్లెల్ని చేసింది. నీ అన్నయ్యలతో చెప్పుకోలేకపోయినా నాకొచ్చిన కష్టం ఇదని నీలోని భావాలను నిర్భయంగా చెప్పుకోవడానికి, పంచుకోవడానికి నా దగ్గర సందేహించవద్దు. నా దగ్గర నీకు తగిన చనువుంది'' అన్నాను.

పూర్ణిమ తలపైకెత్తి చూసింది. ఆమె కళ్లల్లో తడిలోతుల్లో ప్రస్ఫుటంగా కనిపించే స్తబ్దతను చీల్చాలని చూసే అంతర్గతమైన తేజస్సేదో ఆ కళ్లలోయల్లో కనబడుతోంది. పరీక్షగా చూస్తే ఆ స్తబ్దత, తేజస్సు- పరస్పర విరుద్ధమైనవి- రెండూ ఏదో వింత ఆకర్షణను కల్పిస్తూన్నాయామెకు.

మెల్లగా ఆమె నోటినుండి మాటలు వెలువడ్డాయి.

''అన్నయ్యా. నా మనసునర్థం చేసుకుని నన్నంచనా వేసిన వ్యక్తి ఇంతవరకు నీ వొక్కడవే. ఈ మనుషులు, నా చుట్టూ ఉన్న పరిస్థితులు నాకు వయసుకు మించిన పాఠాన్ని నేర్పాయి. నేనే బాధ తెలియకుండా పెరిగింది ఏడెనిమిదేళ్ల వయసువరకు మాత్రమే. తర్వాత నా చుట్టూ వున్న వాతావరణం, మనుమల ప్రవర్తన ప్రభావం నాపై పనిచేయడం ప్రారంభించింది. తోటిపిల్లలెవరూ నాతో ఎక్కు




వగా కలిసేవారు కాదు. నన్ను వాళ్లతో ఆడని చ్చేవారు కాదు. అందరూ అమ్మ గురించి హేళనగా మాట్లాడేవాళ్లు. అప్పట్లో కారణం ఇదీ అని తెలిసేది కాదు. తోటిపిల్లలు ఇళ్లకు వెళ్లినా ఒకరిద్దరూ మినహా పెద్దవాళ్లతోసహా నాతో ఎవరూ ఆదరంగా మాట్లాడేవారు కాదు. ఆ వయసులోనే ఈ మనుషులపై కోపం, కసి చోటుచేసుకున్నాయి నాలో. కాని ఏంచేయలేక ఉక్రోషంతో ఏడ్చేసేదాన్ని. 'ఎప్పుడూ ఏడుపు మొహంతో తగలడతావేమే' అని అమ్మ, అన్న య్యలు తిట్టేవాళ్లు. ఇదంతా మీవల్లే అని చెప్పలేకపోయేదాన్ని. తప్పు ఒప్పు తెలియని వయసది. పెరుగుతున్నకొద్దీ ఒక్కో విషయం అవగతమవుతూ వచ్చింది నాకు. అమ్మ చే సింది తప్పుగా భావించడానికి నా మనసొప్పే దికాదు...''

''ఎందుకని'' పూర్ణిమ వాక్ప్రవాహానికి అడ్డు తగుల్తూ అడిగాను- ''ఇంటా బయటా వాతావ రణం నీకు ఇబ్బందికరంగా మారడానికి అదేగా కారణం''

''కట్టుకున్న భర్త దుర్వ్యసనాలకులోనై తనకో ఇల్లు, భార్య, పిల్లలు ఉన్నారని మరచి వాళ్లని దిక్కులేనివాళ్లుగా చేస్తే ఆవిడ చెయ్యగలిగేదే ముంది. దిగువ మధ్యతరగతికి చెంది, చదువు సంధ్యలు, ఆస్తిపాస్తులు లేని స్త్రీ ఎలా బతుకు తుంది? పిల్లలనెలా బతికించుకోగలుగు తుంది అని ఎవరూ ఆలోచించరు. ఆమె తప్పుచేస్తే దాన్ని మాత్రం పట్టించుకుని ఆమె బతుకును నరకం చేస్తారు. అంతేగా. అలాంటి స్త్రీని అయినవాళ్లు మాత్రం ఎంతకాలం ఆదు కుంటారు. పసిపిల్లలతో ఒంటరిగా ఉన్న స్త్రీకి రక్షణ కల్పించకపోగా వస్తులన్నా ఉండాలి గాని పరువుపోతే ఎలా అని ఆలోచిస్తారు. తన మనుగడకేకాక తన పిల్లలను పెంచి పెద్దచే యడం కోసం అమ్మ బాబాయికి చేరువ కా వడం తప్పనిపించేదికాదు నాకు. కాని అప్పుడ ప్పుడు అన్నిటినీ మరో కోణంనుండి సమీ క్షించుకుంటే నా ఆలోచనకు నా మనసే ఎదు రుతిరిగేది...'' అని అడిగింది పూర్ణిమ.

ఆమె ఆలోచనాధోరణి నా కాశ్చర్యంతోపాటు ఆనందం కూడా కలిగించింది. ఆమెలోని స్త బ్ధత వెనక ఎంతటి సంఘర్షణ ఉందో, ఆలో చన వెనక పరిణతి చెందుతున్న ఎంతటి అగాధాంతరంగం ఉందో ఆమె మాటలే తెలి యజేస్తున్నాయి. జీవన్ ఆమె గురించి చె ప్పినా, నేనూహించినా అది స్వల్పమే. ఆమాటే ఆమెతో అన్నాను.

''వయసుకు మించిన ఆలోచన, అవగా హన ఉన్నాయి పూర్ణిమా నీలో''

''కావొచ్చునన్నయ్యా రెండుమూడేళ్లుగా నాలో చాలా మార్పు వచ్చింది. అమ్మను, మమ్మల్ని ఎవరైనా కించపరిస్తే సహించేదా నిని కాదు. అలాంటి సమయాల్లో కొన్నిసార్లు కోపం అణచుకోలేక ఒకరిద్దరిని శారీరకంగా గాయపరిచాను కూడా. దానితో నాలోని కసి కొంత తగ్గేది. నా ఈ ప్రవర్తన ఫలితంగా నేనెన్నో నిందలకు గురికావల్సివచ్చింది. ఒక్కో సారి నాలో కలిగేబాధ, ఆవేశం అదుపులో పెట్టుకోలేక చచ్చిపోవాలని అన్పించేది. అది పరిష్కారం కాదని నన్ను నేను కంట్రోల్ చేసు కునేదాన్ని. ఒంటరిగా కూర్చుని నాలోని దుఃఖా న్ని వెలిగక్కి గుండె బరువుని కాసింత తగ్గించుకునేదాన్ని. ఒక ఓదార్పుకోసం, ప్రే మగా నిమిరే ఒక హస్తం కోసం,లాలించి అక్కున జేర్చుకునే ఒక హృదయం కోసం పరితపించిపోయేదాన్ని. నన్ను తమ వొడిలోకి తీసుకుని నాబాధను ఉపశమింపజేసే వాళ్ళెవ రూలేరే అని కుమిలిపోయేదాన్ని''

''అన్నయ్యలకు - వాళ్ల పనులు, తిరుగుళ్లు వాళ్ళవి. కట్టడి లేకుండా పెరిగిన వాళ్ళ ప్రవర్తన అప్పుడప్పుడు తలవొంపులు తెచ్చేది గానే ఉండేది. లోకుల మాటలు పట్టించుకునే వాళ్ళు. ఒకవేళ పట్టించుకుంటే అమ్మనే తిట్టే వాళ్లు. కారణం ఏదైనా అపుడప్పుడు ఆదుకునే బాబాయిని రావొద్దని చెప్పేవారు కాదు. వాళ్లు నన్ను ప్రేమగా పిలిచి మాట్లాడేది తక్కువ. ఇక అమ్మ ఆవిడను మెచ్చుకోవాలో, తిట్టుకో వాలో తెలిసేదికాదు. ఒకసారి దయగా మరొక సారి నీచంగా, అసహ్యంగా ప్రవర్తించేది. మాకోసం ఆమె సాగిన పథాన్ని సానుభూతితో అర్థంచేసుకున్నా ఆమె మీద నాకు పెద్దగా ప్రేమలేదు. కన్నది, పెంచడానికి కష్టప డిందనే కృతజ్ఞత తప్ప'' కళ్లలో ఉప్పొంగుతు న్న కన్నీటిని బయటకు రానీయకుండా అది మిపెట్టడానికి ప్రయత్నిస్తూ గాద్గదికంగా

అంది.

ఆప్యాయంగా ఆమె తలనిమిరాను "పూర్ణిమా! మీ అందరి గురించి తెలుసు కనుక నీలోని భావాలను, అంతరంగంలో అణిగిపోయిన ఉద్రేకాల్ని కొంతైనా ఊహించగలిగాను. నీలోని కోపాన్ని కసిని అణచుకుని మానసికంగా నలిగిపోతూ ప్రేమరాహిత్యంతో కుమిలిపోతూ గడిపావు. అందువల్లే నేనేమో అయిపోవాలి, ఏదో చేయాలనే అంతర్గత భావన బలమై ఇతరులను బాధపెట్టి నీకు కాస్త ఊరట కలిగించేది. అదేసమయంలో నీ మనసును ఒత్తిడికి గురిచేస్తూ నరకాన్ని చూపించేది. ఆ స్థితిని అధిగమించలేని బలహీనతతో ఉన్న నీవు ఓదార్పు, లాలన కోసం, మనశ్శాంతి కోసం నీకు నచ్చిన అందుబాటులో ఉన్న జీవన్‌ని ఒక ఆలంబనగా చేసుకోవడానికి ప్రయత్నించావు. అతడు కూడా ఇంచుమించు ఇలాంటి స్థితిలోనే ఉండటంవల్ల ఇద్దరూ ఒకరికొకరం అనుకుని చేరువయ్యారు"అని ఆగి ఒకక్షణం తర్వాత-

"మీరు శారీరకంగా ఎందుకు తొందరపడ్డారు" అని ప్రశ్నించాను.

పూర్ణిమ తలెత్తి నన్నుచూసి మళ్ళీ తల దించేసుకుందేకాని బదులివ్వలేదు.

"నేను చెప్తానువిను. కేవలం హృదయ బంధంతో ప్రేమసాంగత్యంలో సన్నిహితులై అలౌకిక ఆనందం పొందగలిగేవారు అరుదు ఈ ప్రపంచంలో. దానికి కారణాలు ఏవైనా అవి మనకనవసరం. మీ విషయానికివస్తే మామూలుగా హృదయ స్పందన కల్గించే భావనను తీవ్రతరంచేసి అది పెరగడానికి దోహదంచేసేది శారీరక అనుబంధం. ఆ సహజ సూత్రమే మీ అనుభవానికి కారణమయింది. వయసు కలిగించే ఆకర్షణ దానిని మరింత త్వరితంచేసింది. స్త్రీగా నీకిది తొలి అనుభవం" ఉద్దేశపూర్వకంగానే ఆపాను తను నొచ్చుకునే వీలుందని తెలిసినా.

అనుకున్నాట్లుగానే నా సంశయ వాక్యంవిని నన్ను చూసిన పూర్ణిమ చూపులో కాస్త వ్యతిరేకత దర్శనమిచ్చింది. అయినా ఏం మాట్లాడక అవునన్నట్లు తలూపింది.

"నీతోటి కలయిక జీవన్‌కీ తొలి అనుభవమే. అల్లాడే మీ ఇద్దరి హృదయాలకు ఆ అనుభవం హాయినైన ఒక తృప్తినిచ్చి ఒక అనుభూతిగా మిగిలింది. కోరుకున్నదేదో లభించేసిందని భ్రమలో పడి మొదటి అనుభవం మైకంలో కూరుకుపోయి దాన్ని గట్టిపరచుకుంటున్నారు. కాలం గడిచేకొద్దీ భ్రమలు తొలగిపోతాయి. తప్పుచేసామేమోననే భావన మిగులుతుంది. లభించిన కాసింత మనశ్శాంతి మటుమాయమైతే మిగిలేది దుఃఖమే" అన్నాను.

ఒక సన్నిహిత మిత్రుడితో మాట్లాడినట్లు విపులంగా వివరంగా మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాను. పూర్ణిమలో ఇంకా బిడియం ఏమాత్రమైనా పోగొట్టి ఆమెలోని భ్రమలు తొలిగించాలంటే అలా మాట్లాడటం అవసరమన్పించింది.

"అసలు నీకు జీవన్‌లో మనసనేది కన్పించిందా?" అనడిగాను.

"స్నేహంచేసే నీకు కన్పించలేదా అన్నయ్యా" తలవంచి తన చేతి వేళ్ళు చూసుకుంటూ నెమ్మదిగా ఎదురు ప్రశ్నించింది.

"కన్పించింది, అతనితో స్నేహంచేయడానికి నన్నాకర్షించిన వాటిలో అతనిలోని సున్నిత హృదయం కూడా ఒకటి"

"నాక్కనిపించింది కూడా అదే నన్నయ్యా"

"జీవితాల్ని పంచుకుని సుదీర్ఘ కాలం గడపడానికి అదొక్కటే చాలదు పూర్ణిమా"

దానికి ఆమె ఏమీ మాట్లాడకపోవడంతో "జీవన్‌పై ప్రేమభావన అనేది ఎప్పుడు మొదలయింది నీలో" అనడిగాను.

"దాదాపు సంవత్సరంక్రితం. చిన్నప్పటి నుండి చూస్తూన్నా అతడి గురించి సీరియస్‌గా ఆలోచించింది అప్పుడే. అతడి వివాహం విచ్ఛినం, సుగుణతో సంబంధం, అదీ విఫలం కావడం, వీటన్నిటితో అతడిలో పాతుకుపోయిన అశాంతి, ఆరాటం తపన వాటిలోపడి నలిగిపోవడం అన్నీ చూస్తున్న నాకు జీవన్‌మీద జాలికలిగేది. అతడి గురించిన ఆలోచనలు క్రమక్రమంగా నన్ను ఆక్రమించుకున్నాయి. బహుశా అన్నయ్యతో అతడికి గల స్నేహం మాఇంట్లో అందరితో ఉన్న





చనువువల్లఅతణ్ణి మానసికంగా దగ్గరకు తీసుకుని ఉండవచ్చు. తర్వాత తర్వాత జీవన్ నా భావాల్లో ధృడంగా నిలిచిపోయాడు''

''అతడి స్థితికి జాలికలిగిందని నీవే ఒప్పుకుంటున్నావు. ఆ జాలిని, నీలోని తపనను చల్లార్చుకోవడంకోసం ప్రేమగా భావించి అల్లుకుపోతున్నావేమో, ఆలోచించు. ప్రేమ అనేది ఒక మధురభావన. అది వ్యక్తి వ్యక్తిత్వం, ఔన్నత్యం, గుణం, రూపం అన్నింటిమీద ఆధారపడి ఉన్నప్పుడే బలవత్తరమవుతుంది. మీ మీ వ్యక్తిత్వాలని ఒకరినొకరు సరిగా అంచనావేసుకోగలిగి దగ్గర కావాలని ప్రయత్నిస్తే అది వేరు. అంతే గాని జాలి, ఓదార్పుల ముసుగుతో కాదు. విశ్లేషించుకోగలిగిన ఆలోచన, అవగాహన ముఖ్యం. స్పష్టమైన అవగాహనతో కూడిన ప్రేమభావం ముఖ్యం. అది ఏర్పడిన మూలాధారం అతిముఖ్యం - ఆ ప్రేమభావం శాశ్వతమై నిలవడానికి'' అన్నాను.

''మొదట్లో అతడిమీద ఉన్న జాలి నా ఆలోచన్లను ప్రభావితం చేసిందంటే ఒప్పుకుంటాను, కాని ఇప్పుడు కాదు. నీవు చెప్పిన వ్యక్తిత్వం, ఔన్నత్యం ఆధారంగా చేసుకునే జీవన్‌పట్ల అనురాగాన్ని పెంచుకున్నాను'' అని ఆగి కిటికీలోనుండి బయటకు చూస్తూ ''మాధృక్పధాలు, ఆలోచనలు ఒక పరిమితిలోనే తిరుగాడుతుండవచ్చు. మేం పెరిగిన వాతావరణం, చుట్టూ ఉన్న జీవితాలు, పరిస్థితులవల్ల ఉన్నతంగా ఎదగలేకపోయుండవచ్చు. కాని అవగాహన లేకుండా త్వరపడలేదు'' అంది.

''జీవన్ భార్యతో విడాకుల గొడవ కోర్టులో ఉన్నట్లు నీకు తెలుసు. తెలిసీ ముళ్లకంచెలో ఉన్న వృక్షాన్ని పెనవేసుకోవడానికి ఎందుకు సాహసిస్తున్నావు? ఆ ముళ్ళు నిన్ను చీరేసే అవకాశం ఉందని గుర్తించవెందుకని?'' అడిగాను.

''కోర్టులో ఉన్నా విడిపోవడం గురించేగా. వాళ్ళిద్దరూ మళ్లీ కలవడం కల్ల. అలాంటప్పుడు మా విషయం ఆమెకి తెల్సినా భయపడాల్సింది ఏముంది?''

''జీవన్‌ని ఇరకాటంలో పెట్టడానికి ఆమె ప్రయత్నించవచ్చుగా''

''అలా ఆలోచిస్తే అన్నీ సందేహాలే ఎదురవడం, సంకల్పం క్షీణించడం తప్ప ప్రయోజనం ఏముందన్నయ్యా''

''మొండితనంతో గమ్యం చేరగలననుకోవడం భ్రమే అవుతుంది. ఏ అవాంతరం ఎదురయినా ఎదుర్కొనే గుండెనిబ్బరం, సమస్యరాకుండా చూసుకోవాల్సిన ముందుచూపు ఉండాలి పూర్ణిమా''

''నాగమ్యం నేను తెలిసే నిర్ణయించుకున్నది. అన్నిటిని ఆలోచించాకే ఆ నిర్ణయానికొచ్చాను. కనక గుండెనిబ్బరం ఉందనే అనుకుంటున్నాను'' అంది.

''పూర్ణిమను సాలోచనగా పరికించి కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు చూస్తూ మరో సిగరెట్ అంటించాను.

''మీ ఇద్దరిలో మొదట ఈ ప్రేమ ప్రస్తావన తెచ్చిందెవరు?'' నాకు తెలిసినా అడిగాను.

''నేనే'' సమాధానమిచ్చింది.

''అంటే జీవన్‌లో నీపై ప్రేమ వుందో, లేదో తెలుసుకోవడానికి ప్రయత్నించి ఆకర్షించావు. అతడు నీలోని స్త్రీత్వంవైపు ముందు ఆకర్షితుడై ఆ తర్వాత బంధాన్ని - అదంటూ ఖచ్చితంగా వుండివుంటే - దాన్ని ఆధారం చేసుకుని పెంచుకున్నాడు'' అన్నాను.

పూర్ణిమ ఒక క్షణం ఆలోచించి ''నువ్వన్నది నిజమే కావచ్చున్నయ్యా. తన అనుభవాల దృష్ట్యా కొంత, చిన్నతనంనుండి నేను తెలిసివుండడం, స్నేహితుడి చెల్లెల్ని కావడంవల్ల కొంత మొదట్లో అతడిలో నామీద ఎలాంటి భావం వుండి వుండకపోవచ్చు. ఒక పురుషుడిగానే నాపట్ల ఆకర్షితుడై వుండవచ్చు. ఆ తర్వాతే అతడిలో నామీద అభిమానం చిగురించి వుండవచ్చు. కాని ఇప్పుడు అతడి మనసేమిటో నాకు స్పష్టంగా తెలుసు. ఎలాంటి అరమరికలు లేకుండా మనసులు పరచుకుని మమతల్ని పెంచుకుంటూ పంచుకున్నాం. మంచీ, చెడు మాట్లాడుకుని ఒక అవగాహనకు వచ్చాకె మాదైన జీవితంకోసం తెగువతో అడుగు ముందుకు వేద్దామనుకున్నాం'' అంది.

''జీవన్ నిన్ను ప్రేమిస్తున్నాననుకోవడానికి నీవే కారణమని గుర్తించావుగా. నీవనే మమతా

నురాగాలను నీవే కలిగించి, నీ చేతులతో పెంచి పెద్దచేయడానికి నీ తనువును దహనవ రచుకున్నావన్న నిజంకూడా నీకు తెలుసు...''

నా మాటలు పూర్తి కాకుండానే అందుకుని ''తెలుసు, మానసికంగా పూర్తి స్పృహలోనే అతడికి నన్ను నేనుగా అర్పించుకున్నాను. నిజంచెప్పాలంటే జీవన్‌కి 'నేనున్నాను' అనే భావం కల్పించడానికే, అతడు నాకు దగ్గర కావడానికే నన్నర్పణచేసుకున్నాను'' అంది పూర్ణిమ. ఇందాక సూటిగా అడిగిన ప్రశ్నకు చెప్పలేకపోయిన సమాధానాన్ని ఇప్పుడు చెప్పింది - కాస్త ఆవేశంగా.

పూర్ణిమలోని నిర్భయం నాకు విస్మయాన్ని కలిగించింది. తనదైన దాన్నేదో పొందాలనే తపన ఆమెను ఎటువంటి పరిస్థితుల్లో నిలిపి, ఎంత తెగింపు కలిగించింది. ఏమిటీ ధోరణి అనుకున్నాను. కాస్త చిరాకు కూడా కలిగింది నాకు. అది బయటకు కన్పించనీయకుండా-

''జీవన్‌లో నీవు చూసేది సంపూర్ణమైన అతడిని కాదు. నీ ప్రతిబింబాన్ని మాత్రమే చూసుకుంటున్నావు'' అన్నాను.

''ఊహు, ఇద్దరిలో ఒకరి ప్రతిబింబం ఒకరు చూసుకుంటున్నామనుకుంటున్నాను'' అంది పూర్ణిమ.

''మున్ముందు నీ జీవితంలో ఒడిదుడుకులు లేకుండా ఉండడంకోసం జీవన్‌ని, ఆ ప్రేమని మరచి మామూలుగా ఉంటూ వేరొకరిని పెళ్లిచేసుకోలేవా పూర్ణిమా''

''నరకంనుండి బయటపడాలని ప్రయత్నిస్తున్న నేను మళ్ళీ అందులోనే ఎందుకుండిపోవాలనుకుంటానన్నయ్యా? జీవన్‌ని మరచిపోయాననే అనుకుందాం. మా కుటుంబ చరిత్ర తెలిసి నన్నెవరు పెళ్లిచేసుకుంటారు? ఎవరు ముందుకు వస్తారు? తెలియని వాళ్లు వచ్చినా ఈ మనుషులు అంతా సజావుగా జరుగనిస్తారా?''

''జరగనివ్వరని ఎందుకనుకోవాలి?''

''తల్లి చేసిన తప్పు పిల్లలపై పడదా? ముఖ్యంగా ఆడపిల్లనైన నామీద. ఎవరైనా నిజం తెలియక వస్తే మావాళ్లు వాస్తవాన్ని కప్పెట్టి పెళ్లి చేస్తారు. కాని వాళ్లకి ఆ వాస్తవమే మిటో తెలిసినరోజు నా బ్రతుకేమవుతుంది? ఆ పరిణామం ఎటువంటి పరిస్థితులకు దారితీస్తుంది? వచ్చినవాడు అర్థంచేసుకోలేనివాడై నన్ను బయటకు గెంటితే నాకేది దారి? వీటన్నిటినీ దృష్టిలో వుంచుకునే తెగించైనా అన్నీ తెలిసిన, నాకు నచ్చిన, నన్ను మెచ్చిన జీవన్‌తో జీవితం పంచుకోవాలనుకుంటున్నాను'' అంది.

పూర్ణిమ ప్రశ్నల్లోని లాజిక్ చాలావరకు నిజమే. అయినా జీవన్ కూడా చివరివరకూ ఆదరిస్తాడనే నమ్మకమేముంది? ప్చ్... అంత నెగిటివ్‌గా ఆలోచించడం మంచిదికాదు. అనుమానిస్తే అన్నీ అనుమానాలే అని మనసులో అనుకుని-

''నీ ప్రశ్నలు సబబే. తల్లి తప్పు కేవలం ఆడపిల్లలమీదే కాదు. మగవాళ్లమీదా ప్రభావం చూపిస్తుంది. కాకపోతే సంఘంలో ఆడదానికున్న ప్రాధాన్యత మగవాడికి లేదు. అందుకే మగవాడిని అంతగా పట్టించుకోకుండా వదిలేసి ఆడదాని తప్పులకు అతిగా విలువ కడుతుంది. అందుకే మీ అమ్మ తప్పులకు మీరంతా మూల్యం చెల్లించాల్సివస్తోంది. ఆనాడు మీ అమ్మ ఒకందుకు తప్పు చేస్తే, ఇప్పుడు ఆ తప్పునే మరొకందుకు, మరోరూపంలో నువ్వు చేయబోతున్నావు. అది వద్దనే నా సలహా...''

నన్ను పిలుస్తూ అమ్మ రావడంతో ఆపాను.

''ఏమిటిరా? ఏదో ఉపన్యాసమిస్తున్నావు?'' అంది అమ్మ.

''ఏంలేదమ్మా, పూర్ణిమతో చిన్న డిస్కషన్'' అన్నాను.

''వినేవాళ్లుంటే చాలమ్మా వాడి సోదితో ఊదరగొట్టేస్తాడు'' పూర్ణిమతో అని ''నేను కొంచెంసేపు నడుంవాలుస్తాను, టైమయితే పాలపాకెట్ పట్టుకురా'' అంది నాతో.

నేను నవ్వుతూ తలూపి ''అలాగే'' అన్నాను.

అమ్మ వెళ్లిపోయింది.

ఆవిడటు వెళ్లగానే పూర్ణిమతో అన్నాను. ''పూర్ణిమా, ముందు ముందు ఎలాంటి పరిస్థితులెదురవుతాయో నువ్వు వూహించడంలేదు.




"నీఅంత కాకున్నా కొంతవరకైనా ఊహించామన్నయ్యా" అని ఆగి మళ్ళీ అంత లోనే "ఒక్క విషయం స్పష్టంగా చెబుతున్నాన న్నయ్యా. నేను మగవాడితోడు గురించి తపన పడడంలేదు. ఆతోడే కావాలనుకుంటే ఎన్నోవి ధాలుగా దొరుకుతుంది. కాని నేను కోరేది నామీద అనురాగం, ఆప్యాయత చూపించి నన్ను నన్నుగా గౌరవించి, ఆదరించే వ్యక్తిని. ఆ వ్యక్తి బయటి లోకంలో దొరుకుతాడో, లేదో తెలియదు. తెలిసిన జీవన్‌ని కోరుకోవడం తప్పు కాదుగా. ఇన్నాళ్ళుగా ప్రేమ రాహిత్యంలో మగ్గిన నేను కాసింత ప్రేమనిండిన ఒడిలో ఊరట చెందాలనుకోవడం నేరమా?" నా కళ్ల లోకి సూటిగా చూస్తూ ప్రశ్నించింది.

దానికి నాదగ్గర జవాబులేదు. అందుకే మౌనంగా ఉండిపోయాను.

నేనేం మాట్లాడకపోవడంతో తనే అంది- "కోరుకున్న జీవన్ నా వాడుకానప్పుడు నా మనసు ఎప్పటిలా బలహీనమైపోతుందన్న య్యా" లీలగా దిగులు ధ్వనించినట్లని పించింది ఆమె గొంతులో.

జీవన్‌కంటే పూర్ణిమలో ఆలోచన, ఆత్మవి శ్వాసం, పట్టుదల, ఆ తపన అన్నీ నాకు అచ్చెరువు కలిగిస్తున్నాయి. ప్రేమ విషయంలో ఆమెలో మార్పు తేవడం అంత సులభం కాదనిపిస్తోంది.

కిటికీ పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంటూ, "అసలు ప్రేమంటే ఏమిటనుకుంటున్నావు పూర్ణిమా..." అనడిగాను నెమ్మదిగా. "నీవు అనుభవించినదానికి భాషారూపమివ్వగ లవా?"

స్పష్టమైన అవగాహన ఉంటే అది ఆమె చెప్పేదానిలో ద్యోతకం కాకుండా ఉంటుందా అని కొంత, ఏం చెబుతుందో తెలుసుకోవాలనే కుతూహలం మరికొంత.

కొంచెంసేపు మౌనంగా ఉండిపోయింది. నా కళ్లలోకి చూసి తలదించుకుంది. ఆమె చూ పులో ఎన్నో భావాలు, మరెన్నో ప్రశ్నలు.

ప్రేమంటే... శక్తి... అద్భుతమైన ఒక శక్తి ఆనందం, అనుభూతి నింపి, హృదయాన్ని వెలిగించి, ఆ వెలుగును పంచగలిగేలా చేయ గల శక్తి. అదే నేనివ్వగల నిర్వచనం. ఆ శక్తిని నిర్వచించమంటే నేను నిర్వచించలేను. ఎందుకంటే అదిఅనుభూతికి సంబంధించేది కనక. విలువైన అనుభూతిగా మిగిలే ఆ శక్తిని పొదిగే భాష అసలు భౌతికంగా రూపొందింప బడలేదేమో" అంది.

చిన్నగా నిశ్వసిస్తూ తల పైకెత్తి కళ్లు మూ సుకుంది. రెండు క్షణాలు అలాగే ఉండి ఆ తర్వాత కిటికీ దగ్గరకు వచ్చి చువ్వల్ని పట్టు కుని బయటకు చూస్తూ నిల్చుంది.

పూర్ణిమను దీర్ఘంగా చూశాను. అప్రయ త్నంగా నా నోటినుండి 'మార్వలెస్' అన్న పదం వెలువడింది. పరిణితి వైపు ఎదుగుతూ స్థిరత్వాన్ని పొందడానికి ప్రయత్నిస్తున్న ఆమె మనోస్వరూపం ప్రస్ఫుటమయిందామె మాట ల్లో.

"ఆడవాళ్లు ఎంత త్వరగా మానసికంగా ఎదగగలరు" అనుకున్నాను నాలో నేను.

చాలాసేపటి తర్వాత అడిగాను, "మీ అమ్మకు, అన్నయ్యలకు చెబుదామని కాని, చెపితే వాళ్లొప్పుకుంటారనిగాని అనుకుంటు న్నావా?"

"ఒప్పుకోరనే నా అభిప్రాయం. అందుకే జీవన్ చెబుదామంటున్నా చెప్పకుండా వెళ్లి పోయి పెళ్లి చేసుకుందామంటున్నాను" అంది నావైపు తిరిగి.

"ఒప్పించడానికి ప్రయత్నిస్తే"

"లాభంలేదు. నన్ను బతకనివ్వరు"

"నేను ప్రయత్నిస్తాను"

"నీవు ప్రయత్నించినా లాభం ఉండదన్న య్యా. వాళ్లతో స్నేహంగా ఉంటూ మంచిత నంతో ఆలోచించే నీకు ఫలితం ఉంటుందని పించవచ్చు. కాని వాళ్లెంత మూర్ఖులో నీకు తెలియదు"

"ప్రయత్నించడంలో తప్పులేదుగా"

"సరే... నీకు నమ్మకముంటే ప్రయత్నించు. కాని దానివల్ల మేము విడిపోవడం జరగకూడ దు" హెచ్చరిక, అభ్యర్థన ధ్వనించిందా మాట ల్లో.

"చెబితే ముందు ఆవేశపడినా ఆలోచించ గలుగుతారేమో. కాని చెప్పకుండా మీరు వెళ్లి పోయి పెళ్లి చేసుకుంటే ఎంతగా బాధపడతా



రో. ఆవేదనతో నలిగి పోతారో. అంతేకాక పరువు పోయిందని జీవన్‌మీద కసి పెంచుకునే అవకాశం కూడా ఉంది పూర్ణిమా'' అన్నాను.

''అలా ఆలోచించడం అనవసరం అన్పిస్తుంది నాకు. కన్నందుకు బాధ్యతగా పెంచితే పెంచి ఉండవచ్చు. కాని నా తల్లికి నాపై ఉన్న ప్రేమ ఎంతో నాకు తెలుసు. ఇక అన్నయ్యలు - రక్తం పంచుకున్నాను కనుక కొద్దిగా అభిమానం, అనురాగం ఉండవచ్చేమో కాని నీవనుకున్నంతకాదు. పెద్దన్నయ్య గురించి నీకు తెలియనిదేముంది? అతడిలో పవిత్రత ఎంతుంది? నా తల్లిలో, చిన్నన్నయ్యలో ఎవరిలోనూ లేని దాని గురించి ఆలోచించడం వాళ్లు బాధపడతారనుకోవడం దండుగ'' చాలా ఆవేశంగా అంది.

నాగభూషణం గురించీ నాకు పూర్తిగా తెలుసు. అతడికి మేనమామ కూతురితో, స్నేహితుడైన ఒక వ్యక్తి భార్యతో మరికొంత మందితో విచ్చలవిడిగా సంబంధాలున్నాయి. మొదటి ఇద్దరి విషయంలో చాలా గొడవ జరిగి కొట్టుకోవడం వరకు వచ్చింది. ఈ గొడవ పెద్దదై పోలీసుల వరకు వెళ్లడంతో లంచాలిచ్చి తప్పించుకున్నాడు. మేనమామ కూతురు తన వల్ల గర్భవతయినా కుటుంబకలహాలవల్ల పెళ్లాడడానికి తిరస్కరించానని నాగభూషణమే నాకు చెప్పాడు. తనకు కులమతాల పట్టింపు లేదని కట్నం లేకుండా ఆదర్శంగా పేదింటి పిల్లను నచ్చితే ఏ కులాని చెందిన దైనా పెళ్ళి చేసుకుంటానని ఇక్కడ అందరితో అతడు చెప్పే కబుర్లన్నీ మంచివాడుగా ప్రాజెక్ట్ కావడంకోసం చెప్పే కబుర్లని నాకు తెలుసు. అవన్నీ పూర్ణిమకు తెలుసు. అందుకే శ్రీరంగ నీతులు వల్లించే అతడిలో పవిత్రత ఎంతవరకు ఉంది అని ప్రశ్నించింది.

ఒక వ్యక్తి వ్యక్తిత్వంలో అతడినైతిక ప్రవర్తన అతి ముఖ్యమని పరోక్షంగా చెబుతోంది పూర్ణిమ. కాదనలేని నిజమది.

తెలియక చేస్తే అది తప్పు. తెలిసి చేస్తే అది మోసం. క్షమకనర్హం.

ఒక్కక్షణం నాలో 'ఈ మోసం జీవన్, పూర్ణిమలకోసం నేను చేయవలసి వస్తుందేమో' అనే భావం కలిగింది. దాన్ని పక్కకు నెట్టి

''అయినా చెప్పి ఒప్పించడానికి ప్రయత్నిద్దాం పూర్ణిమా'' అన్నాను.

''వాళ్లకు చెప్పి ఎదురు తిరిగే పరిస్థితి ఎందుకు కల్పించుకోవడం'' అంది పూర్ణిమ.

''చెప్పకుండా మీరెక్కడకు వెళ్లినా వాళ్లు వెతికి మిమ్మల్ని విడదీయ ప్రయత్నిస్తే'' అన్నాను.

''అన్నయ్యా! మనసులు కలిస్తే విడదీయడం సాధ్యమే. కాని తాళితో తనువులు కలిసిన బంధాన్ని విచ్ఛిన్నం చేయడం సాధ్యమంటావా? ఒకవేళ వీళ్లు అంతకూ తెగించి మా బంధాన్ని తెంచెయ్యాలనుకుంటే తెగేది తాళే అవుతుంది, అంతే. వాళ్లా అఘాయిత్యానికి పాల్పడినప్పుడు నాకై నేను ఆహుతవుతాను కాని వాళ్లమనిషిగా నన్ను కలుపుకోలేరు'' అంది తీవ్రమైన స్వరంతో.

ఆమెలో ఆవేశం గమనించి ''ఆవేశం పనికి రాదు పూర్ణిమా'' అన్నాను.

''ఆవేశం కాదన్నయ్యా. గత ఆరునెలలుగా నేను పడుతున్న అంతర్మధనం, పెంచుకుంటున్న ఆత్మవిశ్వాసం''

''జీవన్‌లోనూ అంతటి ఆత్మవిశ్వాసం ఉందా?''

''ఉందనే అనుకుంటున్నాను. హెచ్చుతగ్గులున్నా నావాడిగా అతణ్ణి నిలుపుకోగలను''

''నీకానమ్మకం ఉంటే ఎవరూ ఏమీ చేయలేరు. సరే... సమయంరానీ, కాలమే పరిష్కారం చూపుతుంది. ఒద్దరూ ఒకేచోట ఉంటున్నారు. ఇంట్లో ఏమాత్రం అనుమానం కలిగేలా ప్రవర్తించక జాగ్రత్తగా ఉండండి''

అలాగే అన్నట్టు తల ఊపింది పూర్ణిమ. నాకు అంతలోనే మరో ఆలోచన వచ్చి ''మీ బాబాయితో చెబితే, ఆయనైనా అంగీకరిస్తాడేమో'' అన్నాను.

పెదవి విరిచి ''అనవసరం అన్నయ్యా. ఆయనంటే నాకసహ్యం. కాకపోతే ఏనాడు దాన్ని వ్యక్తపరచలేదు. మా ఆర్థికపరిస్థితి నా తల్లిని లొంగదీసుకుంది. దానివల్ల మేము పెరిగి పెద్దవాళ్లమయ్యాం. అందుకు కృతజ్ఞతే గాని ఆయనమీద నాకే గౌరవంలేదు'' అంది పూర్ణిమ.

దీర్ఘంగా నిట్టూర్చి లేచాను.





బయటకు వెళ్లి పాలు తెచ్చాను. అమ్మ టీ పెట్టిచ్చింది. తాగి పూర్ణిమను వాళ్లింటిదగ్గర దింపడానికి బయలుదేరాను.

ప్రేమకోసం వెళ్లిపోవాలనుకుంటున్న వీరి ఆలోచన తగదనే నాలోని భావంతో ఆఖరియత్నంగా దారిలో పూర్ణిమతో అన్నాను - "ప్రేమే జీవితం కాదు. దానిని మించిన జీవితం ఎంతో ఉంది. స్వల్పకాలిక ఆనందాన్ని మిగిల్చే ప్రేమకోసం జీవితం పోగొట్టుకునేవరకు వెళ్లడం తెలివిహీనతే అవుతుంది. జీవితమంతా మిగిలివుంటే ప్రేమను ఎప్పుడో ఒకప్పుడు సాధించవచ్చు పూర్ణిమా"

అది విని నవ్వీనవ్వనట్లుగా నవ్వుతూ "జీవితం శూన్యమైనప్పుడు, అర్థరహితమైనప్పుడు ప్రేమతో దానికో అర్థాన్ని, విలువను సాధించుకోవాలనుకోవడం, ప్రేమ పునాదిగా జీవితాన్ని నిర్మించుకోవాలనుకోవడం తెలివిహీనతంటావా?"

"నిర్మించుకునేలోపే కూలిపోతుందేమోననే నా భయం పూర్ణిమా కీడెంచి మేలెంచడం మంచిదని నా అభిప్రాయం. ఇక మీఇష్టం" అని ఊరుకున్నాను.

వాళ్లింటి దగ్గర కరుణాకర్ ఉంటే కొద్దిసేపు అతడితో మాట్లాడి వచ్చేసాను.



**జీ**వన్‌ది వింతకథ. కథ అనిపించే చేదు నిజం, విషాదం. అతడికి ముదివయస్కులైన తల్లిదండ్రులు, ఇద్దరక్కయ్యలు, ఒక అన్నయ్య ఉన్నారు. అన్నయ్య తాగుబోతు. సంపాదన బాగానే ఉన్నా భార్య మాటే అతడికి వేదవాక్కు. విజయవాడలో ఉద్యోగం చేసుకుంటున్నా దగ్గర్లోనే ఉన్న తల్లిదండ్రులను చూసేవాడు కాదు. జీవన్ ఇంటర్‌తో చదువాపేసి ఫాబ్రికేషన్ వర్క్ నేర్చుకుని చిన్న చిన్న కాంట్రాక్టర్ల దగ్గర ఉద్యోగం చేస్తూ తల్లిదండ్రులకి ఆసరాగా ఉండేవాడు.

వయసు ఇరవైరెండేళ్లు మించకపోయినా కష్టం ఆశతో తల్లిదండ్రులు ఒక సంబంధం చూసి జీవన్‌ని బలవంతంగా ఒప్పించి పెళ్లి చేసారు. అట్టహాసంగా జరిగిన ఆ పెళ్లి చివరకు ఒక చేదు అనుభవంగా మిగిలింది జీవన్‌కి.

శోభనంరాత్రే ఆమె నదురు, బెదురు లేకుండా "నువ్వంటే నాకిష్టంలేదు, నేనొకరిని ప్రేమించాను. మా నాన్న నేనెంత బ్రతిమాలినా వినక నన్ను చంపి తను చస్తానని బెదిరించి, నా మెడలువంచి ఈ పెళ్లి చేసాడు" అని చెప్పడంతో హతాశుడై నవ్వుకోవాలో, ఏడవాలో తెలియక యవ్వనం పొంగులో అల్లుకున్న కోరికలకు ఆక్షణంలోనే సమాధి కట్టుకున్నాడు.

మూడు రాత్రుల ముచ్చట అలా ముగిసింది.

అత్తామామలకు తన భార్య ఒక్కటే కూతురు కావడంవల్ల, మామ కొద్దో గొప్పో ఆస్తిపరుడు కావడంతో గారాబంగా పెంచిన పెంపకంలోని మొండితనం కొన్నాళ్లుపోతే అదే సర్దుకుంటుందిలే అనుకున్నాడు.

భార్య మనసు మార్చడానికి ఎన్నివిధాలుగానో ప్రయత్నించాడు. హనీమూన్‌కు వెళ్లేంత స్థితి తనకు లేకపోయినా కష్టంగా ఇచ్చిన డబ్బులో కొంత ఖర్చుచేసి భార్యని బెంగుళూరు, ఊటీ తీసికెళ్లాడు. ఎన్నోసార్లు ఆమెను కూర్చోపెట్టి ఆమె వింటున్నా, వినకపోయినా వివాహబంధం, దాని అవసరం, మనుషుల మధ్య ప్రేమలు, సంబంధ బాంధవ్యాలు, అనుబంధాలగురించి తనకు తెలిసినవి, తాను చూసినవి - తను చెప్పగలిగిన రీతిలో చెప్పాడు. సినిమాలకు, షికార్లకు తిప్పాడు. తానివ్వగలిగిన కానుకలు తీసుకొచ్చి ఇచ్చాడు. లాలనగా దగ్గరకు తీసుకుని ముద్దుచేయడానికి ప్రయత్నించాడు.

ఎన్ని చేసినా, ఎంత ప్రేమగా చేరువకావడానికి ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. పైగా జీవన్ చేసిన ప్రతి ప్రయత్నాన్ని ఆమె

వినుక్కుంటూ అతడికి దూరమవుతూ వచ్చిందేకాని మనసు మార్చుకుని తాళికట్టిన అతడికి చేరువకాలేకపోయింది. కనీసం సర్దుబాటయినా చేసుకోలేకపోయింది. అసలందుకు ఆమె ఏమాత్రం ప్రయత్నించలేదు.

పైగా ఆమెలోని సౌఖ్యలాలసతో కిందిస్థాయి మధ్యతరగతివాడైన జీవన్, అతడి కుటుంబసభ్యుల మధ్య ఇమడలేకపోయింది.

భార్యను తనకు అనుకూలంగా మార్చుకోవడానికి, తానామెకు అనుగుణంగా మారడానికి చేసిన యత్నాలన్నీ బెడిసికొట్టడంతో ఇక చేయగలిగిందేమీ లేక జీవన్ ఊరుకున్నాడు.

అత్తగారింటికి వచ్చివుండడానికి ఆమె ఒప్పుకోలేదు. తల్లిదండ్రులు చెప్పిన మాటల్నీ పెడచెవినపెట్టింది. బలవంతంగా పంపించినా రెండుమూడు రోజుల్లో తిరిగివచ్చేసేది. 'చిన్నపిల్ల, గారాబంగా పెరగడంతో వచ్చిన మంకుతనం బాబు, కొద్దిగా నీవే సర్దుకో బాబూ కొంతకాలం' అని అత్తా, మామా ప్రాధేయపడుతూ చెప్పడంతో భార్యని వాళ్లదగ్గరే వుంచి జీవన్ నాలుగైదురోజులకోసారి వచ్చి వెళుతుండేవాడు.

ఒకసారి అత్తమామలు బంధువులింట్లో పెళ్లికి వెళుతూ కూతురు తమ కూడా రానన డంతో ఆమెను బలవంతంగా జీవన్ వాళ్లింట్లో దింపి వెళ్లారు. మరుసటిరోజే ఆమె అక్కడ ఉండనని మొండికేయడంతో ఆమెను తీసికొని అత్తగారింట్లోకి వెళ్లాడు.

పెళ్లయి ఆరెనెలలు గడుస్తున్నా బ్రహ్మచారి జీవితాన్ని గడపక తప్పని జీవన్ అమితమైన కోరికతో ఒకరాత్రి దగ్గరకు చేరబోగా నాకిష్టంలేదంటూ దూరం జరిగింది. జీవన్ బలవంతం చేయబోగా దుర్భాషలాడి ఛీ కొట్టింది. దానితో అవమానభారంతో జీవన్ ఇవతలకు వచ్చేసాడు.

కాని, ఆ తర్వాత రెండురోజులకే ఏమాత్రం ఊహించని ఘోరదృశ్యం అతడి కంటబడింది. భార్య ఉన్నా తప్పని ఒంటరితనంతో ఇంట్లో కాలంగడవక పగలంతా బయట ఎక్కడెక్కడో తిరిగి ఆలస్యంగా ఇంటికివచ్చిన జీవన్‌కి ఆ ఇంట్లోనే భార్య తను ప్రేమించిన వ్యక్తి కౌగిలిలో ఒదిగిపోయిన దృశ్యం కనుపించింది.

అది అప్పుడప్పుడు చాటామాటుగా సాగుతున్న వ్యవహారమే అయినా జీవన్ కంటపడడం అదే మొదటిసారి.

ఆ దృశ్యం అతడిలో అగ్నిగుండాల్ని పేల్చింది. ఆవేశం, బాధ నిలువెల్లా దావానలంలా ఉప్పొంగాయి.

పెళ్లయి ఆర్నెల్లయినా ఎన్నో తలపులతో, కోరికలతో నిండిపోయిన తను ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఏమీ చేయలేక అన్నిటినీ తనలోనే అణచుకుంటే తననో వెధవను చేసి ఆమె ప్రేమించిన వాడితో పొందు కలియడం...

ఆ దృశ్యం చెలరేపిన ఆగ్రహావేశాల్ని అదుపుచేసుకోలేక భార్యను కసితీరా ఇష్టంవచ్చినట్లు కొట్టి ఆరాత్రికి రాత్రే అక్కడనుండి వచ్చేసాడు.

పదిరోజుల తర్వాత జీవన్ మామ కూతురిని తీసుకువచ్చి దిగబెట్టి వెళ్లాడు. జీవన్ "వద్దు, తీసుకుపొండి" అని ఎంతగా మొత్తుకున్నా అందుకు ఇదీ కారణం అని చెప్పుకోలేకపోయాడు. అతడి భార్య మాత్రం ఏమీ ఎరుగని అమాయకురాలిలా తల దించుకుని లోపలికి వెళ్లిపోయింది. జరిగిన విషయం తెలియక జీవన్ తల్లిదండ్రులు అతణ్ణే కోప్పడ్డారు.

ఈసారి జీవన్ భార్య రెండు నెలలపాటు కన్నవారింటికి వెళ్లకుండా అక్కడే ఉంది. జరిగినదేమిటో ఆమె తల్లి, తండ్రులకు తెలిసి ఏదో గొడవ జరిగివుంటుంది. అందుకే ఇంత కాలం ఓపిగ్గా ఉందనుకున్నాడు జీవన్.

భార్యాభర్తలిద్దరూ ఎడమొగం, పెడమొగంగా వున్నా వాళ్లే కలిసిపోతారులే అనుకుని తల్లిదండ్రులు వారి విషయంలో ఏదీ కల్పించుకోలేదు. ఇంట్లో ఆమె ఉనికి మరచిపోయి ఎంత మామూలుగా ఉందామనుకున్నా తనవాళ్లపట్ల ఆమె ప్రవర్తన, నిర్లక్ష్యం తమ ఆర్థిక పరిస్థితిని ఆసరాగా చేసుకుని కించపరచడం దాన్ని సాధ్యపడనిచ్చేవికావు. పూరింట్లో ఉండలేనని, ఫోన్, బాత్రూమ్ ఏమీ లేవని అల్లరిపెట్టడం, అత్తమామలను ఈసడించుకోవడం, ఎంత సౌమ్యంగా మాట్లాడాలని ప్రయత్నించినా తలబిరుసుగా సమాధానం చెబుతుండడంతో భార్యమీదున్న అసహనం రెట్టింపయింది జీవన్‌లో.




భార్యకు ఇష్టంలేకపోయినా ఇప్పుడుండేది తనిల్లు కాబట్టి బలవంతంగానైనా కోరికలు తీర్చుకునే అవకాశం అందుబాటులో వున్నా అసహ్యంతో ఆమె దరిచేరి కోరికలు తీర్చుకో లేక, అణచుకోలేక మధనపడిపోయేవాడు జీవన్.

రెండుమూడుసార్లు మనసు పొందుకోసం పడే తహతహను నిగ్రహించుకోలేక బాగా తాగివచ్చి ఆ మైకంలో భార్యను - ఆమె ఛీ కొడుతున్నా - బలవంతంగా అనుభవించి కోరిక తీర్చుకున్నాడు. దానితో రెచ్చిపోయిన ఆమె పశువులా మీదపడి కోరికలు తీర్చుకో వడం కాదు. మనిషిలాగ ప్రవర్తించడం నేర్చు కోవాలంటూ నిందించి మాట్లాడడంతో ఆవే శంలో చేయి చేసుకున్నాడు. ఫలితంగా ఆమె నానా యాగీ చేసి పుట్టింటికి వెళ్ళిపోయింది. తర్వాత మూడురోజులకు మామగారొచ్చి అల్లు ణ్ణి తమదగ్గరే ఉండడానికి రమ్మని కోరాడు.

''ఏదో ఒక ఉద్యోగం చూసుకోవచ్చు. నువ్వూ అక్కడే ఉందువుగాని రా. ఈ ముసలివాళ్ళ నెంతకాలం అంటిపెట్టుకుని ఉంటావు?'' అన్న మామకు రానని ఖండితంగా చెప్పేసా డు జీవన్ - గిట్టని భార్యకోసం ఇల్లరికపుటల్లు డిగా ఉండలేక.

ఎంతచెప్పినా, బ్రతిమాలినా జీవన్ వినకపో వడంతో చేసేదేంలేక అతడి మామగారెళ్ళిపో యారు.

అంతే, ఆ బంధం అంతటితో తెగిపో యింది.

ఒక సంవత్సరంపాటు అటూ ఇటూ రాకపో కలు లేవు. ఒకరికొకరు దూరంగానే వున్నారు. అక్కడకు రమ్మని వాళ్ళు, రానని జీవన్. నేను వేరే పెళ్ళి చేసుకుంటాను, అతడితో ఉండలే ను, విడాకులిప్పించండని కూతురు.

తెగించిన కూతుర్ని బయటకు పొమ్మనలేక భార్యాభర్తల్ని కలపలేక ఇక లాభంలేదనుకు న్న ఆమె తల్లిదండ్రులు విడాకులకోసం కో ర్టులో పిటీషన్ పెట్టుకున్నారు. అదింకా కోర్టు విచారణలోనే వుంది. లాయర్ సలహాపై - కూతుర్ని ఎన్నోవిధాలుగా హింసించి ఇంట్లో నుండి వెళ్ళగొట్టారని, మానసికంగా ఆమె ఎంతో నలిగిపోయిందని జీవన్ మామ ఆ పిటీషన్‌లో పేర్కొన్నాడు.

స్త్రీకైనా, పురుషుడికైనా తీయటి స్వప్నమైన వివాహం, తొలినాళ్ళ అచ్చట, ముచ్చట అన్నీ ఛిద్రమైపోగా, ఎదురైన అనుభవం నిరాశాని స్పృహల్ని కుమ్మరించిపోగా విషాదాన్ని గుండె నిండా నింపుకున్న జీవన్ తుఫానుగాలికి కొట్టు కుపోతున్న ఎండుటాకులా కాలం గడిపాడు. చాలాకాలం చిల్లర తిరుగుళ్ళు తిరుగుతూ ఏవేవో చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ కాలక్షేపం చేశాడు.

ఎడారిపయనమైపోయిన బ్రతుకులో ఒయాసిస్‌కోసం అల్లాడుతున్న మనసు ఏచి న్న ఆలంబన దొరికినా అల్లుకుపోదామని ఎదు రుచూస్తున్న ఆ కాలంలో సుగుణ అనే ఒయా సిస్ ఎదురైంది, జీవన్‌లోని దాహాన్ని తీర్చింది.

సుగుణ జీవన్‌కి బంధువే అవుతుంది. వివా హితే అయినా జీవన్‌కి భార్యతో ఎదురైన అనుభవాలు సుగుణకు మరోరకంగా భర్తతో ఎదురయ్యాయి. ఆమె బి.ఎ. చదువుకుంది. పెద్దగా కట్నంపోసి అల్లుణ్ణి తేలేని ఆమె తండ్రి ఐ.టి.ఐ. చదువుకున్న యువకుణ్ణి ఆమెకు కట్టబెట్టాడు. అతడికి అనుమానం, న్యూనతాభావమనే జోడుజబ్బులు. సుగుణ ఎవరితోనైనా నవ్వుతూ మాట్లాడినా, కాస్త సోష ల్‌గా మూవ్ అయినా భరించలేకపోయేవాడు. లోలోని న్యూనతాభావం శాడిజంగా బయటకు తన్నుకువచ్చేది. భార్యను సూటీపోటీ మాట లంటూ మానసికంగా చిత్రవధ చేసేవాడు. విచిత్రమేమిటంటే సుగుణ ఎదురుగావుంటే ఇలా ప్రవర్తించే అతడు ఆమె ఎదురుగా లేనప్పుడు అంతగా అర్రులు చాచేవాడు. అత డి ప్రవర్తనకు విసిగి సుగుణ ఎప్పుడైనా నాలు గు రోజులుండి వద్దామని కన్నవారింటికి వెళితే ఆమె వచ్చేవరకు అతడికి పిచ్చెక్కినట్లుండేది. ఆమె రాగానే ఒకటి రెండు రోజులు బాగున్నా ఆ తర్వాత అతడి ప్రవర్తన మళ్ళీ మొదటికే వచ్చేది.

అలాంటి సంసారజీవితంలోనే సుగుణ ఓ పిల్లతల్లయింది. ప్రేమరాహిత్యంలో యాంత్రి కమైన దాంపత్య జీవితాన్ని గడుపుతున్నా ఆమెలోని స్త్రీ హృదయం తనలోకి హత్తుకునే ఎదకోసం అల్లాడిపోతూనే వుండేది.

భర్త ప్రవర్తనతో విసిగిపోయివున్న సుగుణ



ఒకసారి అసహనంతో పెద్దగా గొడవపడి పుట్టింటికి వచ్చి ఐదారు నెలలుండిపోయింది.

అప్పుడే జీవన్, సుగుణ చేరువయ్యారు. ఒకరిది చేదు అనుభవం. మరొకరికి అసలు అనుభవమనేది ఉందో, లేదో తెలియని త్రిశంకు జీవనం.

దప్పికగొన్న బాటసారులైన ఇద్దరూ ఒకరినొకరు ఆలంబన చేసుకోవాలనుకున్నారు. ఓదార్పుల ఒయాసిస్ కావాలనుకున్నారు. దాన్నే అభిమానం అనుకున్నారు. ప్రేమ అనుకున్నారు. ఆప్యాయత అనుకున్నారు. తమదైన అనుభవాల కోసం తపించారు. ఆ ప్రయత్నంలో ఒక్కటయ్యారు.

అది తప్పా అనే దానికంటే వారి విషయంలో తపన, అవసరం ఎంత బలీయమయ్యాయనేదే మిగిలింది. అసలు వారిరువురు అది తప్పనుకోలేదు కాబట్టి తప్పొప్పుల ప్రసక్తి అనవసరమేమో.

కాలం వాళ్లిరువుర్నీ అలాగూ ఉండనీయులేదు. ఆ ఇద్దరి మధ్య సుగుణ భర్త సంసారబంధం రూపంలో ప్చాడు.

భర్త ఆమెను రమ్మని వదేవ, కబురు చేసినా తల్లిదండ్రులు వెళ్లమన్నా ఆయనతో నేను సంసారంచేయలేనని చెప్పేసింది.



అయితే సుగుణ భర్తే ఒకటికి నాలుగు సార్లువచ్చి తప్పయిపోయిందని రాజీకి రావడంతో 'బుద్ధిగా వెళ్లి సంసారంచేసుకో. పిచ్చిపోకడలు పోకు' అని అయినవాళ్లు, బయటివాళ్లు అదే పనిగా హితబోధచేయడంతో, సంసారం, పిల్లలు, సామాజిక భద్రత, పరువు, గౌరవం అన్నిటిగురించి చెవినిల్లు కట్టుకుని పోరడంతో, చివరకు లాభనష్టాలు బేరీజు వేసుకున్న సుగుణ జీవన్‌తో పంచుకున్న ఊసులు, బాసల్ని మరచింది. అతణ్ణి తిరిగి ఎడారిబాటసారిగా మిగిల్చి కష్టమోసుఖమో బుద్ధిగా సంసారం చేసుకుంటూ మర్యాదను కాపాడు కోవడంకోసం కట్టుకున్న వాడి వెంట వెళ్లిపోయింది.

వివాహితే కాక పిల్ల తల్లి కూడా అయిన ఒక స్త్రీతో జీవితం ముడిపెట్టుకోవాలనుకోవడం ఒక భ్రమ, ఒక పిచ్చి ఆలోచన అని తెలుసుకున్న జీవన్ స్వప్నం మరోసారి భళ్లున పగిలిపోయింది.

అతడి ఆశ తెగిపోయింది. నమ్మకం రాలిపోయింది. గుండెల్లోకి ఆహ్వానించుకున్న మమత గాలిలోని దీపమయింది. రెపరెప లాడిన హృదయం నిరాశతో నిట్టూర్చింది. మళ్లీ గాలిపటమయ్యాడు. చుక్కాని లేని నావయ్యాడు. చేస్తున్న ఉద్యోగం కూడా మానేసి అన్నిటిపట్ల నిరాసక్తంగా గడుపుతున్న అతడిని ఎవరెన్ని చెప్పీ మార్చలేకపోయారు.

మునలివాళ్లయిన తల్లిదండ్రుల్ని ఎవరూ పట్టించుకోవడంలేదని ఆర్థికంగా ఎన్నో ఇబ్బందుల పాలవుతున్నారనే వాస్తవం గ్రహించి నాగభూషణం ప్రోత్సాహంతో ఉద్యోగాల వేటలో ఇక్కడకు చేరుకున్నాడు.

చేసే పనిలో నైపుణ్యం, అనుభవం రెండూ ఉండడంతో ఇక్కడ పరిశ్రమలు ఎక్కువే కావడంతో సులువుగానే ఉద్యోగం సంపాదించుకుని నాగభూషణం, కరుణాకర్‌లతో కలిసి ఉంటున్నాడు.

ఇక్కడ, పూర్ణిమ అతడి జీవితంలోకి ప్రవేశించింది. తోడుకోసం ఆరాటాన్ని మరచిపోయిన అతడి హృదయంలో స్పందనల్ని పునరుద్ధరించి అతడి ఆశలకు మళ్లీ జీవం పోసింది.

★ ★ ★

"మీ అమ్మ ఆరోగ్యం బాగోలేదు. డాక్టరుకు చూపించడానికి చేతిలో చిల్లిగవ్వలేదు. వెంటనే ఎంతో కొంత డబ్బు పంపించు లేదా ఒకసారి వచ్చి వెళ్లమని" జీవన్‌కి తండ్రి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. అది చదివి అతడు చాలా ఉదాసీనత కనబరచడంతో కోప్పడ్డాను.

సమాధానంగా "ఎంత కాలం చూడాలి నేను. నాకూ అవసరాలు, ఇబ్బందులు ఉండవా? ఎప్పుడు పడితే అప్పుడు వాళ్లకి డబ్బు పంపించాలంటే ఎలా కుదురుతుంది?" అన్నాడు.

అతడెప్పుడూ మాట్లాడని రీతిలో మాట్లాడడంతో నాకు ఆశ్చర్యమనిపించింది.

"నిజమే నీ ఇబ్బందులు నీకుంటాయి. కాని వాళ్లు నీ మీద పూర్తిగా ఆధారపడి లేరు. చేతిలో లేకే కదా నిన్ను పంపించమన్నది. కష్టమెదురైనప్పుడు వాళ్ల మానాన వాళ్లని వదలివేస్తే అది మూర్ఖత్వమే అవుతుంది. మీ అన్నయ్య ఎలాగూచూడడు. ఇప్పుడు నువ్వూ చూడనంటే మంచానపడిన మీ అమ్మ ఏమవుతుంది? మిమ్ములను కన్నందుకిది ప్రతిఫలమా?" కొంచెం తీవ్రంగా అన్నాను. జీవన్‌తో నాకున్న స్నేహం, చనువు పురస్కరించుకుని.

జీవన్ మాట్లాడలేదు. అతడి దగ్గర డబ్బులు లేవేమోననే అనుమానం కలిగి నీ దగ్గర డబ్బులు లేక ఇలా మాట్లాడుతున్నావా లేక నిజంగా పంపడం ఇష్టంలేదా?" అనడిగాను.

జీవన్ జీతం రాగానే తన చిల్లర ఖర్చులకు కొంత ఉంచుకుని మిగిలింది నాగభూషణంకి చ్చేస్తాడు. నాగభూషణానికి కాంట్రాక్టు డబ్బు ఎప్పుడూ సమయానికి అందదు కాబట్టి అది అందేవరకు జీవన్ జీతం ఇంటి ఖర్చుకు వాడుకుంటుంటారు. సంవత్సరంగా ఇదే జరుగుతోంది. నాగభూషణం ఖర్చు ఎక్కువ కావడం వల్ల చాలాసార్లు డబ్బుకోసం తడుముకోవడమే అవుతుంది.

జీవన్ దీనికీ జవాబు చెప్పక పోవడంతో, "అసలు నాగభూషణం వాళ్లమ్మ వచ్చాక కూడా నీవా ఇంట్లో ఉండడం తప్పు. జీతం తీసుకు వచ్చి ఇంకా నాగభూషణం చేతికివ్వడమూ తప్పు. రేపు నీకేదైనా అవసరం వస్తే సమయానికి సర్దగలడా?" అన్నాను.

"నాకు పెద్దగా ఏం అవసరాలున్నాయి"




అన్నాడు జీవన్.

"ఏమున్నాయంటావేమిటి. ఇప్పుడు మీ నాన్నకు పంపవలసివచ్చింది. అది అవసరం కాదా. నీ విడాకుల విషయాన్ని కోర్టుబయట పరిష్కరించుకోవాలంటే డబ్బు అవసరమని లాయర్ చెప్పలేదా? దానికి వెంటనే సర్దగలడా? సమయానికి అందవచ్చు అందకపోవచ్చు. అదే నీవు బయటకువచ్చి, పోనీ రాకపోయినా నీకవసరమైనంత వాడుకుంటూ కొంత ఇంటికి పంపి మిగిలింది. బ్యాంకులో వేసుకుంటే ఎంత ఉపయోగంగా ఉండేది. ఇప్పుడు చూడు పదిహేనువందలదాకా వస్తున్నా అవసరానికి తడుముకోవల్సివస్తోంది" అన్నాను.

అసలు జీతం పన్నెండొందలయినా ఓ.టి.లు కూడా చేస్తుండడంతో కొంచెం అటూ ఇటూగా నెలకు పదిహేనువందల వరకు వస్తుంది జీవన్‌కి.

"అవసరమొస్తే నాగభూషణం సర్దకుండా ఉంటాడా. వాడికి మాత్రం కోర్టు గొడవ, లాయర్ చెప్పిందీ తెలుసుగా" ప్రొటెస్ట్ చేస్తున్నట్లుగా అన్నాడు జీవన్.

"అదే నీ తెలివి తక్కువ. ప్రస్తుతం నీ చుట్టూ ముళ్లు పరచుకుని మధ్యన నిలబడ్డావు. పూర్ణిమతో నీ ప్రేమ విషయం తెలిసిన రోజున పరిస్థితి ఇలాగే ఉంటుందని, నాగభూషణంలో మార్పురాదని చెప్పగలవా? చెప్పలేవు. ఆ మార్పు సహజమని నీకూ తెలుసు. ఒకవేళ అతడికి ఈ విషయం తెలియకపోయినా అంత సొమ్ము ఒకేసారి కావాలంటే తెచ్చిస్తాడా? ఇవ్వగలిగితే మంచిదే. లేకపోతే... అదే నీవు నీదనేదిగా మిగుల్చుకోగలిగితే..."

నాకు అక్కొస్తూ తల్లిదండ్రుల గురించి "వాళ్లు కట్నంకోసం నన్ను బలిపశువుని చేసి పెళ్లి పేరున నా బ్రతుకు నాశనంచేశారు" అని కాస్త కోపంగా అన్నాడు.

"నీ డబ్బు నీ దగ్గరే ఉంచుకోవడం మంచిదని ఉదాహరణగా విడాకుల గురించి ప్రస్తావించే నువ్వు మీ అమ్మ నాన్నల మీద విరుచుకుపడతావెందుకు. అయినా నీ భార్య సంగతి పెళ్లికి ముందే తెలుసంటావా? తెలిసి తెలిసి కేవలం డబ్బు మీది ఆశతో కొడుకు భవిష్యత్తు నాశనం చేయగల తల్లిదండ్రులుంటారనుకోకు. మూర్ఖమైన ఆలోచనలు కట్టిపెట్టి ఇంటికి వెళ్లు. రెండు మూడొందలు కావాలంటే నేను సర్దుతాను" అన్నాను నేనూ కొంచెం కోపంగా.

విని ఏం మాట్లాడకుండా వెళ్లి పోయాడు. అతడిలోని యాజిటేషన్‌ని గుర్తించి మౌనంగా ఊరుకున్నాను, అపలేదు.

మరునటిరోజు సాయంత్రం వచ్చి "ఇంటికి వెళ్తున్నాను డబ్బుకావాలి" అన్నాడు జీవన్.

"నాగభూషణం ఇవ్వలేదా" అనడిగాను.

తప్పుచేసిన వాడిలా తలవంచుకుని "ప్రస్తుతం లేవు. ఎక్కడైనా చూసి పట్టుకెళ్లు, వచ్చాక సర్దుతానన్నాడు" అని చెప్పాడు.

మూడొందలు జీవన్ చేతికిస్తూ "నిన్న చెబితే మొండికేసావు. మరి ఈరోజు ప్రయాణమయ్యావే" అన్నాను.

నేను తనని హేళన చేస్తున్నాననుకుని అనుమానంగా చూసాడు నన్ను. అది గమనించి, "ఎగతాళి చేయడంలేదు. నిజంగానే అడుగుతున్నాను" అన్నాను.

మాట్లాడకుండా జేబులో నుండి ఒక కాగితం తీసిచ్చాడు. విప్పి చూశాను. జీవన్ తల్లి ఆరోగ్యం బాగోలేకపోయినా అతడు ఇంటికి వెళ్లననడం తెలిసి వివరంగా మాట్లాడే అవకాశంలేక పూర్ణిమ రాసిన ఉత్తరమది.

".... నువ్వు అన్నయ్యతో మాట్లాడుతుంటే విన్నాను. నీ తల్లిదండ్రులు నీ జీవితాన్ని నాశనం చేశారా? ఎలా? వాళ్లు నీ సుఖంకోరే పెళ్లి చేశారు. ఆ అమ్మాయి అలాంటిదని వాళ్లు కలగన్నారా? అందుకు నువ్వు వాళ్లని శిక్షిస్తావా? అదీ ఇంతకాలం తర్వాత. అనవసరంగా వాళ్ల పై నీకు కోపం ఎందుకు? తమకు తెలియకుండా వాళ్లు చేసిన పొరపాటుకి నీ మనసులో బాధ, కోపం ఉంటే ఉండవచ్చు. కాని ఇన్నాళ్లూ ఆ కోపాన్ని నీలోనే దాచుకుని చిన్న చిన్న విషయాలలో బయటపడి ఇలా మాట్లాడడం తగదు. నీవలా ఎందుకన్నావో నాకు తెలుసు. అన్నయ్య నీ డబ్బు వాడేసాడు. నీవడిగినా ఇప్పుడు లేవని ఉంటాడు. నీ దగ్గర డబ్బులేకపోతే నా చెవిపోగులిస్తాను. అవి అమ్మేస్తే ఆరొందలయినా రాకపోవు. వీళ్లడిగితే ఎక్కడో పెట్టి మరచిపోయానని చెబుతాను.



తిడితే తిడతారు. అది ఎప్పుడూ ఉండేదేగా. నీవు మాత్రం వెంటనే వెళ్లి మీ అమ్మను చూసిరావాలి. నాకీవిషయం అనవసరమని నీవనుకున్నా ఆ ఇంటికి కాబోయే కోడలిగా నేనూ ఆలోచించాలిగా. అదీ కాదనుకున్నా కన్నవాళ్లని అందునా కొద్దోగొప్పో నీమీద ఆధార పడిన వాళ్లని చూడాల్సిన నీ బాధ్యతను ఒక స్నేహితురాలిగా గుర్తుచేస్తున్నాను. ఉన్న వాళ్లని కాదనుకోకు'' అని రాసింది.

పూర్ణిమలోని హృదయౌన్నత్యాన్ని మెచ్చుకో కుండా ఉండలేకపోయాను. ఆ ఉత్తరం తిరిగి జీవన్‌కి ఇచ్చేసాను.

జీవన్ వాళ్లూరు వెళ్లి మూడురోజుల తర్వాత తిరిగివచ్చాడు.

''అమ్మని డాక్టర్‌కి చూపించాను. టైఫాయ డని చెప్పాడు. అక్కని తీసుకొచ్చి అమ్మవాళ్ల దగ్గర దింపివచ్చాను ఒక నెల రోజులుండ మని. అమ్మా నాన్నకు పూర్ణిమ సంగతి చెప్పా ను. మొదటవాళ్లొప్పుకోలేదు. ఎంతో నచ్చచె ప్పాను. చివరకు నీవు సుఖపడతాను, ఎటు వంటి ఇబ్బంది కలగదు అనే నమ్మకం ఉంటే నీ ఇష్టం వచ్చినట్లు కానీయి. ఒకసారి నీ జీవితాన్ని చేజేతులార కట్నానికి ఆశించి తెలిసో తెలియకో బలి చేశాం. నువ్వో మరో సారి తెలిసి తెలిసి నాశనం చేసుకోకు. నీకు నచ్చిన ఆ అమ్మాయి నిన్నూ కోరుకుంటే మాకేం అభ్యంతరం లేదన్నారని చెప్పాడు.

జీవన్ తరపునుండి గ్రీన్ సిగ్నల్ వచ్చి నందుకు ఆనందమన్పించింది. ఇక పూర్ణిమ అన్నయ్యలను దారిలోకి తేవాలి. వాళ్లొప్పు కుంటే పూర్ణిమ తల్లినొప్పించడం పెద్ద సమస్య కాదనిపించింది.

★ ★ ★

మనిషి మనిషిగా బ్రతకడానికి ఒక అవసరం ఉండాలి. ఏదైనా నమ్మకం, ఆశ మనిషిని నడిపించగలిగి రక్తానికి ఊపిరి నొసగాలి. ఒక ఆలంబన ఉండాలి. అప్పుడే బ్రతుకు మీద తీపి, బ్రతకాలన్న కోరిక, బ్రతుకుతున్నందుకు ఒక సంతృప్తి ఉంటాయి. ఇవి కొండంత బలాన్నిచ్చి అడుగు ముందుకు పడేలా చే స్తాయి. ఆశ, విశ్వాసం, నమ్మకం ఏమీలేనప్పు డు నిస్తేజంగా జీవచ్ఛవంలా మిగిలిపోవడం మినహా మరేమీ ఉండదు.

పూర్ణిమకు తను ఆనందంగా బ్రతకాలి అనుకోవడానికి ప్రేమభావం ముఖ్యమై మిగి లిందిప్పుడు.

ఆత్మ విశ్వాసం నశించిన యువతీయువకు లు వివాహానికి అర్రులు చాస్తుంటారు. తమ వర్తమాన జీవితం బాధామయంగా ఉన్నప్పు డు కఠోరవాస్తవం నుండి ఓ పలాయనానికి వివాహమే ఆశ్రయంగా వారు భావిస్తుంటారు. తల్లిదండ్రులతో తమ బాంధవ్యం సంతృప్తిక రంగా లేనప్పుడు, వారితో తరచూ కలహించే యువతీ యువకులు ఎక్కువగా ప్రేమలో చిక్కుకుంటారు. అందరూ ఉన్నా ఇంట్లో ఒంటరి తనం అనుభవించవలసి వచ్చినవా ళ్లు గాఢమైన ప్రేమ భావనకోసం పరితపిస్తుంటారు. ఈ భయంకరమైన ఒంటరితనా న్ని పోగొట్టుకునే ప్రయత్నంలో భాగంగా పూర్తిగా ప్రేమలో మునిగిపోతారు. బాధాకర మైన అనుభూతులు ఒకే రీతిలో ఎదురైతే అది ఒకరితో ఒకరు పంచుకోగలిగినవి, అనుభ వించేవి అయితే వారిని మరింత దగ్గరకు చేర్చి ఆ ప్రేమ భావనను దృఢతరం చేస్తా యని ఒక సైకాలజీ మ్యాగజైన్‌లో చదివాను.

ఒంట్లో కొంచెం నలతగా ఉండడంతో ఆరోజు హాఫ్‌డే సెలవు పెట్టి వచ్చేశాను.

ఇంటికి వచ్చిన నాకు అమ్మతో కబుర్లు చెబుతున్న పూర్ణిమ కనుపించింది.

నేను ఆ టయిమ్‌లో రావడం, డల్‌గా ఉండడం చూసి అమ్మ ''ఏంటిరా అలా ఉన్నావు ఒంట్లో బాగోలేదా'' అనడిగింది.

''జలుబుతో బాగా తలనొప్పిగా ఉందమ్మా'' అని చెప్పాను.

''డాక్టరు దగ్గరకు వెళ్లి చూపించుకు రాకపో యావా?'' అంది అమ్మ.

''ఆ... ఈ మాత్రం దానికి డాక్టరు దగ్గరికి వెళ్లడందేనికిలే. టాబ్లెట్లు వేసుకున్నాను. మిరి యాల పొడి వేసి బాగా వేడికాఫీ ఇవ్వు'' అని అమ్మతో చెప్పి నా గదిలోకి వెళుతుంటే ''అమృ తాంజనం రాయనా అన్నయ్యా'' అనడిగింది పూర్ణిమ.

''వద్దు పూర్ణిమా... ఇప్పుడు కాస్త రిలీఫ్‌గానే ఉంది'' అన్నాను.




పది నిమిషాల తర్వాత పూర్ణిమ కాఫీ తెచ్చి చ్చింది. అమ్మ వచ్చి జ్వరం ఉందేమోనని నా చెంప, నుదురు మెడకింద తాకి చూసి జ్వరం లేదులే. కొంచెం సేపు పడుకో చలిగాలిలో ఎక్కువసేపు బయట తిరగొద్దురా అంటే వినవు'' అని నేను తాగిచ్చిన కాఫీ కప్పుతీసు కుని వెళ్లింది.

పూర్ణిమ అమ్మనడిగి అమృతాంజనం తెచ్చి నేను వద్దమ్మా అంటున్నా విన్పించుకోకనుదు టిమీద రాస్తూ కూర్చుంది. అమృతాంజనం ఘాటుకు నేను కళ్లు మూసుకుని.

''ఏమిటి పూర్ణిమా... కబుర్లు. ఈమధ్య వారం పదిరోజులగా నువ్వూ కనబడలేదు. జీవన్ కూడా కలిసి వారమయింది'' అన్నాను.

''జీవన్ వోవర్ టైమ్ చేస్తున్నాడన్నయ్యా. వర్క్ ఎక్కువగా ఉందట'' అని ''నేనీమధ్యలో ఒకటి రెండుసార్లు వచ్చాను. కాని నీవే లేవు. ఆఫీసునుండి రావడమే లేటుగా వస్తున్నావని పిన్ని చెప్పింది'' అంది.

''ఆడిటింగ్ జరుగుతోంది. అందువల్ల బాగా ఆలస్యమవుతోంది నేను వచ్చేటప్పటికి'' అన్నాను.

రెండు నిమిషాల తర్వాత అమృతాంజనం సీసా అల్మరాలోపెట్టి ''పడుకుంటావా అన్న య్యా... నేను వెళతాను'' అంది పూర్ణిమ.

''నిద్రపట్టదులే పూర్ణిమా... కూర్చో'' అన్నా ను.

''నాగభూషణం బిల్స్ కోసం బాగా తిరుగు తున్నట్లున్నాడు. కొంతైనా డబ్బువచ్చిందా'' అనడిగాను.

''తెలియదన్నయ్యా. వచ్చిందీ లేనిది ఎవ రికీ చెప్పడు. మొన్న అమ్మ సరుకుల కోసం డబ్బడుగుతుంటే 'కుప్పపోసుకుని కూర్చున్నా ననుకున్నావా' అంటూ విసుక్కున్నాడు. ఏవో ఎరియన్స్ బాపతు వచ్చాయని జీవనే రెండొందలిచ్చాడు'' అని చెప్పింది.

''అదెప్పుడూ ఉండేదేగా'' అని ''మీ బాబాయి వచ్చాడా'' అనడిగాను.

''ఉహూ'' అంది అది అయిష్టమైన విష యంలా క్లుప్తంగా.

నేనింకేమీమాట్లాడకుండా కళ్లు మూసుకున్నా ను. కొంచెం సేపటి తర్వాత అన్నయ్యా... అనిపిలిచింది పూర్ణిమ.

కళ్లు తెరచి ఏమిటన్నట్లు చూశాను.

ఆమె మాట్లాడకపోవడంతో ''ఏంటి పూర్ణిమా ఏమైనా చెప్పాలనుకుంటున్నావా'' అనడిగాను. అవునన్నట్లు తలూపింది.

''మరి సంశయం దేనికి చెప్పు'' అన్నాను లేచి దిండు గోడకు ఆనించి కూర్చుంటూ.

''నాకాయింట్లో ఎక్కువకాలం ఉండాలని లేదన్నయ్యా. ఈమధ్య అసలు వాళ్లతో సరిపె ట్టుకుని ఉండలేకపోతున్నాను'' అంది.

''ఎందుకని''

''ఇంట్లో ఎప్పుడూ ఏదో ఒకగొడవ. రాద్ధాంతం. ఒకళ్లనొకళ్లు శత్రువుల్లా తిట్టుకో వడం. పోట్లాడుకోవడం. ఆ వాతావరణంలో ఇమడలేకపోతున్నాను''

''అది ఇవాళకొత్తది కాదుగా. నీకు ఊహ తెలిసిన నాటినుండి జరుగుతున్నదే. ఇప్పుడు కొత్తగా ఇమడలేకపోవడం అనేదేముంది?''

''చిన్నప్పటినుండీ అలవాటయిందే. కాని అది ఈమధ్య కొత్తగా అన్పిస్తోంది. జీవన్‌ని కేంద్రంగా చేసుకుని నేను నిర్మించుకుంటున్న మనోలోకం చుట్టూ ఉన్న ఈ బాహ్యావాతావ రణం మరీ ఇబ్బందికరంగా ఉంది.

''వాస్తవం నుండి అప్పుడప్పుడు దూరంగా పారిపోయి కాసింత కొత్త ఊపిరిని పోసుకోవడా నికి ఊహాలోకంలో విహరించడం అవసరమే కాని అదే ప్రధానంగా చూసుకుని వాస్తవం నుండి తప్పించుకోవడం సాధ్యంకాని పని పూర్ణిమా. వాస్తవం ఎంత చేదైనా దాన్ని స్వీక రించి అనుభవించక తప్పదు. మనసును ఎప్పుడూ ఊహల్లో తేలియాడించుకోవడం చాలా చికాకులకు దారితీస్తుంది''

''నిజమే అన్నయ్యా. కాని వాస్తవం భరించ రానిదయితే... సాధ్యమైనంత త్వరగా దాన్నుండి బయటపడి వాస్తవంగా మలచుకో దగిన మరో లోకాన్ని మన అందుబాటులోకి తెప్పించుకోవాలను కోవడం తప్పుకాదుగా''

''కాదు'' అని పూర్ణిమను పరికించి చూస్తూ ''ఏమిటి నిన్ను ఈమధ్య ఇంతగా కలతబెట్టే విషయం'' అనడిగాను.

''వాళ్లు నాకు పెళ్లి చేయాలనుకుంటున్నా

రు'' వాళ్లు అనడంలోనే పూర్ణిమ తన అన్న య్యలనుండి దూరంగా పోవాలని ఎంతగా అనుకుంటూందో తెలుస్తోంది.

''ఏదైనా సంబంధం చూశారా''

''ఊఁ''

''ఎక్కడ? ఎవరు?''

''మా బావనే''

''అంటే''

''మా రెండో మేనమామ కొడుకు''

''అతణ్ణి చేసుకుంటావా అనడిగారా నిన్ను''

''లేదు... పెద్దన్నయ్య అమ్మతో మాట్లాడు తుంటే విన్నాను''

''అతడు- అదే మీబావ ఎలాంటివాడు?''

''అతణ్ణి చూడడమే కాదు. తలచుకోవడాని కే నాకసహ్యం'' తన ఏవగింపునంతా స్వరంలో వ్యక్తంచేస్తూ.

''ఏం''

''ఉట్టి పశువు...'' అని కొద్దిక్షణాల తర్వాత తనే అంది- ''మేము మా ఊళ్లో ఉన్నప్పుడు ఒకసారి అమ్మ ఇంట్లోలేని సమయంలో బాగా తాగివచ్చి నన్ను బలవంతం చేయబోయాడు. అదే సమయానికి బయటికెళ్లిన అమ్మ రావ డంతో తప్పించుకున్నాను. మరోసారి కూడా ఆ ప్రయత్నం చేశాడు. నేను లొంగకపోవడంతో ఆ కోపంతో నామీద పుకార్లు పుట్టించాడు. అమ్మకు నాపై లేనిపోనివన్నీ కల్పించి చెప్పాడు. నిజం తెలుసుకోకుండా అమ్మ నన్ను గొడ్డుని బాదిన ట్లు బాదింది. మా బావ ప్రచారం చేసిన పుకార్లు చెవినబడ్డా అలాగే కొట్టేది. ఏ తప్పుచే యని నామీది పుకార్లకు మూలం తనని, తన చరిత్ర తన పిల్లల్ని చులకన చేస్తోందని తెలుసుకోదు. ఎప్పుడైనా బాధలో నేను 'నాన్నే ఉంటే ఈ తిప్పలుండేవి కావుగా' అంటే పిచ్చితిట్లు తిట్టి 'పో... పోయి మీ బాబు దగ్గరే తగలడు. అక్కడే చావవే' అనేది''

''మీ బావ చేసిన పనిగురించి మీ అమ్మా, అన్నయ్యలకు చెప్పకపోయావా?''

''చెప్పాను. నాపై పుకార్లు లేవదీసిందీ అత డే అని కూడా చెప్పాను. వాళ్లు నమ్మలేదు. నామీదకంటే కూడా నంగిలాగ వుండే ఆ నాలిముచ్చుమీదే వాళ్లకు నమ్మకం ఎక్కువ. అతడంటే గిట్టక చెప్పానని నామీద విరుచుకు పడ్డారు. ముఖ్యంగా అమ్మ ఇది జరిగాక చాలా సందర్భాలలో అమ్మ నన్ను హీనంగా చూసేది.

''ఎందుకు''

పూర్ణిమ మాట్లాడలేదు.

''ఎందుకు పూర్ణిమా? ఏదైనా ప్రత్యేక కారణ ముందా'' మళ్లీ అడిగాను. ఉందన్నట్లు తలూ పింది.

''ఏమిటది?''

రెండుక్షణాలు సందేహిస్తున్నట్లు ఆగి- ''నీకి దివరకు చెప్పని విషయాలన్నయ్యా ఇవి. మా మేనమామకొడుకూ అన్నయ్యలకేం తీసిపోడు. అతడికి సర్వలక్షణాలున్నాయి...''

''ఏం చేస్తుంటాడు'' మధ్యలో అడ్డుకుంటూ అడిగాను.

''లారీడ్రైవర్''

''ఉహూ...'' అన్నాను అర్థమయినట్లుగా- అతడూ మోటార్‌ఫీల్డ్ మనిషేనన్నమాట అను కుంటూ.

''అమ్మకు అతడంటే ఇష్టం. అన్న కొడుకని ఇష్టమో లేక అదంతా నటనో నాకు తెలియదు కాని నన్నతడికిచ్చి పెళ్లిచేసి నా భారాన్ని వదిలించుకోవాలనేది అమ్మ. మా కుటుంబా న్ని చూసి నన్నెవరూ చేసుకోరనే ఆలోచనవల్లో ఏమో తెలియదు కాని ఆవిడకు ఆ ఉద్దేశం మాత్రం ఉంది. చాలాసార్లు తనలోని భావాన్ని బయటకే చెప్పింది. నేను పదోతరగతిలో ఉండగానే అతడితో పెళ్లి చేసేద్దామనుకుంది. చిన్నదేగా అంత తొందరేముందని పెద్దన్న య్య వద్దనడంతో ఊరుకుంది. ఆ తర్వాతే అతడు నాతో అలా ప్రవర్తించాడు. అతడంటే గిట్టక చెప్పాననుకుంది అమ్మ. ఆవిడ అతడి గురించి మెచ్చుకోలుగా మాట్లాడినప్పుడల్లా నేను విసుక్కునేదాన్ని. అమ్మ నన్ను తిట్టేది. నేనెదురుతిరిగేదాన్ని. కొన్ని కొన్ని సందర్భా లలో అమ్మ ప్రవర్తనను కూడా ఎదురించి ప్రశ్నించేదాన్ని...''

''ఇదివరకు మీ అమ్మ ప్రవర్తనను నువ్వేగా సమర్థించావు. అది తప్పనుకోవడం లేద న్నావు'' అన్నాను.





"అవును. అది బాబాయితో అమ్మ జీవితం ముడిపడడంవరకే. నీకు అప్పుడే చెప్పాను- నేనెంతగా సమర్థించుకుంటూ ఆలోచించినా ఒక్కోసారి నా మనసు నాకే ఎదురుతిరిగే దని..."

"ఎందుకు"

"మా జీవితాలు, కష్టాలు, కన్నీళ్లు, బాధలు అన్నిటికీ మొదటి కారణం నాన్న రెండో కారణం అమ్మ" అంది పూర్ణిమ.

చెప్పు అన్నట్లు చూశానామెను ఏం మాట్లా డక.

"అన్నయ్యా. ఈ విషయాలు చెప్పుకోవడం నాకే సిగ్గుచేటు. ఇంతకాలం మార్గంలేక ఆ గూటిపక్షిగా మిగిలిన నేను మనసు నలిగిపోతు న్నా వాళ్లమధ్యే ఉన్నా నేను వాళ్లనుండి ఎంత త్వరగా పారిపోదామనుకుంటున్నానో, నాదైన ప్రపంచంలో మనశ్శాంతిగా బతకడానికి నేను పడుతున్న తహతహను, దానివెనకగల కారణా లను నీవర్థం చేసుకుంటావనే నమ్మకంతో చె బుతున్నాను.

"మా చిన్నతనంలో అమ్మకు బాబాయితోనే కాక ఇంకా కొందరితో సంబంధం ఉంది. ఎవరైనా వచ్చినప్పుడు నేను పడుకున్నాక నన్ను వంటఇంట్లో పెట్టి తలుపులు వేసేది. నిద్రపోతున్న నాకు మెలకువ వచ్చి లేచి పక్కన ఎవరూ లేక నేను భయంతో ఏడిస్తే "పడుకోలేవూ. ఎప్పుడూ పక్కనే చావాలా" అని కొట్టేది. నన్నెందుకు దూరంగా ఉంచేదో అప్పట్లో తెలిసేది కాదు. అమ్మ తనతో సంబంధం ఉన్నవాళ్లని బొమ్మలకనో, బట్టల కనో ఏదోవంకతో నన్ను డబ్బు అడగమనేది. బాబాయి ఇచ్చేదికాక అవి ఇవి చెప్పి డబ్బులు గుంజేది. ఏవైనా వస్తువులు తాకట్టు పెట్టుకుని ఆ డబ్బు వడ్డీలకిచ్చేది. అమ్మ విషయం తెలిసో మరెందువల్లో తెలియదు. కాని బాబాయి అమ్మ కూడా చాలాసార్లు గొడవపడే వాళ్లు. ఇవన్నీ చూస్తూ ఎదుగుతున్న నాకు తలబద్దలు కొట్టుకుని చచ్చిపోవాలనిపించేది. అప్పుడప్పుడు అమ్మకు ఎదురుతిరిగి ఆమె చేష్టలను ప్రశ్నించేదాన్ని. ఒక్కోసారి బాబాయి కి చెబుతానని బెదిరించేదాన్ని. అలా బెది రించినప్పుడల్లా ఆయన కూడా రాకుండాపోతే చద్దురుగాని లేకపోతే గడ్డితిని బతుకుదురు గాని అని తిట్టిపోసేది. అన్నయ్యలు తిండికి, నిద్రకు ఇంటికిరావడం మినహా రోజులో అధిక భాగం రోడ్లమీదే గడిపేవాళ్లు. నేనే ఆ నర కంలో చిక్కుపడ్డట్టుగా గిలగిల కొట్టుకునేదాన్ని

"ఇక్కడకు రాబోయేముందు ఒకసారి అమ్మతో పెద్ద గొడవయింది. నేను బాగా ఎదు రుతిరిగి అన్ని విషయాల్లోను ఆవిడను నిలదీ శానని నన్ను చచ్చేట్లు కొట్టింది. అప్పటినుండి నాతో సరిగా మాట్లాడదు. ఇప్పటికీ అంతే. అవసరం ఉన్నప్పుడో, ఎవరైనా వచ్చినప్పుడో, బాబాయి ఉన్నప్పుడో మాత్రం ఆప్యాయంగా ఉన్నట్లు నాటకమాడుతుంది..." అని చెప్పి ఆగింది పూర్ణిమ.

అంతావిని, అది కలిగించిన ఆశ్చర్యంతో పూర్ణిమను చూస్తూ మౌనంగా ఉండిపోయాను.

ప్రేమ గురించి నమ్మించడానికి ఏ ఆడపిల్ల తన గురించి, తల్లి గురించి ఇలా చెప్పుకోదు అది వాస్తవం కాకపోతే పూర్ణిమ గొంతులో. స్పష్టంగా ధ్వనించే నిజాయితీ వుంది. గుండెలో గూడుకట్టుకున్న ఆవేదన వుంది.

వయసులో భర్త వదిలిపెట్టేస్తే గతంలో అనుభవించిన కోరికలకై శరీరం. మనసు తపిస్తుంటే ఆ కోరికల రాపిడి కొంత, అయిన వాళ్లూ సరిగా ఆదరించక ఒక కిందిస్థాయి మధ్యతరగతి ఆడదిగా చిన్నపిల్లలతో ఏ అండా లేకుండా బతకలేదు కనక కొంత. ఒకరితో సంబంధం కల్పించుకుని బంధం పెంచుకుంటే అర్థం ఉంది. కాని ఒకరుకాక ఇద్దరు ముగ్గురితో సంబంధాలు పెట్టు కుందంటే దానికి ఆర్థిక కారణాలను మించిన శారీరక, మానసిక కారణాలుండవచ్చు. అది మానసికోద్వేగం, ఉన్మాదం- ఏదైనా కావచ్చు. కొంతమందిలో కోరిక, ఉద్రేకం తీవ్రస్థాయిలో ఉంటాయనేది శారీరక శాస్త్రరీత్యా నిజం. కాని కూతురుండగానే ఆ పిల్లముందే జరుగు తుంటే కనీసం తెలిసినపుడైనా సర్దుకోలేకపోతే ఆ తల్లినేమీ అనలేక తనమీద తనకే అస హ్యంతో, బాధతో, ఆవేశంతో, కసితో, ఆ హృ దయం ఎంతగా నలిగిపోయుంటుందో పూర్ణిమ కళ్లలో కన్పించే కసి, బాధ సంవత్సరా లుగా మనసును నలుపుతున్న తపన, ఆర్తి, ఆ కన్నీళ్లు చెబుతాయి.



ఇటువంటి సంఘటనలు మనచుట్టూ వున్న సమాజంలో ఎన్నో ఎన్నెన్నో. అవి చూడలేక కొందరు, చూసి అవకాశాన్ని అనుభవిస్తూ కొందరు, మనిషి బలహీనతను వెక్కిరిస్తూ కొందరు సాగిపోతారు. సంస్కరణ అనేది మాన సికంగా నైతికవిలువల్ని గుర్తించి తెచ్చుకో వాలి కాని కొందరు పూనుకుని సంస్కరించా లని కంకణం కట్టుకున్నంత మాత్రాన జరగ నిది.

అటువంటి వాతావరణంలో పెరిగిన పూర్ణి మకు ఈ మనుషులమీద కోపం ఉండడంలో ఆశ్చర్యంలేదు. నిరంతర అంతర్మథనంతో తను తనుగా అల్లుకుపోవడానికి- వచ్చీరాని యుక్తవయసునుండే- సరైన ఆధారంకోసం పడేతపన, ఆరాటం, పట్టుదల చిన్నప్పటి నుండి తెలిసిన, అందుబాటులో ఉన్న జీవన్ మీద ఆకర్షణగా మారి బలమైన ముద్రవే శాయి.

జీవన్‌మీద పెంచుకున్న అనురాగంతో అత డితో కలిసి జీవితం పంచుకుని తన వాళ్లకు దూరమవ్వాలనుకునే పూర్ణిమ మనసు తహ తహ వెనక ఇన్ని బలీయమైన కారణాలున్నా యన్నది నేను- నేనే కాదు ఎవరూ ఊహించలే రనేది నిజం.

దీర్ఘమైన నిట్టూర్పు వెలువడింది నానుండి.

"మరి కరుణాకర్ నాగభూషణాలకివేవీ తెలి యవా పూర్ణిమా" అనడిగాడు.

"చాలావరకు తెలును. అయినా వాళ్ళేం చేస్తారు. అప్పుడప్పుడు అమ్మని తిట్టేవాళ్లు. వాళ్లకేవో చెప్పిఏడ్చేది" అంది.

నేను ఆలోచిస్తూ ఉండిపోయాను.

మా మధ్య నిశ్శబ్దాన్ని చీలుస్తూ పూర్ణిమ- "ఎన్నో రాత్రులు వీళ్లమధ్య నేనెందుకు పుట్టానా అని ఏడుస్తూ గడిపేదాన్ని. నాలో నాకే అర్థంకాని ఆలోచనలు గజిబిజిగా అల్లుకుని పిచ్చెక్కించేవి. జీవన్ చూపే అనురాగం, లాల నలో మాత్రమే కాస్త మనశ్శాంతనేది దొరికి ఆనందపడుతున్నాను. అందుకే నాలో ఉన్నది కేవలం శారీరక ఆకర్షణలు మాత్రమే కాదు. దానికి అతీతమైందని చెబుతున్నాను. ఎప్పు డైనా ఏకాంతం దొరికితే జీవన్ సమక్షంలో నేను గడిపిన ప్రతిక్షణం ఒక మధురానుభూతిగా మరిచిపోలేనంతగా ముద్రవేస్తున్నాయి. నేను జీవన్ మనిషినే అనే ఆశ, కోరికను నిజం చేసుకోవడానికి సాయం చేయన్నయ్యా" అంటూ నా చేతుల్లో ముఖం దాచుకుని దుఃఖా న్ని ఆపుకోవాలని ప్రయత్నించింది.

పూర్ణిమను ఓదారుస్తున్నట్లు మెల్లగా ఆమె తలనిమిరాను.

దుఃఖోద్వేగం తగ్గాక వోణీ చెంగుతో కళ్లు తుడుచుకుని- "తలనొప్పిగా వుంది నువ్వు రెస్ట్ తీసుకుందామని ఇంటికి వస్తే నా గొడవతో నీ తలనొప్పి ఇంకా పెంచేసివుంటాను. ఇక పడుకో" అని ముగ్ధంగా నవ్వేసి గదితలుపులు దగ్గరకు వేసి వెళ్లిపోయింది.



నాగభూషణం, కరుణాకర్‌లకు ఈ విషయం ఎలా చెప్పాలో అర్థం కాలేదు. దానికితోడు వాళ్లు ఆ విషయాన్ని ఎలా రిసీవ్ చేసుకుంటా రోననే ఆలోచన. అంత తేలికగా తీసుకోరనే విషయం నాకు ఖచ్చితంగా తెలును. కనీసం అర్థం చేసుకోవడానికైనా ప్రయత్నిస్తారా అనేది నన్ను వేధిస్తోన్న సంశయం. అందుకే వాళ్లు మరీ నెగిటివ్‌గా గ్రహించకుండా పాజిటివ్‌గా ఎలా చెప్పాలా అనేదే ఆలోచిస్తున్నాను.

నాగభూషణం, కరుణాకర్ ఎలాంటి వాళ్ల యినా భర్త ప్రవర్తన ఎలాంటిదైనా జీవన్ పూర్ణిమల విషయం తెలిస్తే సహించగలరా. బాధ, ఆవేశం కలిగితే అవి ఆలోచనను చంపక మిగిల్చివుంచుతాయా? ఎంత స్నే హితుడు, సన్నిహితుడు అయినా తమకులం కానివాడు, ఒకసారి పెళ్లయి విడిపోయినవా డు, ఆతర్వాత మరొకరితో సంబంధం పెట్టుకు న్నవాడు అయిన జీవన్‌తో పూర్ణిమ ప్రేమను




హర్షిస్తారా. అంత పెద్దమనసు వారిలో ఉందా? నాలో ఎన్నో అనుమానాలు, మరెన్నో ప్రశ్నలు.

చివరికి ఇది నా విషయమే అన్నట్లు కాస్త మార్పులతో కట్టుకథలల్లి చెప్పి 'మీ సలహా ఏమిటని' అడిగాను అన్నదమ్ములిద్దర్నీ విడివిడిగా. వాళ్ళు వెలిబుచ్చిన అభిప్రాయాలు స్పష్టంగా ఇదీ అని చెప్పలేనట్లున్నాయి. 'తీసుకొచ్చి పెళ్లిచేసుకో' అని కొంతసేపు 'నీకెందుకీ గొడవ. వదిలెయ్యి' అని కొంతసేపు ఏవేవో చెప్పారు. ఎందుకోగాని నాగభూషణంలోనే కాస్త మెతకదనం కనుపించింది నాకు.

"ఆమె తల్లిదండ్రులు, అన్నయ్యలు అర్థం చేసుకునేవాళ్లయితే వాళ్లకు చెప్పి ఒప్పించడమే మంచిది" అన్నాడతడు.

"మిగిలిన విషయాలకంటే ఇది భిన్నంకదా. అర్థం చేసుకుంటారని ఖచ్చితంగా అనుకోలేం. ఇలాంటి విషయాలకు వచ్చేసరికి కాస్త సహృదయులే విశాలంగా ఆలోచించలేరు. ఇక సాధారణ వ్యక్తుల గురించి చెప్పాలా" అన్నాను.

"ఆమె తండ్రికో, పెద్దన్నయ్యకో ఒంటరిగా ఉన్నప్పుడు చూసి చెప్పు. ఆలోచించి అర్థం చేసుకునేలా నచ్చచెప్పడానికి ప్రయత్నించు. కుటుంబంలో ఒక్కరికైనా తెలియజేసి సపోర్ట్ తీసుకోవడం మంచిది" అన్నాడు.

"నేను అదే చేద్దామనుకుంటున్నాను. సమయం చూసి అసలు విషయం నీకే చెబుదామనుకుంటున్నాను. నీ చెల్లెలి విషయమే కాబట్టి మరి నీవెలా స్పందిస్తావో అనుకున్నాను మనసులో.

నాకు తెలిసినంతవరకు జీవన్, పూర్ణిమ జాగ్రత్తగానే ఉంటున్నారు. మళ్లీ ఏక్షణంలోనైనా తొందరపడతారేమోనని అప్పుడప్పుడు జీవన్‌ని హెచ్చరిస్తూనే ఉన్నాను.

'లేనిపోనిది నెత్తిన పెట్టుకుంటున్నానా ఎంత స్నేహితులైతే మాత్రం వాళ్లకు సంబంధించని వ్యక్తిని నా కెందుకీ గొడవ. రేపు ఏది జరిగినా నా మీదకు రావచ్చు. వద్దని చెప్పానన్నా నమ్మరు. దీనికి దూరంగానే ఉంటే పోతుందేమోనని ఒక్కోసారి అన్పించేది.




అంతలోనే జీవన్, పూర్ణిమ నేనేదో సహాయం చేస్తానని ఆశపెట్టుకోవడం, నాగభూషణాన్ని ఒప్పించడానికి ప్రయత్నిస్తాను, మీరు తొందరపడి కాలు బయటపెట్టకండి. అని వారికిచ్చిన మాట, 'ఎలాగైనా మిమ్మల్ని కలిపి ఏ ఇబ్బంది కలగకుండా చూడగలవా అన్నయ్యా' అనే పూర్ణిమ అభ్యర్థన అన్నీ గుర్తొచ్చి ఆ ఆలోచన విరమించుకునేవాణ్ణి.

ఒకరోజు జీవన్ వచ్చి- "నాగభూషణం పూర్ణిమకు పెళ్లిచేయాలనుకుంటున్నాడు. వాళ్ల మేనమామ కొడుక్కి ఉత్తరంరాసి కనుక్కుంటే వాడు చేసుకోవడానికి ఒప్పుకున్నాడట. తాగుబోతు, తిరుగుబోతు అయినవాడికి ఎవరూ పిల్లనివ్వరని తెలిసే పూర్ణిమను వాడి కంటగట్టి తన బాధ్యత వదిలించుకోవాలని వాడి అభిప్రాయం కాబోలు" అన్నాడు.

నాగభూషణం ఈ ప్రయత్నాల్లో ఉన్నట్లు ఇంతకుమునుపే పూర్ణిమ నాకు చెప్పిందనే విషయం నేను జీవన్‌తో అనలేదు. పూర్ణిమ నాకు చెప్పాకే నాగభూషణం వాళ్ల మేనమామ కొడుక్కి ఉత్తరంరాసి ఉంటాడనుకున్నాను.

ఆ తర్వాత రెండురోజులు పూర్ణిమను కలిసి మాట్లాడే సమయం, అవకాశం దొరకలేదు నాకు.

ఇంతలో అర్జంటుగా మళ్లీ నేను అమలాపురం క్యాంప్ వెళ్లవలసి వచ్చింది.

వెళ్లేముందు కరుణాకర్ వాళ్ళింటికి వెళ్లాను. అన్నదమ్ములిద్దరూ లేరు. వాళ్లమ్మ వంటగదిలో ఉంది పూర్ణిమతో.

"పరిస్థితి మారబోతుందనుకుంటే అన్నయ్యతో నీవే మీ విషయం చెప్పెయ్యి. ఏదో ఒకవిధంగా ఒప్పుకునేలా ప్రయత్నించు. నేను దాదాపు వారం పదిరోజులవరకు రాలేను. వీలయితే నేను వచ్చేవరకు ఊరుకో. లేకపోతే కారణం చెప్పకుండా, పెళ్లి నిశ్చయం కాకుండా ఇప్పట్లో చేసుకోనని చెప్పు. కాదు, కూడదన్నాడా అప్పుడు అసలు విషయం చెప్పు. నాకు నాగభూషణంతో మాట్లాడే సమయంలేదు. పావుగంట, అరగంటలో తేలే విషయం కాదిది. నేను వెంటనే బయలుదేరాలి. వచ్చాక అతడికి అర్థమయ్యేలా అన్నీ చెప్పి ఒప్పించే ప్రయత్నం చేస్తాను. అసలు చెప్పకుండా ఉండటానికే ప్రయత్నించు. తప్పదనుకున్నప్పుడు మాత్రమే అసలు సంగతి బయటపెట్టు" అని

ఒకటికి రెండు సార్లు చెప్పాను.

పూర్ణిమ అలాగే అన్నట్లు తలూపింది.

"నీవేం బెంబేలు పడకు. అంతా సవ్యంగా జరుగుతుందని" ధైర్యం చెబుతున్నట్లుగా అని వచ్చేశాను.

★ ★ ★

ఎనిమిదిరోజుల తర్వాత క్యాంప్‌నుండి తిరిగి వచ్చాను.

ఉదయం ఆరింటికి ఇల్లు చేరుకున్న నేను వెంటనే స్నానాదికాలు ముగించుకుని నాగభూషణం ఇంటికి వెళ్లాను.

నేను వరండా గ్రిల్‌తలుపు తోసుకుని లోపలకు అడుగుపెడుతుంటే లోపలి గదిలోనుండి బయటకు వస్తున్న పూర్ణిమ నన్ను చూసి వెంటనే లోపలికి వెళ్లిపోయింది. ఎన్నడూలేనిది ఆమె అలా వెళ్లిపోవడం నాకు ఆశ్చర్యం కలిగించింది. కరుణాకర్ అప్పుడే లేచినట్లున్నాడు. నన్ను చూడగానే- "రా... ఎప్పుడొచ్చావు. కూర్చో" అని కాఫీ తెమ్మని వాళ్లమ్మని కేకేశాడు.

ఆవిడ ఇద్దరికీ కాఫీ తెచ్చిచ్చి- "ఊరికి వెళ్లావటగదా. ఎప్పుడొచ్చావు బాబూ" అనడిగింది.

"ఒకగంటయిందండీ" జవాబిచ్చాను.

నాగభూషణం కాఫీగ్లాసు పట్టుకుని వచ్చి పలకరింపుగా నవ్వి కాఫీతాగి ఏం మాట్లాడకుండా బయటికి వెళ్లిపోయాడు. అతడు ముభావంగా ఉండడంతో నా మనసు శంకించింది.

జీవన్ కన్పించలేదు. ఇంత పొద్దున్నే డ్యూటీకి వెళ్లడని తెలుసు. మరి ఏడీ కనిపించడే. ఊరికేమైనా వెళ్లాడా? అనుకుంటూనే- "జీవన్ ఇంత పొద్దునే డ్యూటీకెళ్లిపోయాడా" అని కరుణాకర్‌ని అడిగాను.

"ఆఫీసుకు దగ్గర్లో రూము తీసుకుని వెళ్లిపోయాడు" సమాధానమిచ్చాడతడు.

"అదేమిటి. హఠాత్తుగా" అన్నాను.

"రోజూ ఇక్కడనుండి వెళ్లడం కష్టంగా ఉందంట. అయినా అమ్మ ఆరోగ్యం కూడా అంతంత మాత్రమేగా. ఇన్నాళ్లూ నాకు చేసిపెట్టింది. ఇంకా భారంగా ఉండలేను అన్నాడు నేనడిగితే" అన్నాడు కరుణాకర్.

నా మనసులోని శంక బలపడింది. అది నిజమే అయ్యుంటుంది. అనుకున్నాను. కొంచెంసేపూ కూర్చుని వచ్చేశాను.

జీవన్ పనిచేస్తున్న కంపెనీకి ఫోన్‌చేసి అతడికి నేను క్యాంప్‌నుండి వచ్చినట్లు చెప్పి సాయంత్రం ఇంటికి రమ్మన్నాను.

సాయంత్రం అయిదున్నర తర్వాత వచ్చాడు జీవన్. చాలా డల్‌గా ఉన్నాడు. ముఖం బాగా పీక్కుపోయింది. లోలోపల చాలా బాధపడుతున్నట్లనిపించింది అతణ్ణి చూస్తుంటే.

ఇంట్లో ఏం మాట్లాడకుండా బయటకి వచ్చాక బార్‌కి తీసికెళ్లాను. డ్రింక్స్ ఆర్డరిచ్చాక "ఏమిటి? ఏం జరిగింది" అని ప్రశ్నించాను.

మౌనంగా పక్కనే ఉన్న కుండీ ఆకుల్ని పట్టుకుని చూస్తూండిపోయాడు కాని ఏం మాట్లాడలేదు. అతడి మౌనం నాలో అసహనాన్ని కలిగించింది.

రెండు... ఐదు... పది నిమిషాలు గడచిపోయాయి. జీవన్ పెదవి విప్పలేదు.

"చెప్పు జీవన్... ఏం జరిగింది"

నా స్వరంలో ధ్వనించిన విసుగుకి తల తిప్పిచూశాడు.

ఆ మసక వెలుతురులో సైతం అతడి కళ్లలో ప్రతిఫలిస్తున్న వేదన స్పష్టంగా కన్పించింది నాకు. అంత విసుగ్గా అడిగినందుకు సిగ్గనిపించి తలదించుకుని సిగరెట్ అంటించాను.

బేరర్ డ్రింక్ తెచ్చాడు. తన గ్లాసు తీసుకుని అందులోని బ్రాందీ అంతా ఒక్క గుటకలో తాగేసి గ్లాసు కిందపెట్టాడు.

ఒక్క నిమిషం కళ్లు మూసుకుని తెరచి చెప్పడం మొదలుపెట్టాడు.

"నువ్వు క్యాంప్‌కి వెళ్లిన రెండోరోజు సాయంత్రం నాగభూషణం వాళ్లమ్మతో పూర్ణిమ పెళ్లిగురించి మాట్లాడాడు. వాళ్ల మేనమామ కొడుకు చేసుకోవడానికి ఒప్పుకున్న విషయం చెప్పి రెండు మూడు రోజులలో వెళ్లి నిశ్చయంచేసుకుని ముహూర్తం పెట్టుకోవడానికి రమ్మని చెప్పి వస్తానన్నాడు. అది విని పూర్ణిమ ఇప్పట్లో పెళ్లిచేసుకోనని కొంతకాలం ఆగమని చెప్పింది. ఎన్ని రకాలుగా చెప్పినా నాగభూ

షణం వినక వీలయినంత త్వరలో చేసెయ్యాలి. బావ కూడా తొందరపడుతున్నాడని అన్నాడు. అతణ్ణి చేసుకోవడం తనకిష్టం లేదని చెప్పినా అంతకంటే మంచి సంబంధం మనకు దొరకదు. బయటకెళితే ఎంతో కట్నం ఇవ్వాలి. అదీగాక అంత తేలిగ్గా ఎవడూ దొరకడు అన్నాడు. ఆ రోజు నేను డ్యూటీ నుండి వచ్చేటప్పటికి పూర్ణిమ దిగులుగా ఉండడం చూసి ఎందుకో అనుకున్నాను. నాకీ విషయం తెలియదు. ఆ మరుసటి రోజు కూడా వాళ్ల బావని చేసుకోనని ఎంత చెప్పినా వాళ్లమ్మ, నాగభూషణం విన్పించుకోలేదు. ఆ రోజు మా గురించి నన్ను చెప్పమని అడిగింది. తొందరపడొద్దని నువ్వొచ్చాక చెబుతానులే అన్నాను. అప్పటికి ఊరుకుంది. కాని రెండు రోజుల తర్వాత నాగభూషణం వాళ్ల మేనమామ దగ్గరకు వెళ్లబోతున్నాడని తెలిసి ఇక తప్పక అతడొక్కడే ఉన్నప్పుడు చూసి నన్ను ప్రేమిస్తున్నానని, నన్నే చేసుకోవాలనుకుంటున్నానని చెప్పింది.

మొదట ఎంతో ఆశ్చర్యపోయి కొంతసేపు ఏం మాట్లాడలేదట. ఆ తర్వాత వాణ్ణి ప్రేమించడం ఏమిటి? నీకు బుద్ధుందా లేదా? ఒళ్లు దగ్గరుంచుకునే మాట్లాడుతున్నావా? పిచ్చిపిచ్చి వేషాలు వేస్తే కాళ్లు విరగ్గొడతాను. జాగ్రత్తగా ఉండని తిట్టాడట. పూర్ణిమ ఎంతో బతిమిలాడి చెప్పినా వినక కోపంతోవిసురుగా లేచిపోయాడట. నేనొచ్చేటప్పటికి వాడింట్లోలేడు. నేనురాగానే తప్పనిసరై అన్నయ్యతో చెప్పేసాను. లేకపోతే ముహూర్తం పెట్టుకొచ్చేసేటట్లున్నాడు. మన విషయం విన్నాక చాలా కోపంగా ఉన్నాడు. నువ్వూ చెప్పి ఒప్పించడానికి ప్రయత్నించు. నువ్వు చెబితే నైనా కోపం తగ్గి ఒప్పుకుంటాడేమోనని పూర్ణిమ ఒత్తిడి చేసింది.

తొందరపడుతున్నానేమో, సమయంకాదేమో, ఏమంటాడో, ఈ విషయం చివరకు ఎలా పరిణమిస్తుందో నన్పించినా పూర్ణిమ చూపులోని అభ్యర్థన గమనించి వాడికి తెలిసాక ఆగడం ఏమిటిలే అనుకుని నాగభూషణం భోజనం చేశాక బయటకు వెళ్దాం రమ్మన్నాను. మారు మాట్లాడకుండా వచ్చాడు.

నేను మొదటినుండీ వివరంగా చెప్పాను. ఆ ఒక్క విషయం తప్ప. అంతా విని కోపంగా నా మీద విరుచుకుపడ్డాడు. ఇష్టంవచ్చినట్లు మాట్లాడాడు. నన్ను పచ్చి బూతులు తిట్టాడు. వాడన్న మాటలు నానోటితో నేను చెప్పుకోలేనివి. నేనెంత ఓపికగా నచ్చచెప్పబోయినా వినక నా మీద చేయిచేసుకోబోయాడు. దానితో నాలో సహనం చచ్చిపోయి ఊరికే నోరు పారేసుకుంటూ మూర్ఖంగా ప్రవర్తించకు అయినా నేనేం చేశాను. నిన్ను, నీ చెల్లెల్ని మోసం చేయడంలేదే. పెళ్లి చేసుకుంటాననంటున్నాను. ఆ పెళ్లీ నిన్నే చేయమంటున్నాను. బతిమిలాడుతున్నాను. ప్రేమించుకున్నాం. ఒకరినొకరం కావాలనుకుంటున్నాం కాబట్టి అడిగాను. అది తప్పా అన్నాను. వాడు మరింత రెచ్చిపోయి ఏదేదో వాగాడు. ఎంత ప్రాధేయపడినా మా విషయం కనీసం ఆలోచించడానికి కూడా వాడొప్పుకోలేదు.

వెంటనే ఇంట్లోంచి వెళ్లిపో. అది చెప్పగానే మెడపట్టుకుని బయటకు గెంటేద్దామనుకున్నాను. ఇంట్లో అందరికి తెలుస్తుంది. ఎందుకు గొడవ అని వూరుకున్నాను. ఇంకొక్క క్షణం ఉన్నావా కాళ్లు విరగకొడతాను. పో బయటకు అని పిచ్చికూతలు కూసాడు.

ఇంటికి వచ్చాక తనే జీవన్ వేరే ఉంటాడట. ఇక్కడనుండి రోజూ అంత దూరం వెళ్లడం కష్టంగా ఉందట. అని వాళ్లమ్మకి చెప్పాడు. అదేమిటి బాబూ అనడిగిందావిడ.

ఇంతకాలం మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను ఇంకా ఎందుకండీ. మీ ఆరోగ్యం కూడా బాగుండడంలేదు. కంపెనీకి దగ్గర్లోనే ఒక గది దొరికింది. అన్ని విధాల సౌలభ్యంగా ఉంటుందని అది తీసుకుంటున్నానని చెప్పానావిడకి.

గత్యంతరంలేని స్థితిలో బయటకు వచ్చేసి ఈ మూడు రోజుల్నించి ఒక కొలీగ్ రూంలో ఉంటున్నాను. కరుణాకర్ ఒకటి రెండుసార్లు కనబడ్డాడు కాని నన్నేమీ అడగలేదు. నాగభూషణం కూడా అతడికేం చెప్పలేదనుకుంటా. నేనూ ఈ విషయాలేమీ చెప్పలేదు''

జీవన్ చెప్పిందంతా విని కథ పూర్తిగా అడ్డం తిరిగేలా ఉందే అనుకున్నాను నాలోనేను. అవసరమనుకుంటే చెప్పేసేయమని




పూర్ణియకు క్యాంప్‌కు వెళ్లేముందు సలహాఇచ్చి నేను, చెప్పివాళ్లు తొందరపడ్డారా అని కూడా అన్పించింది. నాగభూషణం అంత సీరియస్‌గా రియాక్ట్ అయ్యాడంటే ఇంకేం ఒప్పుకుంటాడు? నేనయినా అతడికి ఎలా చెప్పాలి? ఏం చేయాలి?

"ఇదే నా విషయంగా చెప్పినప్పుడు ఇచ్చిన సలహాలన్నీ ఏమైపోయాయి. నా విషయంగా భావించబట్టి అలా చెప్పాడా? అదే తనదాకా వచ్చేసరికి అసలురంగు బయటపెట్టుకున్నాడా? వీళ్లదేవన వీళ్లని పోనిచ్చేసి నాకూ ఏం తెలియనట్లు ఊరుకుంటే పోయేదేమో. ముందు ముందు వీళ్లు ఏ బాధలు పడకూడదనే ఆలోచనతోనేగా అతడికి చెప్పడం మంచిదని భావించాను..."

"ఇందులో నీ హస్తం కూడా ఉందని నిన్నూ తిట్టాడు" జీవన్ మాటలతో నా ఆలోచనలకు అంతరాయం కలిగింది.

"లేదు... తనే- పూసుకు పూసుకు తిరుగుతున్నారుగా. అది ఈ మధ్య వాడింటికి ఎక్కువగా వెళుతోంది. నువ్వూవెళుతూనే ఉంటావుగా. ఈ సంగతివాడికి తెలియకుండా ఉంటుందా. ఈమధ్య నాకేదో విన్పించాడు. అంతా నాటకమన్న మాట. రానీ వాడి సంగతి తేలుస్తానన్నాడు" చెప్పాడు జీవన్.

"ఊహూ"

"....."

"....."

"ఏం చేయాలో అర్థం కావడంలేదు. పిచ్చెక్కిపోతోంది" అన్నాడు జీవన్.

చేతిలో ఉన్న సిగరెట్ పూర్తిగా కాలిపోయి వేళ్లు చురుక్కుమనడంతో దాన్నవతల పారేసి మరో సిగరెట్ అంటించి గ్లాసులోని బ్రాందీ రెండు సిప్స్ చేసి అతణ్ణి చూశాను. అతడి మాటలు దేనికో ఉపోద్ఘాతమనిపించి నేనేం మాట్లాడలేదు.

"కాస్తంత బ్రతుకు తీపికోసం ఈ జీవితమంతా బిచ్చం అడుక్కోవడమౌతోంది. అంతా అన్నీ అందినట్టే అంది చేజారి పోతున్నాయి. కలలకు కన్నీళ్లు అడ్డుకోవడం మినహా చేయగలిగిందేం కనబడడం లేదు" తలకిందకు వంచుకుని రెండు కళ్ల అంచుల్ని చూపుడు వేలు, బొటనవేలుతో నొక్కుకుంటూ భారంగా నిట్టూరుస్తూ నిరాశగా అన్నాడు.

"అన్వేషించడం తప్ప ఏమైనా చేద్దామనుకుంటేగా నువ్వు"

"అంటే అర్థంకాక ప్రశ్నార్థకంగా చూశాడు.

'ప్రేమించడం కాక ఇంకేమైనా చేద్దామనుకుంటున్నావా?"

అతడి చూపుల్లో తొలగిపోని ప్రశ్నార్థకమే సమాధానమయింది.

"నీకు కోపం, బాధ కలగవచ్చేమో కాని నీవు ప్రేమించాలనుకోవడం తప్ప మరేం చేయడంలేదు"

"....."

ప్రేమించడం, ప్రేమను పొందాలనుకోవడం ఒక్కటే జీవితంకాదు. అది జీవితంలో ఒక భాగం. దాన్నందుకోగలిగితే అదొక ఆనందఘట్టం. అది లభించకపోతే, దూరమైతే బాధ సహజం. కాని దాని కోసమే వెంపర్లాడుతూ జీవితాన్ని ఉన్నతం చేసుకునే ప్రయత్నం చేయకపోవడం కావాలని నిస్ప్రాణతలోకి కూరుకుపోవడమే"

"నువ్వెప్పుడూ ఇంతే. నీతులు చెప్పడం నీకు అలవాటైపోతోంది"

"అలాగే అనుకో. కాని ఇవి నీతులుకావు. వాస్తవాలు. వాటిని గుర్తించి, అనుగుణంగా నడచుకుంటూ జీవితాన్ని అందిపుచ్చుకోవాలి. అందనివాటి కోసం అర్రులు చాస్తూ, ఎండమావుల వెంట పరిగెత్తుతూ నువ్వు చేసేది మాత్రం నేలవిడిచిన సామే"

నన్ను సాలోచనగా చూస్తూ "బహుశా అది నిజమేనేమో. జీవితానికి ద్వారాలు తెరిచే యవ్వనంలోని అనుభవాలు బలమైన ముద్ర వేసి మిగిలిన జీవితగమనాన్ని నిర్దేశిస్తాయి. అందులో నీకేం సందేహంలేదుగా..." నేనేమంటానోనని ఆగాడు. నేనేం మాట్లాడలేదు. దానితో తనే "నా విషయంలో అదే జరిగింది. నేను వద్దనుకున్న పెళ్లిచేదుఅనుభవం నా హృదయంమీద బలంగాపడింది. దానితో నాకు భౌతికావసరాల కంటే హృదయావసరాలు పెరిగాయి. వాటిని తీర్చుకోవాలనే తాపత్రయమే ఇదంతా. ఒకసారి ఆ అవసరాలు

తీరి నాలోనితపన చల్లారితే జీవితాన్ని అందిపు చ్చుకోగలనన్న నమ్మకం ఉంది. కాని నా ప్రయత్నాలకు ఎదురయ్యే అనుభవాలకు అవి గుండెల్లో గుచ్చుకుంటుంటే నిరాశా నిస్పృహలు తప్ప మరేం మిగలడంలేదు. వాటిలో పడిముందు కాలాన్ని పోగొట్టుకుంటున్నాను'' అన్నాడు.

''అది తెలిసీ వెంపర్లాడడం దేనికింకా''

''అదే నాలోని బలహీనత''

''అయితే నిరాశను సమాధి చేసుకుని ఎదురు దెబ్బల్ని తట్టుకుని ఎదురు తిరిగే తత్వం, స్థైర్యం అలవర్చుకో. అప్పుడు నీ దారిలోకి బ్రతుకు రావడానికి వీలుంటుంది'' అని గ్లాసులోని ద్రవం ఖాళీ చేసి బేరర్‌ని పిలిచి బిల్లు తెమ్మన్నాను

ఆ మరుసటిరోజే నాగభూషణంతో రెండు గంటలు మాట్లాడాను. అతడు ముందు అసలు నాతో మాట్లాడడానికే ఇష్టపడలేదు. ఎంతో ప్రయత్నంమీద ఒప్పించాను. తర్వాత జీవన్ నాకు తమ ప్రేమవిషయం చెప్పడం దగ్గర నుండి ఆ రోజువరకు జరిగిందీ, నాకు తెలిసిందీ- వాళ్ల శారీరక సంబధం తప్ప అంతా చెప్పాను. నేను వాళ్లని నిరుత్సాహపరచాలని ప్రయత్నించడం, వాళ్లు వినకపోవడం, దూరంగా ఉండమని నేను హెచ్చరించడం, నాగభూషణానికి నేనే చెప్పి ఒప్పిస్తాననడం, ఎవరికీ చెప్పకుండా వెళ్లిపోయే ఉద్దేశ్యం ఉన్న జీవన్ పూర్ణిమలను అది విరమించుకోమని చెప్పడం అంతా విపులంగా చెప్పాను.

చివరలో ''నీకున్నది ఒక్కగానొక్క చెల్లెలు. పూర్ణిమ అభీష్టానికి వ్యతిరేకంగా ఏదీ చేయనని అనేకసార్లన్నావు. తను మనస్ఫూర్తిగా ప్రేమించిన వ్యక్తితో పెళ్లి చేయడానికి అభ్యంతరమేమిటి? అందునా కులమతాల పట్టింపు లేదంటావు'' అన్నాను.

''ఆ ప్లాట్‌ఫారం లం... క్కి నా చెల్లెల్నివ్వడమా. అది జరగనిపని'' అన్నాడు నాగభూషణం కఠినంగా.

''కోపంలో అలా తిడుతున్నావు. శాంతంగా ఆలోచించు. ఇది నీ చెల్లెలి భవిష్యత్ విషయం''

''ఏమిటాలోచించేది. నా కంఠంలో ప్రాణం ఉండగా అలా జరగదు. జరగనివ్వను''

''నీవంతటి కఠిన నిర్ణయానికి రావడానికి కారణం''

''నీకు తెలియదా. వాడు పెళ్లాన్ని సుఖపెట్టలేనివాడు. వాడి పెళ్లాం నాకళ్లముందే 'సుఖపెట్టలేని మొగుడివి నువ్వూ ఒక మొగాడివేనా' అని ఛీకొట్టి వెళ్లిపోయింది. ఆ లుచ్చాలోఫర్‌గాడి వేషాలన్నీ నాకుతెలుసు. తిరుగుళ్లు తాగుళ్లుసరే. పెళ్లికాకముందే వాడు, ఇంకొకడు కలిసి గూడెందాన్నొకదాన్ని లేవదీసుకుపోయి అమ్మేసి వచ్చారు. అటువంటి దరిద్రుడికి నా చెల్లెల్నివ్వడమా? ఇచ్చినా దాని బంగారంతీసుకుని ఎక్కడో ఎప్పుడో దాన్నీ అమ్మేస్తాడు'' అమితావేశంతో అంటూ ఎన్నో తిట్టాడు.

అసభ్యకరమైన అతడి మాటలధోరణి నాకు చిరాకు కల్గించినా ఓపికగా నెమ్మదిగా జీవన్ ఒక అమ్మాయిని అమ్ముకున్నాడని తెలిసీ నీ దగ్గర ఎందుకుంచుకున్నావు. లోఫర్‌గాడని తెలిసీ చేరదీయడంతప్పుకాదా'' అనడిగాను.

''చిన్నప్పటినుండి స్నేహితుడు కాబట్టి వాడిలో మార్పు తెచ్చి మెరుగు పరుద్దామని చేరదీసాను. మంచితనంగా ఉంటాడని మారతాడని అనుకున్నాను. కానీ వెధవలం... నాకే గొయ్యి తవ్వుతాడనుకోలేదు'' అన్నాడు సమర్థనగా. అందులో బలం లేదని అతడికీ తెలుసు.

''నాగభూషణం... నువ్వు చెప్పేదంతా అబద్ధమని నీకుతెలుసు. పూర్ణిమ అన్నీ తెలిసే అతణ్ని కోరింది. ఆమెకు తెలియనివేమైనా ఉంటే అవి జీవన్ చెప్పాడు. జీవన్ గురించి నీకేం తెలుసని నువ్వతణ్ణి ప్రేమించావు అని నేను పూర్ణిమను అడిగాను. జీవన్ అనుభవాలతో సహా అన్నీ చెప్పి తన నిర్ణయాన్నీ ఖండితంగా చెప్పింది'' అన్నాను.

''పచ్చి అబద్ధం. పూర్ణిమకు నేను చెప్పేంత వరకు ఏమీ తెలియదు'' అన్నాడు నాగభూషణం.

నేనతణ్ణి తీవ్రంగా చూశాను.

నాగభూషణం అందుకున్నాడు. ''అవును నేను చెప్పాకే పూర్ణిమకీ విషయాలు తెలిసాయి. అప్పటిదాకా వాడికి పెళ్లియిందని విడిపోయారని మాత్రమే తెలుసు. మిగతా విషయాలేవీ తెలియదు. అవీ, వాడి స్వభావం





గురించి చెప్పి పూర్ణిమనే ఆలోచించుకోమన్నాను. స్నేహితుడిలా విడమర్చి వివరంగా చెప్పానే కాని అన్నయ్యగా మాట్లాడలేదు. భయపెట్టలేదు. తనే ఆలోచించుకుని ఆ తర్వాత జీవన్‌ని చేసుకోనని చెప్పింది'' అన్నాడు.

అతడి మాటల్లో ఏమాత్రం నిజాయితీ లేదు. అవన్నీ అబద్ధాలని స్పష్టంగానే తెలుస్తున్నాయి.

ఆఖరి ప్రయత్నంగా ఈ విషయం చెబితేనయినా ఒప్పుకుంటాడేమోనని పూర్ణిమ, జీవన్‌ల శారీరక సంబంధం గురించి చెప్పాను. అమితాశ్చర్యంగా చూశాడు నన్ను క్షణంపాటు. అంతలోనే తన ఆశ్చర్యాన్ని కప్పెట్టుకుంటూ నేనది పసికట్టలేదనుకుని.

''జరిగిందొకటైతే నువ్వు మరొకటి చెబుతున్నావు. మేమెవరం ఇంట్లో లేనప్పుడు వాడు పూర్ణిమను లొంగదీసుకోబోయాడట. అదే సమయానికి బజారుకెళ్లిన అమ్మ తిరిగి రావడంతో తప్పించుకున్నానని పూర్ణిమే చెప్పింది నాతో'' అన్నాడు.

అతణ్ణి తేరిపారా చూశాను. ఎంత సులభంగా కట్టుకథలల్లి అబద్ధాలు చెప్పేస్తున్నాడు!

ఇక ఈ మూర్ఖుడికి నచ్చ చెప్పలేం అన్పించింది. ఎన్ని రకాలుగా చెప్పినా వినని అతడి ధోరణి కోపాన్ని తెప్పించినా నేనది వ్యక్తపరచడం అసమంజసమని ఊరుకున్నాను.

''జీవన్‌ని చేసుకోనని పూర్ణిమ స్పష్టంగా చెప్పిందా?'' అనడిగాను.

''అవును'' అన్నాడు.

''నేను పూర్ణిమతో మాట్లాడుతాను''

''కుదరదు. ఇకమీదట నువ్వు మా ఇంటికి రావడానికి వీలులేదు. పూర్ణిమతోమాట్లాడడానికీ వీలులేదు. ఈ వ్యవహారంలో నీ పాత్ర చాలా ఉంది''

''అది నీ భ్రమ మాత్రమే. జరిగిందేమిటో వాళ్లు చెప్పారు. నేనూ చెప్పాను. అయినా మూర్ఖంగా మాట్లాడుతున్నావు. నువ్వు చెప్తున్నట్లే మీ ఇంటికి రాను. కాని ఒక్కసారి మాత్రం పూర్ణిమతో మాట్లాడతాను. జీవన్‌ని చేసుకోనని పూర్ణిమనాతో చెబితే మళ్లీ మీ ఇంటి గుమ్మంతొక్కను''

''అది చెప్పేదేమిటి? నేను చెబుతున్నాను'' అన్నాడు నాగభూషణం తన నిర్ణయమే ఆఖరిదైనట్లు.

''నాగభూషణం... నీవు చెప్పినవన్నీ అబద్ధాలని నీకూ నాకూ తెలుసు. నువ్వు చెప్పినవే నిజమైతే పూర్ణిమతో నేను మాట్లడడానికి నీకభ్యంతరందేనికి? జీవన్‌ని చేసుకోనని పూర్ణిమ స్వయంగా చెబితేకాని నేను నమ్మను'' అన్నాను.

''నీ నమ్మకంతో మాకు పనేంటి''

''నీకు లేకపోవచ్చు. కాని జీవన్ కావిషయం చెప్పి అతడిలో నాటుకున్న భావాల్ని తొలగించడానికి ప్రయత్నించవచ్చు. లేకపోతే రేపు మొండిపట్టుదలతో వాళ్లేదైనా చేస్తే...'' అని ఆగిపోయాను.

''ఏంటి వాళ్లు చేసేది. అలం... ఏమైనా చేస్తే చంపెయ్యనూ'' ఆవేశంగా అన్నాడు.

''నీతులు, ఆదర్శాలు వల్లించే నీవు ఇలా మాట్లాడ్డం తగదు. నెమ్మదిగా హృదయంతో ఆలోచించు'' అన్నాను.

నా మాటలకు వళ్లుమండిందేమో ''అసలీ విషయం ఇంతగా పట్టించుకుంటున్నావు. నీకేమిటి సంబంధం'' అన్నాడు కోపంగా గద్దిస్తున్నట్లు.

''నువ్వూ, కరుణాకర్ నాకు స్నేహితులే. పూర్ణిమ అభిమానంగా అన్నయ్యా అని పిలుచుకుని అన్నీ చెప్పుకుంది. మీ అందరితో ప్రగాఢపరిచయం ఉన్నందుకు పట్టించుకుంటున్నానుతప్ప ఇందులో నాకేం పర్సనల్ ఇంట్రస్టూ లేదు. లాభమూ లేదు'' అన్నాను సమాధానంగా.

''దాని సంగతి మేం చూసుకోగలం. నువ్వేం జోక్యం చేసుకోనవసరంలేదు'' నిరసన ధ్వనింపచేస్తూ అన్నాడు.

''జోక్యం చేసుకోవాలన్న సరదా నాకు లేదు. వాళ్లిద్దరూ నన్ను ఆప్తుడిగా భావించి చెప్పుకున్నారు. నీతోనూ నాకు చనువుంది కనుక ఈ విషయాలు మాట్లాడుతున్నాను. ఒక్క విషయం మరచిపోకు. జీవన్‌ని ఆకర్షించి తనవైపు తిప్పుకుంది పూర్ణిమే. అందుకే అత

ణ్ణి చేసుకోనని పూర్ణిమ స్వయంగా చెబితేనే నాకు నమ్మకం. పూర్ణిమ నిర్ణయం ఇదీ అని చెపితే నా మాటలు జీవన్ నమ్ముతాడు కనుక ఈ వ్యవహారానికి ఫుల్‌స్టాప్ పడుతుంది. అది మీకూ మంచిది. నీ ఇష్టం మరి. ఆలోచించుకో'' అన్నాను.

ఓ పదినిమిషాలు ఆలోచించి ''సరే'' అన్నాడు - అయిష్టంగానే.

ఇద్దరం వాళ్లింటికి వెళ్లాం. పూర్ణిమను మేడ మీదకి రమ్మని పిలిచాడు నాగభూషణం.

పూర్ణిమ వచ్చి నన్ను చూసి తలదించేసుకుంది. నాగభూషణాన్ని పక్కకు వెళ్లమని నేను చెప్పినా రెండడుగులు అవతలకి వేసి అక్కడే నుంచున్నాడు.

నేను పూర్ణిమను చూస్తూ నుంచున్నాను, తల పైకెత్తుతుందేమో ఆమె కళ్లలోని భావం స్పష్టంగా పరికించి తెలుసుకోవచ్చన్నట్లు.

నాగభూషణం అసహనంగా కదలడం చూసి అక్కడనుండి కదిలేలా లేని అతణ్ణి మనసులోనే తిట్టుకుని పూర్ణిమని నెమ్మదిగా అడిగాను ''ఏమ్మా... జీవన్‌ని చేసుకోవడం నీకు ఇష్టంలేదా?'' అని.

పూర్ణిమ తలపైకెత్తి నన్ను చూడకుండా

వాళ్లన్నయ్యని చూసి తల దించేసుకుంది. అది చాలు, నాకు విషయం అర్థమైపోయింది. అయినా,

"భయంలేదు పూర్ణిమా, మీ అన్నయ్య తను చెప్పేవరకు నీకు జీవన్ గురించి ఏమీ తెలియదని, తను చెప్పింది విని మంచీ, చెడూ ఆలోచించుకుని జీవన్‌ని చేసుకోనని చెప్పి మీ బావను చేసుకోవడానికి నీ అంతట నీవే ఒప్పుకున్నావని అంటున్నాడు. నిజమేనా? జీవన్‌ని ప్రేమించడంలేదా? అతణ్ణి చేసుకోవా? లేక మీ అన్నయ్యకు భయపడి అలా చెప్పావా?" అన్నాను.

పూర్ణిమ మౌనం వీడలేదు.

"చెప్పు పూర్ణిమా. మీ అన్నయ్య నీకేది ఇష్టమైతే అలా చేస్తానంటున్నాడు. జీవన్‌ని చేసుకుంటావా, చేసుకోవా?" అని ప్రశ్నించాను.

పూర్ణిమ ఇంకా మాట్లాడకపోవడంతో నాగభూషణం "చెప్పు" అన్నాడు. ఎంత సౌమ్యంగా ఆమాట అందామని అతడు ప్రయత్నించినా అందులో గద్దింపు స్పష్టంగా ధ్వనించింది.

పూర్ణిమ తల పైకెత్తి నాగభూషణాన్నే చూస్తూ - "చేసుకోనన్నయ్యా" నాకు సమాధానమిచ్చింది.

"మీ బావనే చేసుకుంటావా?" అనడిగితే అవునన్నట్లు తలూపింది.

నాగభూషణం మా పక్కనే ఉండడంతో పూర్ణిమ భయపడి అబద్ధం చెపుతోందని తెలుసు నాకు. బాగా భయపెట్టేసాడని మనసులో అనుకున్నాను.

"సరేనమ్మా... ఇప్పటివరకు నీవాడింది నాటకమే అయితే ఇకమీదట ఎప్పుడూ జీవితాలతో ఆడుకోకు. నీకిష్టంలేనప్పుడు పరువుగల మీ జోలికి జీవన్ రాడు" అని వడివడిగా అక్కడినుండి వచ్చేసాను.

నాగభూషణం వినాలని, వింటాడనే అలా అన్నాను.

నేను వచ్చేస్తుంటే నాగభూషణం ఆపి జీవన్, పూర్ణిమల ప్రేమ విషయం వాళ్లమ్మకు, కరుణాకర్‌కు చెప్పవద్దని కోరి నాచేత ప్రామిస్ చేయించుకున్నాడు.

"నీ చెల్లెలే చేసుకోనన్నప్పుడు వాళ్లకు చెప్పాల్సిన అవసరం నాకేంటి" అని వచ్చేసాను.

★ ★ ★

మనిషిని అర్థంచేసుకోవడం తేలికే. అతడి తత్వాన్ని మార్చడంమాత్రం బహుకష్టం. కరుణాకర్‌ని సంపూర్ణంగా అర్థంచేసుకున్న నేను అతడి దృక్పథాన్ని, పద్ధతుల్ని మార్చాలని ఎంతగానో ప్రయత్నించి విఫలుడనై ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాను గతంలో. ఇప్పుడు నాగభూషణాన్ని నిజాలను నిజాలుగా గ్రహించి నవ్యంగా ఆలోచించగల స్థితికి కూడా తీసుకురాలేకపోయాను. అతణ్ణి అజ్ఞానంనుండి బయటకు లాగాలని నేనెంత ప్రయత్నించినా మూర్ఖంగా దాంట్లోంచి బయటపడకపోగా మిగిలిన వాళ్లని దాంట్లోకి లాగుతున్నాడు.

జరిగినదంతా జీవన్‌కి చెప్పాను. మౌనంగా విన్నాడు. విన్నా ఏం మాట్లాడలేదు.

"జీవన్! నీ భార్య అన్నట్లుగా నాగభూషణం చెప్పిన మాటలు నిజమా" అని ప్రశ్నించాను.

"వాడిని ఏదో పశుత్వం ఆవరించి అలా మాట్లాడుతున్నాడు. వాడు చెప్పింది అబద్ధమో, నిజమో నీకు తెలియదా. మా శారీరక సంబంధం గురించి పూర్ణిమ అంగీకరిస్తూ మాట్లాడాక కూడా నీవిలా అడగగలుగుతున్నావా?"

నిజమే. సుఖపెట్టడమంటే శారీరకంగా సుఖపెట్టడమే కాదు. జీవనసౌఖ్యం కూడా. అది తెలిసినా నాగభూషణం మాటలకి అతడి ప్రతిస్పందన ఎలా ఉంటుందోతెలుసుకుందామనే నేనిలా అడుగుతున్నాను.

"మరి నీవు ఒక అమ్మాయిని లేవదీసుకుపోయి అమ్ముకున్న సంగతి?"

తూటాదెబ్బకి గిలగిలలాడుతున్న పక్షిలా చూశాడా ప్రశ్నకు. "నమ్ముతున్నావా?" ఆశ్చర్యం, ఆవేదన అతడి స్వరంలో.

నేనేం మాట్లాడక అతణ్ణే చూస్తున్నాను.

"చూడూ... నాకు జన్మనిచ్చిన తల్లిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను. నేనెవర్నీ అమ్ముకోలేదు. పెళ్లి గొడవ తర్వాత సుగుణతో





తప్పించి పెళ్లికి ముందుగాని, ఆ తర్వాతగాని నేనెవరితోనూ సంబంధం పెంచుకోలేదు. నీద గ్గర దాచిందేమీ లేదు. అప్పుడవనుకున్నాను కాబట్టే నా తప్పులతోసహా అన్నీ నీకు చెప్పుకు న్నాను. పూర్ణిమను ప్రేమించినందుకు వాడింత ఘోరంగా నామీద నిందలేస్తే నువ్వూ అదే అడుగుతావా?''

ఆమాటలంటుంటే జీవన్ కళ్లలో సుడులు తిరిగిన కన్నీటిబొట్లు టపటప రాలిపడ్డాయి. గొంతులో అమితమైన బాధ.

జీవన్ చేయి సున్నితంగా నొక్కి వదిలి- ''ఛఛ... ఊరుకో జీవన్. అంతగా అప్‌సెట్ కాకు. నేనది నమ్ముతానో, లేదో నీకు మాత్రం తెలియదా'' అని క్షణమాగి-

''మనిషి జీవితానికి ఆలోచనే ముఖ్యమైన ఆలంబన. పూర్ణిమ విషయంలో మొదట్లో నీవు ఆలోచన లేకుండా బంధాన్ని పెంచుకున్నావు. దానివల్ల కలిగే అనర్థాల గురించి మీకు తెలి సేలా చెప్పాలని చూసినా మీరది వినక, పట్టించుకోకపోవడంతో మీ పట్టుదల, మీలోని ప్రేమభావనలో గాఢత తెలుసుకొన్నాక నెమ్మ దిగా నాగభూషణాన్ని ఒప్పించి మిత్రుడిగా మీకే ఇబ్బందీ కలగకుండా చూడాలనుకున్నా ను. హృదయంతో బ్రతుకుతూ ఎదుటి హృద యాలలోకి తొంగిచూసే అలవాటులో సహ జంగా మిమ్మల్ని చదివి మనస్ఫూర్తిగా మీతో అడుగేయడానికి నిశ్చయించుకున్నాను. అలా గే చేసాను. అది వికటించి మీ బంధానికి అంతరాయం కలిగింది. మళ్లీ దీనితో నిన్ను నీవు నాశనంచేసుకోవద్దు.

''నీ చేతులతో నీరుపోసి ఆమె చల్లిన విత్తనాన్ని మొక్కగా మార్చి మొగ్గతొడిగే స్థితికి తెచ్చావు. సహజంగా విత్తనంలో జీవం వుంటుంది. అది మొలకెత్తడానికి ఎదురుచూ స్తుంటుంది. ఆ జీవాన్ని ప్రేరేపించి ఊపిరి ఊది ఆశతో, ఆర్తితో ఆలోచనలు లేక పరిణా మాలు తెలుసుకోక చేసిన పనికి ఫలితంగా మొగ్గ తొడిగిన ఆ జీవాన్ని కొన్ని చేతులు తుంచేసాయి''

''నాగభూషణం చేతులు ముడుచుకుని కూర్చోడు. చాలా కట్టుదిట్టంచేసి పూర్ణిమకు త్వరలో పెళ్లి చేసేస్తాడు. అందువల్ల ఈ ప్రేమ సంగతి ఇంతటితో మరచిపో. గతంలో జరిగిన ఘటనల పరంపరలో ఇదీ ఒకటిగా మింగేసి మామూలుగా ఉండడానికి ప్రయత్నించు'' అన్నాను.

చాలాసేపు మౌనంగా ఉన్న జీవన్- ''కే వలం ఐదునిమిషాలు పూర్ణిమ మాట్లాడే అవ కాశం కల్పించగలవా?'' అనడిగాడు.

''నేనా, ఇక నావల్లేమవుతుంది. నన్నూ ఇంటికి రావద్దు. పూర్ణిమతో మాట్లాడవద్దన్నాడు నాగభూషణం. ఇంకా ఆ ఇంటికి నేనెందుకు వెళతాను'' అన్నాను.

''అలా అనకు... మాకోసం ఎలాగైనా నీవే ప్రయత్నించాలి''

''ఎందుకు? ఏంమాట్లాడాలనుకుంటు న్నావు?''

''పూర్ణిమ నన్నెందుకు చేసుకోనందో కనుక్కో వాలి''

''పిచ్చివాడా, తెలుస్తూనేఉందిగా. నాగభూ షణం నీమీద లేనిపోనివి బలమైనరీతిలో చెప్పి మార్చినాఉండవచ్చు. లేదా ఏదో ఒకర కంగా భయపెట్టి లొంగదీసుకుని ఉండవ చ్చు''

''వాడు నాగురించేం చెప్పినా పూర్ణిమ నమ్మదు. నాకా నమ్మకం ఉంది. కాకపోతే నీవన్నట్లు భయపెట్టే లొంగదీసుకుని ఉంటా డు. ఆమెలోని భయాన్ని పొగొట్టి ఆమె నాతో అడుగు వేసేలా చేయడానికి ఆ ఐదునిమిషా లు చాలు'' అన్నాడు జీవన్.

''అంటే, ఇంకా ముందుకెళదామనే నిశ్చ యించుకుంటున్నావా? ఆ తర్వాతి పరిణామా లగురించి కూడా ఆలోచించు'' అన్నాను.

''ఏమిటవి?'' అనడిగాడు.

''నాగభూషణం ఆవేశంతో దేనికైనా తెగించ వచ్చు''

''చంపుతాడా?''

''ఏదైనా చేయవచ్చు మనిషిలోకి రాక్షస త్వం ప్రవేశిస్తే''

''ఏమైనా కానీ... పూర్ణిమ నన్ను కోరి నాతో అడుగువేసినప్పుడు ఏం అవాంతరం వచ్చినా ప్రతిఘటించగలను'' స్థిరంగా, మొండిగా అన్నాడు.



''జీవన్... మొండితనంతో నీవు సాధించేదేమీ ఉండదని తెలుసుకో. మీరింకా విడాకులు తీసుకోనేలేదు'' జీవన్ విడాకులకేసు ఇంకా కోర్టులోనే అపరిష్కృతంగా ఉన్న విషయాన్ని సూచిస్తూ అన్నాను.

''ఫర్వాలేదు... మళ్లీ మేం కలియడమనేది కల్ల. నేనూ, పూర్ణిమ పెళ్లి చేసుకున్నామని తెలిస్తే అదీ సంతోషిస్తుంది దాని మార్గానికి అడ్డు తొలగిపోయినందుకు'' అన్నాడు.

జీవన్‌వైపు ఆలోచనగా చూపు సారిస్తూ- ''సరే... మీరు వెళ్లిపోయి పెళ్లి చేసుకుంటారు. ఆ తర్వాత బ్రతుకుతెరువు మాటేమిటి?'' అనడిగాను.

''నేను కష్టపడడానికి వెనుకాడను. నా చేతుల్లో ఇంకా ఎంతో శక్తి ఉంది. మనసులో నీవు నేర్పిన ధైర్యం ఉంది. ఏ కూలో, నాలో చేసుకుని పూర్ణిమను పోషించుకోగలను. విశాలమైన ఈ దేశంలో ఏమూలకెళ్లినా ఏదో ఒక పని దొరక్కపోదు'' అని బదులిచ్చాడు.

అంత ధీమాగా మాట్లాడేవాడికి ఏంచెప్పగలను. మెల్లగా అతడి భుజంతట్టి ''ప్రయత్నిస్తాను'' అని చెప్పి వచ్చేశాను.



నాగభూషణం నాతో ముభావంగా ఉంటున్నా, కరుణాకర్‌కి ఈ సంగతులేవీ తెలియనందున బాగానే ఉంటున్నాడు.

నాలుగురోజుల తర్వాత నాగభూషణం ఊరెళ్లాడని కరుణాకర్ చెప్పడంతో వాళ్లింటికి వెళ్లాను. ఆ సమయంలో కరుణాకర్ షెడ్లో ఉంటాడని తెలుసు. అయినా, నేను వెళ్లేటప్పటికి బట్టలు ఆరవేస్తూ కనిపించిన వాళ్లమ్మను చూసి- ''కరుణాకర్ ఉన్నాడండీ'' అనడిగాను.

ఆవిడ నన్ను చూసి ముభావంగా- ''లేదు'' అంది.

ఆవిడ ముభావాన్ని పట్టించుకోకుండా ''పూర్ణిమా'' అని కేకేశాడు.

జడ అల్లుకుంటున్న పూర్ణిమ అలాగే బయటకు వచ్చింది. ముఖం కొంచెం పీక్కుపోయింది. అసలే స్తబ్దంగా కన్పించే ఆ కళ్లలో మరింత స్తబ్దత.

వాళ్లమ్మ ''దాంతో ఏమిటిపని'' అంటున్నా విన్పించుకోక- ''పూర్ణిమా బుక్స్ ఏమైనా తెచ్చావా'' అన్నాను. అమ్మకు లైబ్రరీనుండి పుస్తకాలు తెచ్చిపెడుతుంటుంది కనక వాళ్లమ్మ మరోలా భావించకుండా అలా అడిగాను. నాగభూషణం ఏదో కట్టడి చేశాడనిపించింది ఆవిడ ధోరణి. బహుశా నామీద చెప్పి రానీయవద్దని ఉంటాడనుకున్నాను మనసులో.

''కూర్చో అన్నయ్యా'' అని పూర్ణిమ లోపలికి వెళ్లింది. నన్ను చూస్తూ ఏదో గొణుక్కుంటూ వెళ్లింది వాళ్లమ్మ.

లోపల పూర్ణిమను కోప్పడుతోందేమో ఆమె స్వరం కొంచెం కోపంగా వినిపించింది.

అది పట్టించుకోనట్లు పూర్ణిమ నాకు షర్బత్ తెచ్చిచ్చింది. తాగిన గ్లాసు పూర్ణిమ చేతికిచ్చాను.

వాళ్లమ్మ మళ్లీ బయటకు వచ్చింది.

''నాగభూషణం ఎప్పుడొస్తాడు'' ఎవరినీ ఉద్దేశించినట్లుగాకాక అడిగాను.

''దేనికి'' పూర్ణిమ వాళ్లమ్మ అడిగింది.

''లారీ మా కంపెనీలో కాని, ఇంకెక్కడైనా కాని కాంట్రాక్టుకు పెట్టడం గురించి కనుక్కోమన్నాడా మధ్య. దాని గురించి మాట్లాడాలి'' అని చెప్పాను.

మూడు నాలుగురోజులు పడుతుంది వాడు రావడానికి'' అని చెప్పి లోపలికి వెళుతూ- ''ఇటురావే నువ్వు'' అని కూతుర్ని పిలిచింది.

''ఏమిటి'' విసుగ్గా అడిగింది పూర్ణిమ.

''పొయ్యిమీద పాలుపెట్టాను. పొంగొస్తాయి. చూడు'' అంది వాళ్లమ్మ.

పూర్ణిమ లోపలికెళుతుంటే ''పుస్తకాలియ్యమ్మా'' అన్నాను.





రెండు నిమిషాల తర్వాత పుస్తకాలు తెచ్చిచ్చిన పూర్ణిమ కళ్లలో సుడులు తిరిగే కన్నీళ్లు. వాటిని పంటితో కిందిపెదవి నొక్కిపెట్టి బలవంతంగా ఆపుకుంటోంది.

వద్దన్నట్లు కళ్లతోనే చెప్పాను.

ఈ రెండు నిమిషాల్లోనే వాళ్లమ్మ మరో రెండు మూడుసార్లు అసహనంగా మా ముందునుండి అటూ ఇటూ తిరిగింది.

పూర్ణిమ తలపక్కకు తిప్పుకుని కంట్లో నలకపడుతుంటే నులుముకుంటున్నట్లు కళ్లు తుడుచుకుంది. మళ్లీ నావైపు తిరిగి పుస్తకాలు చూడమన్నట్లు సైగచేసింది.

ఆమె భావాన్ని గ్రహించినట్లుగా కదలీకదలనట్లు తలూపి, ఏం నవలలో అన్నట్లు చూస్తూ ఆ పుస్తకాల పేజీలు తిప్పాను. వాటి మధ్యలో పూర్ణిమ రాసిన కొన్ని కాగితాలు కనిపించాయి.

''పాలు చూడమని నేను చెప్తూనే ఉన్నానుగదే ముదనష్టపుదానా. అన్నీ పొంగిపోయాయి'' కోపంతో వాళ్లమ్మ పెట్టిన కేక లోపలినుండి.

''వెళతాను పూర్ణిమా. నాగభూషణం రాగానే లారీ కాంట్రాక్టు గురించి కనుక్కున్నానని, రాగానే కలవమని చెప్పు'' అన్నాను- వాళ్లమ్మకు కూడా విన్పించేంత గట్టిగా.

సరే అన్నట్లు తలూపి నన్ను చూసిన పూర్ణిమ చూపులో ఏదో అభ్యర్థన. అర్థమైందన్నట్లు తలూపివచ్చేశాను.

ఓ పదడుగులువేసి వెనుదిరిగి చూసిన నాకు పూర్ణిమ తల్లి ఆమె తలమీద మొట్టడం, పూర్ణిమ ఆమె చేతిని విసురుగా తోసేయడం కన్పించింది.

నాలోనుంచి నిట్టూర్పు తన్నుకువచ్చింది.

రోడ్డుమీదకు వచ్చాక దగ్గర్లో ఉన్న హోటలుకెళ్లి పూర్ణిమ రాసి నవలల్లో పెట్టిన కాగితాలు తీశాను.

''అన్నయ్యా. నువ్వు తప్పక వస్తావని తెలిసే ఇది రాస్తున్నాను. మొన్న నువ్వొచ్చిన జీవన్‌ని చేసుకోవా అని అడిగినప్పుడు ఏం మాట్లాడాలో, ఏం చెప్పాలో తెలియలేదు. నా నోరు నొక్కేశారు. నా నాలుక తెగ్గోసేశారు. నీ సలహాపై ఇంట్లో అన్నయ్యకు చెబితే మిగిలిందేమిటి? జీవన్ నాకు దూరమవడం. నేనీ ఇంట్లో ఖైదవ్వడం. నా మొహాన నీకు చావుకళ కన్పించలేదా? జీవితాలతో ఆడుకోకు అన్నావు. నేనలాంటిదాన్నా అన్నయ్యా. నువ్వు నన్ను నమ్మడంలేదా. జీవన్ వెళుతూ- ''వెళ్లొస్తాను పూర్ణిమా'' అన్నట్లు చూసిన చూపుతోటే నా ప్రాణాలు కడతేరిపోయాయి. మిగిలింది ఈ జీవచ్ఛవం మాత్రమే.

అన్నయ్యా... నేను చేసిన తప్పేంటి? ఇన్నాళ్లూ బతికిన ఈ నరకంనుండి బయటపడి కోరుకున్న వ్యక్తితో కలిసి నాదైన ప్రేమలోకాన్ని నిర్మించుకుని మౌనంగా అందులో గడిపేద్దామనుకున్నాను. వీళ్లందరిలా నైతికపతనం చెందక, చరిత్రహీనుల్లా మిగలక, చరిత్ర సృష్టించకపోయినా నాదైన జీవితాన్ని పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకుని కాలంలో ఒదిగిపోదామనుకున్నాను. అదే నా నేరమైపోయింది వీళ్ల దృష్టిలో.

జీవితంనుండి ఎప్పుడూ పారిపోదామనుకునేదాన్ని. పారిపోవడం అసమర్థుల లక్షణమనుకునేదాన్ని. కాని ఆ అసమర్థత ఇప్పుడు నన్నావరించి నేను పారిపోయేలా చేస్తోంది. బావను చేసుకుంటానని ఈ నాలుగురోజులు వీళ్లను నమ్మించడమే నా కర్తవ్యం చేసుకున్నాను. అమ్మఒడి లాలింపు, నాన్న ప్రేమ, అన్నయ్యల ఆప్యాయత ఏదీ లభించక, అందరున్నా ప్రేమరాహిత్యంలో మగ్గిన నేనింకా ఒంటరిలో నలిగిపోలేను. జీవన్ లేని జీవితాన్ని ఊహించుకోలేను. తప్పో, ఒప్పో. అంతటి మానసిక బంధాన్ని పెంచుకున్నాను. అది ఆవేశంనుంచి కాక ఆలోచననుండి ఎదిగిందని కూడా నీకు తెలుసు. అందుకే జీవన్‌తో కాక నా జీవితాన్ని వేరొకరితో పంచుకోలేను. ఇది ఉద్రేకం, ఆవేశం అనుకుంటున్నావేమో. అయినా నేనొక నిర్ణయానికి వచ్చేశాను.

ఎలాగూ వీళ్లు నన్ను,జీవన్‌ని కలవనివ్వరు. మా విషయం తెలిసినప్పటినుండి పెద్దన్నయ్య మాటలతో చిత్రవధ చేస్తున్నాడు. ఒకటి రెండుసార్లు చిన్న విషయాలకు కూడా చేయి చేసుకున్నాడు. 'నీవు చచ్చినాసరే కాని జీవన్‌ని చేసుకోలేవు. బావని చేసుకోనని మొండికేశావో ఇంట్లో మూడు శవాలు లేస్తాయి. నీ కోసం మేమందరం చావలేం. నీవు ఛస్తే మేమైనా

సుఖపడతాం'' అన్నాడు. అంతగా నా చావు కోరుకుంటున్నప్పుడు వాళ్ల సుఖంకోసం నేను పోవడం త్యాగమేగా. అదీ గొప్పేగా.

ప్రస్తుతం ఈ ఇంట్లో నా పరిస్థితి అదన్న య్యా. ఒక్కసారి జీవన్‌తో మాట్లాడాలని పిస్తోంది. అతడి ఒళ్లో కళ్ళు మూసుకుని ప్రశాంతంగా పడుకోవాలని ఉంది. అదెలాగూ తీరదు. కనీసం ఓ అయిదు నిమిషాలైనా అతడితో మాట్లాడే అవకాశం కల్పించగలవా? నాలో ఉడిగిపోతున్న శక్తిని తిరిగి పుంజుకోవడా నికా క్షణాలు దోహదం చేస్తాయేమోననే ఆశ. అంతే. అంతకుమించి మరేమీలేదు.

చేజారిన పరిస్థితిని మళ్లీ మన చేతుల్లోకి తీసుకుని దానికి సరైనమార్గం చూపించడం ఒక జీవితానికి చేసిన మేలవుతుందికదూ. నా పిచ్చికోరిక కాని అదెలా జరుగుతుంది సరే, ఇహ ఉంటా''నని రాసింది.

ఎంత గాఢమైన కోరిక వున్నా మూర్ఖులమ ధ్య నలిగిపోతున్న అబలత్వం స్పష్టంగా కని పించిందాలేఖలో.

పూర్ణిమ రాసిన చివరి వాక్యాలు మళ్లీ మళ్లీ చదివాను. వాటిలో ఏదో హెచ్చరిక, అభ్యర్థన, ఆత్మనిండిన కళ్లు ఆశగా, ఆర్తిగా అక్షరాలలో నుండి నావైపు చూస్తున్నట్లునిపించింది.

ఆ సాయంత్రం నన్ను కలవడానికి వచ్చిన జీవన్‌కి పూర్ణిమ రాసిన ఉత్తరం చూపించాను. అది చదివి ఆవేశంగా పళ్లు పటపట కొరికాడు.

ఆ వెనువెంటనే సన్నగా కదలాడే బాధారేఖ లోలోన.

''పూర్ణిమను కలుసుకుంటావా?'' జీవన్‌ని అడిగాను.

''ఎలా'' అన్నాడతను.

''మధ్యాహ్నసమయంలో కరుణాకర్ ఇంట్లో ఉండడు. నాగభూషణం ఇంకా రెండురోజుల వరకు రాడు. వాళ్లమ్మ ఇంట్లో ఏదైనాపనిలో ఉన్నప్పుడు పూర్ణిమని కలవడానికి ప్రయ త్నించు. అంతకంటే మరో మార్గంలేదు'' అన్నాడు.

జీవన్ కన్నుల్లో మెరుపు. అలాగే అన్నట్లు తలూపాడు.

''పూర్ణిమ నీతో రావడానికి సిద్ధపడితే ఏంచే స్తావ్''

''తీసికెళతాను''

''ఎక్కడికి?''

''ఏమో చెప్పలేను. ఎక్కడికెళ్లినా నీకు తెలి యజేస్తాను''

''ఏమిటీ అదేదో ఇవ్వాళే జరిగిపోయినట్లు చెబుతున్నావ్''

''ఇవ్వాళ కాకపోతే రేపు- పూర్ణిమ ఇష్టప డాలే కాని'' అన్నాడు.

''అదిసరే...'' అంటున్న నన్ను మధ్యలోనే కట్‌చేసి- ''నువ్వు చెప్పేది తెలుసు. ముందు పరిణామాలు ఆలోచించమని. ఇదివరకు వాటి గురించి ఆలోచించి చేసుకున్న నిర్ణయమే ఇది. కొత్తది కాదు. మళ్లీ మళ్లీ ఆలోచించడం అనవసరం. అంతా, అన్నీ సవ్యంగా జరుగుతా యనుకోవడమే. ఈ మాత్రం తెగింపు లేకపోతే ఒకరికొకరం దూరమైపోతాం. ఈసారి అలా జరగడం నేను భరించలేను. పూర్ణిమతో కలిసి ఎంత బాధనైనా, కష్టాన్నయినా సహిస్తాను. ఆ ఇంట్లో నరకంనుండి పూర్ణిమను తప్పించడం ముఖ్యం'' అన్నాడు.

''ఆ ధైర్యముంటే మంచిదే. అయినా మరో సారి మిమ్మల్ని మీరు సమీక్షించుకొని అడుగు ముందుకువేయండి. అనాలోచితంగా వేసే అడుగును వెనక్కి తీసుకోలేరు. పూర్ణిమను కలుసుకున్నప్పుడు నా మాటలుగా ఇవి చెప్పు. మీ ఇద్దరి నిర్ణయం ఒక్కటే అయితే మీ ఇష్టం'' అన్నాను.

అలాగేనన్నట్లు తలూపాడు జీవన్.

''డబ్బులున్నాయా నీ దగ్గర'' అనడిగాడు.

''మూడొందలున్నాయి'' చెప్పాడు.

నా వద్దనున్న నాలుగువందలు అతడి చే తిలో పెట్టాను.

తలవంచి తన చేతిలో పెట్టిన ఆ కాగితాల ను చూసి, నావైపు చూసి మెల్లగా నా కుడి చేయి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు.

ఒక కన్నీటిబొట్టు వెచ్చగా నా చేతిని పలక రించింది.

''నో ఫ్రెండ్. బి బ్రేవ్. కష్టం, నష్టం, సుఖం అన్నిటినీ పంచుకుంటూ మీరిద్దరూ ఎప్పుడూ ఒక్కరై కలిసివుంటే చాలు. ఆల్ ది బెస్ట్''

అన్నాను.

జీవన్ ఎంతగానో చలించిపోయాడు నా మాటలకి.

నాలోనూ విపరీతమైన స్పందన.

ఎంతోసేపు మౌనంగా ఉండిపోయాం.

ఇద్దర్నీ కమ్ముకున్న అవ్యక్తదిగులుతో ఈ మౌనాన్ని భంగపరచుకోవాలన్పించలేదు మాకు.

మళ్ళీ కలునుకుంటామా వీళ్ళు వెళ్ళిపోతే. ఏమో కలునుకుంటే అది ఎక్కడో, ఎప్పుడో ఎలాగో.

చాలా సేపటికి జీవన్ లేచి నా చేతిని తన చేతిలోకి తీసుకుని మెల్లగా నొక్కి- ''థాంక్స్ అండ్ బై'' అని నా ముంజేతిమీద మరోసారి ముద్దుపెట్టుకుని, చేయివదిలి వెనుదిరిగాడు.

అతడు వెళ్ళిపోతున్నా నేనేం మాట్లాడలేకపోయాను. మెట్లుదిగి తలవంచుకుని వెలుతున్న అతణ్ణి చూస్తుండిపోయాను.

★ ★ ★

మరో మూడు రోజులు గతంలోకి జారుకుని కనుమరుగైపోయాయి.

ఈ మూడు రోజుల్లో నేను మళ్ళీ నాగభూషణం ఇంటికి వెళ్ళలేదు. జీవన్ కూడా ఆరోజు తర్వాత కన్పించలేదు.

జీవన్ - పూర్ణిమ ఉన్నారో, వెళ్ళిపోయారో తెలుసుకోవడానికీ నేను ప్రయత్నించలేదు.

వెళ్ళిపోయారేమో అని మనసు అప్పుడప్పుడు మెల్లగా సందేహాన్ని లేవదీస్తుంటే వెంటనే దాని పీక నొక్కేస్తున్నాను. నాలో ఎక్కడో భయం ఉండీ లేనట్లు తారట్లాడుతోంది. ఉహుఁ అది భయం కాదు. సన్నని బాధాతరంగం. ఎగిసిపడలేక, అణగిపోలేక కొట్టుకుంటోంది. ఏదో, ఎవరో నానుండి దూరమైపోయారేమో అనే అంతరంగంలోని భావం నుండి ఉద్భవించిన బాధఅది . అది వాస్తవంగా నా కళ్ళముందు నిలిస్తే భరించలేని అశక్తతతో కావాలనే దాన్ని దూరంగా ఉంచుతున్నాను.

నా గదిలో పడుకుని ఏదో ఆలోచిస్తూ అంతరంగంలోకి ముడుచుకున్న నేను కరుణాకర్ పిలుపుతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి లేచి బయటకు వచ్చాను. కరుణాకర్‌ని చూసి ''రా... కూర్చో'' అన్నాను.

కూర్చుంటూ ''పూర్ణిమ ఏది? అమ్మ పిలుచుకురమ్మంది'' అన్నాడు.

క్షణంపాటు అతడి వంక ఆశ్చర్యంగా చూశాను. ''పూర్ణిమ ఇక్కడకు రాలేదే'' అన్నాను.

కనుబొమ్మలు చిట్లించి ''అదేంటి ఇక్కడికే వస్తున్నానని అమ్మతో చెప్పి వచ్చిందట'' అన్నాడు.

''ఎప్పుడు''

''మధ్యాహ్నం''

అంటే... ఈ రోజే వెళ్ళారన్న మాట. నాలో నేను అనుకున్నాను. ''అమ్మా'' లోపల ఉన్న అమ్మను పిలుస్తూ ''మధ్యాహ్నం పూర్ణిమ వచ్చిందా?'' అనడిగాను.

''రాలేదురా'' అమ్మ సమాధానం.

కరుణాకర్ అయోమయంగా నన్ను చూసి ''అమ్మ వద్దంటున్నా వినక మీ ఇంటికి వెళ్తానని వచ్చిందట'' అన్నాడు.

''ఉహూ... ఇక్కడికి రాలేదు. ఎక్కడికెళ్ళిందో'' అన్నాను. తికమకగా ఆశ్చర్యంగా చూస్తున్న కరుణాకర్‌తో ''ఏ ఫ్రెండ్ దగ్గరికైనా వెళ్ళిందేమో'' అన్నాను.

పెదవి విరుస్తూ వెళ్ళిపోయాడు.

ఒక గంటాగి కంగారు పడుతూ మళ్ళీ వచ్చి ''బయటికెళ్దాంరా'' అన్నాడు. బట్టలు మార్చుకుని కరుణాకర్‌తోపాటు బయటకు వచ్చాను.

''పూర్ణిమ వచ్చిందా'' అనడిగాను దారిలో

''రాలేదు. ఎక్కడికెళ్ళిందో అర్థం కావడంలేదు'' అన్నాడు.

ఇద్దరం టీ తాగి సెంటర్‌లో కొంచెం సేపు నిల్చున్నాం. కరుణాకర్ మౌనంగా ఉన్నాడు. అతడి మౌనం నాకు విసుగనిపించి ''చుట్టుపక్కల ఏ ఫ్రెండ్ ఇంటికైనా వెళ్ళిందేమో'' అన్నాను. దానికి అతడేం బదులివ్వక ముందు కడుగేశాడు. నేనతణ్ణి అనుసరించాను.

మేము వాళ్ళింట్లోకి అడుగుపెట్టగానే వాళ్ళమ్మ నన్ను అదోలా చూస్తూ ''మీ ఇంటికి వెళ్తానని బయలుదేరింది. నేను వద్దన్నా వినలేదు'' అంది.

ఆవిడ మాటల్లో నీకు తెలిసే ఉంటుంది

ఎక్కడికెళ్లిందో ననే నిగూఢమైన భావం దాగి ఉన్నట్లనిపించింది.

"మా ఇంటికి రాలేదు. ఏ స్నేహితురాలి ఇంటికైనా వెళ్లిందేమో" అన్నాను.

"దాని బొంద దానికిక్కడ స్నేహితులెవరున్నారు. వస్తే మీ ఇంటికి రావాలి. లేదా కుమారి దగ్గరకు వెళ్లాలి. అక్కడికీ కబురు చేశాను. రాలేదన్నారు. ఎక్కడ చచ్చిందో ఏమో అర్థం కావడంలేదు" ఆవిడలో విసుగు, కోపం, ఆదుర్దా.

అరగంటసేపు ఎదురుచూశాం. పూర్ణిమరాలేదు. కాలం భారంగా సాగుతున్నట్లనిపించింది నాకు.

వాళ్లమ్మ ఏదో గొణుకుతూ పూర్ణిమను తిడుతోంది. ఇంట్లోకి లోపలికి అదే పనిగా తిరుగుతోంది. కరుణాకర్ ఏదో అనబోతూండగా రెండిళ్ల పక్కావిడ వచ్చింది. ఆవిడ కంగారు చూసి "ఏమిటొదినా ఏమైంది" అనడిగింది.

ఆవిడ చెప్పింది విని "మధ్యాహ్నం నేను మార్కెట్ కెళ్లి వస్తుండగా దారిలో కన్పించింది. ఎక్కడికమ్మా అనడిగితే సిన్మాకెళుతున్నానని చెప్పింది. కూడా ఎవరూ లేరు. ఒక్కదానివేనా అనడిగితే కాదు. మా ఫ్రెండ్‌తో కలిసి వెళ్తున్నాను. ఇప్పుడు వాళ్లింటికే వెళ్తున్నానంది" అని చెప్పిందామె.

కరుణాకర్, వాళ్లమ్మ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు అయోమయంగా.

"కుమారి ఇంట్లో ఉంది. రాలేదన్నావు కదరా" అంది కొడుకుతో.

"అవును" అన్నాడు కరుణాకర్.

ఆవిడనా వంక చూసింది. ఆ చూపులో ఉన్నది అనుమానమో, అయోమయమో నాకర్థం కాలేదు.

కరుణాకర్ నన్ను "వెళ్దాంరా" అనిపిలిచి బయటకు నడిచాడు. "ఎక్కడికిరా" అని వాళ్లమ్మ అడిగితే ఎక్కడికీ లేదన్నట్లు తల అడ్డంగా ఊపాడు.

"ఎక్కడ చచ్చిందో ముందుదాని సంగతి చూడు" కంగారు, కోపం, భయంతో అందావిడ.

రోడ్డు మీదకొచ్చాక "జీవన్‌గాడి రూం కెళ్దాం పద" అన్నాడు కరుణాకర్.

"ఎందుకు?" అడిగాను.

ఏం చెప్పకుండా ముందుకు సాగాడు.

జీవన్‌మీద అనుమానం కలగడానికి కారణమేమిటి? ఇతడికీ తెలిసిపోయిందా? తెలిస్తే నాతో చనువుగా ఉండడే. నాగభూషణం కట్టడి చేయడూ. అయినా నన్ను చెప్పొద్దన్న నాగభూషణం తనే చెప్పడే అనుకున్నాను మనసులో

జీవన్‌లేడు. అతడి కొలీగ్ ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. జీవన్ గురించి అడిగితే "వాళ్లమ్మ సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వచ్చిందట. పొద్దున కంపెనీకి వెళ్లినవాడు తిరిగొచ్చి ఊరికెళ్లాడ"ని చెప్పాడు.

"సీరియస్సా పాడా. వాడు, ఇది కల్సిపోయుంటారు" గొణుకుతున్నట్లు అన్నాడు కరుణాకర్.

"ఏమిటీ" వినిపించనట్లు అడిగిన నాకు సమాధానంగా మళ్లీ అదే అన్నాడు.

"వాళ్లిద్దరు కల్సి వెళ్లిపోవడమేమిటి?" ఆశ్చర్యంగా అడుగుతున్నట్లు ప్రశ్నించాను.

"వాడు ఇంట్లోంచి అకస్మాత్తుగా వెళ్లడం, మావాడు ముభావంగా ఉండడంతో ఏదో జరిగి ఉంటుందని నాకనుమానం వచ్చినా దాన్ని పక్కకు తోసేసాను. ఇప్పుడు వీళ్లిద్దరూ కన్పించకపోవడంతో నా అనుమానం నిజమేనని తేలింది" అన్నాడు.

రెండు నిమిషాలు ఆలోచించాను. అసలు విషయం ఇతడికి చెప్పాలా వద్దా అనే సంశయం నాలో చివరకు చెప్పడమే మంచిదనిపించింది.

మెయిన్ రోడ్డు మీద కొచ్చాక "హొటలు కెళ్దాం పద" అన్నాను. ఎందుకన్నట్లు చూసిన అతడితో "మాట్లాడాలి" అని హొటల్‌వైపు దారితీశాను.

ఇద్దరం మౌనంగా కాఫీ తాగాం. ఆ తర్వాత నెమ్మదిగా- "వాళ్లిద్దరు కలిసి వెళ్లినా వెళ్లుండ వచ్చు" అని అసలు విషయం మొదటినుండీ అంతా చెప్పాను.

అది విని నా కళ్లలోకి సూటిగా చూస్తూ తనలోని ఆశ్చర్యాన్ని కోపాన్ని అణచుకుంటూ - "ఇదంతా ముందే నాతో ఎందుకు చెప్పలేదు"




అన్నాడు. కోపంతో బరస్టయి నా మీద విరుచు కుపడతాడనుకున్నాను కాని అంత సౌమ్యంగా అడుగుతాడనుకోలేదు నేను.

"పూర్ణిమ మీకెవరికీ చెప్పనన్నా చెప్పమని ఒత్తిడి చేసింది నేనే. మీ అన్నయ్యకు చెప్తే వాళ్ల గురించి నీకు మీ అమ్మకు చెప్పవద్దని ఒప్పేయించుకున్నాడు. చెప్పడమే మంచిదే మోనని నేనంటే అమ్మ అసలే బిపి పేషెంట్. ఇదివింటే ఆ కోపంలో బాధలో ఏమవుతుందో తెలియదు. నీవేమో ఆగి కోపంలో దురుసుగా ప్రవర్తిస్తే అందరికీ తెలిసి అల్లరవుతుందని చెప్పొద్దని బతిమిలాడాడు. నేనింకెలా చెప్పగ లను?" అన్నాను.

"వాళ్లు నీకు చెప్పకుండానే వెళ్లారా? నీకు తెలియకుండానే ఇదంతా జరిగిందా" నన్నును మానంగా చూస్తూ అడిగాడు.

"నాకెలా తెలుస్తుంది. నాతో ఎందుకు చెబు తారు. అయినా వాళ్లు ఏదైనా నాతో చెప్పి చేశారా? అంతా జరిగి పోయాక చెప్పారు. సమయం చూసి నెమ్మదిగా నేనే మీకు చెబుదా మనుకునేలోగా వాళ్లే చెప్పుకుని అల్లరిపడ్డారు. ఆ తర్వాత జీనవ్‌ను ఇక ఆ ప్రేమ సంగతి మరచిపొమ్మని హెచ్చరించాను. వాళ్లీ ప్రయ త్నంలో ఉన్నారని నాకేం తెలుసు. తెలిస్తే మొదటినుండీ వాళ్లని వారించే నేనూరు కుంటానా? అసలు వాళ్లింత సాహసం చేస్తార నుకోలేదు. ఏమాత్రం అనుమానం వచ్చినా మీ అన్నయ్యతో నైనా చెప్పేవాణ్ణి" అన్నాను కొంచెం కోపం ధ్వనింపజేస్తూ.

ఏమనుకున్నాడో మరి మాట్లాడలేదు. ఈ పది నిమిషాల్లోనే అతడి మొహం బాగా పాలి పోయి నీరసంగా కనుపిస్తోంది. చెల్లెలీ విధంగా చేస్తుందని ఊహించని అతడికిది నిజంగా షాకే. ఆ షాక్ మొహంలో ప్రతిఫలి స్తోంది.

అతణ్ణి చూస్తూ అనవసరంగా ఈ విష యంలో తలదూర్చానా. ప్రశాంతంగా ఉన్న నాకిదంతా ఎందుకు? లేనిపోనిగొడవ తెచ్చినె త్తిన పెట్టుకోలేదు కదా. ఇదంతా నా మీదకు రాదుకదా అనే పిరికి భావం రెండు క్షణాలపా టు తొంగిచూసించి నాలో. అంతలోనే వాళ్లు వెళ్లడానికి నేను సహకరించిందేముంది అను కున్నాను.

ఐదు నిమిషాల తర్వాత కరుణాకర్ నిట్టూ రుస్తూ లేచాడు. "మా అమ్మతో ఈ సంగతి నీవే చెప్పు. నేను చెప్పలేను" అన్నాడు.

"నేను చెప్పడమేమిటోయ్. నువ్వే చెప్పు" అన్నాను.

"ఆవిడముఖం చూస్తూ నేను చెప్పలేనీ సంగతి. ప్లీజ్... నువ్వే చెప్పు" అన్నాడు కరుణా కర్ ఎంతో నిస్సత్తువుగా.

ఇద్దరం వాళ్లింటికివెళ్లాం. "ఏంటిరా... ఏమైంది. కన్పించిందా" అని కరుణాకర్‌ని అడుగుతున్న వాళ్లమ్మను కూర్చోమని కరుణా కర్‌కు చెప్పిందంతా చెప్పాను.

"అందుకేనేమో పెద్దాడు దాన్నెక్కడికీ కద లనీయొద్దని నీవొచ్చినా అంటీముట్టనట్లుండ మని రావద్దని చెప్పమని పదేపదే చెప్పాడు. నాకర్థమై చావక ఎందుకురా అనడిగినా ఏం చెప్పలేదు" అంది తర్వాత కొడుకుని చూస్తూ "ఇప్పుడేం చేయాలిరా నాయనా. ముదనష్ట పుది కొంపముంచింది కదరా" అంటూ ఏడుపు లంకించుకుని గుండెలు బాదు కుంటూ గట్టిగా శాపనార్థాలు మొదలుపె ట్టింది.

అది చూసి కరుణాకర్‌కి చిర్రెత్తుకొచ్చి "నే ను మొదటినుండి చెప్తున్నాను దాన్ని చది వించవద్దే అని. విని చచ్చారా. చదివి చదివి బుర్రపిచ్చెక్కి ప్రేమంటూ లేచిపోయింది. ఇంకా ఇప్పుడెందుకా వెధవ ఏడుపు. చచ్చిందని ఊరుకో" అని కసిరాడు.

వాళ్లమ్మ ఏడుపు తీవ్రస్థాయినందుకోబో తుంటే"ఆ ఏడ్చేదేదో లోపలికి పోయి ఏడువు. చుట్టు పక్కల వాళ్లకి తెలిసేలా ఇక్కడ కూర్చుని శోకాలు పెట్టకు" అని గట్టిగా అరిచా డు.

"తెలియకుండా ఎలా ఉంటుందిరా" అంటూనే రాగాలు తీస్తోందావిడ.

నన్ను బయటకు రమ్మని సైగచేశాడు కరు ణాకర్. వచ్చాక "స్టేషన్‌కెళ్లి చూసొద్దాంరా" అన్నాడు.

"ఇప్పుడా? ఇప్పుడెళ్లి ఏం లాభం. మధ్యా హ్నం వెళ్లిన వాళ్లు ఇప్పటిదాకా ఉంటారా?"




# మీ బిడ్డను ఒక జంట లాభంతో బడికి పంపండి.



## రుచి + పోషణ బానీ మిక్స్ నుండి.

మంచి పోషణలో ఉండడమంటే సగం ప్రయత్నం నెగ్గడమే. ప్రతిరోజూ, మీ బిడ్డకు బానీ మిక్స్ యొక్క రెండు-విధాల లాభాన్ని సమకూర్చండి. రుచికరమైన ఆపిల్స్, మామిడి పండు, ఖర్జూరము, ఎండుద్రాక్ష, మరియు పప్పులు, అంతేకాకుండా గోధుమ, బియ్యం, మరియు మొక్కజొన్న వంటి పుష్టికరమైన చిరుధాన్యాలను కూడ అది కలిగియున్నది. మీ బిడ్డకి ఇవ్వండి దానికవసరమైన అధిక పోషణను.

**తయారు చేసికొనుటకు ఎంతో అనుకూలమైనది.**



వండుకోవలసిన అవసరం లేదు. ఒక గిన్నెలో కావలసినంత పరిమాణంలో బానీ మిక్స్‌ను వేయండి. మరగబెట్టి సిద్ధంగా ఉంచిన పాలను అందులో పోయండి. మీకు కావలసిన మృదువైన జావ తయారయ్యే దాకా నెమ్మదిగా కలియబెట్టండి.




గ్లాక్సో నుండి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/3/89-R-TEL

"అయినా చూసొద్దాం పద" అన్నాడు.

వెళ్లక తప్పింది కాదు. స్టేషన్, బస్టాండ్ అన్నీ చూసి నీరసంగా వాళ్లింటికి చేరాం. నాకెప్పుడు ఇంటికి పోదామా అని ఉన్నా వాళ్లున్న ఈ పరిస్థితిలో అది మర్యాదకాదని ఊరుకున్నాను.

వాళ్లమ్మ ఇంకా ఏదేదో గొణుక్కుంటూ ఏడుస్తూనే ఉంది. మమ్మల్ని చూసి ముక్కు చీదేసి ఆత్రంగా "కన్పించిందా" అనడిగింది.

"ఉంది ఛస్తేగాకనిపించడానికి" విసుగ్గా నీరసంగా అన్నాడు కరుణాకర్.

"ఏదైనా చీటీ రాసిపెట్టిందేమో చూశారా" అన్నాను. ఇద్దరూ లేదన్నట్లు చూశారు.

కరుణాకర్‌తో కలిసి పూర్ణిమ బట్టలు, పుస్తకాలు, షెల్ఫులు అన్నీ వెతికాం. ఆవిడింకా దీర్ఘాలు తీస్తూ జీవన్, పూర్ణిమలను తిట్టిపోస్తోంది.

షెల్ఫ్‌లో అద్దంచాటున పేపర్‌కింద పూర్ణిమ రాసిన చిన్న ఉత్తరం కన్పించింది. కరుణాకర్ చదవమన్నట్లు నాకిచ్చాడు. చదివి విన్పించాను.

పూర్ణిమ వాళ్లమ్మని సంబోధిస్తూ రాసిందది. తనని పెంచిన తీరు, హింసించిన తీరు, జీవన్‌తో తన ప్రేమ ఆ విషయం నాగభూషణానికి చెబితే అతడెలా ప్రవర్తించిందీ అంతా వివరంగా రాసి మీ సుఖంకోసం, మీరు బతికి ఉండడం కోసం నేను చచ్చినా ఫర్వాలేదన్నాడు పెద్దన్నయ్య. చచ్చిపోదామనే అనుకున్నాను మొదట్లో. కాని దానికంటే నన్ను కోరుకునే నేను కోరుకున్న వ్యక్తితో ఇన్నాళ్లూ బ్రతికిన ఈ నరకం నుండి వెళ్లిపోయి బతకడమే నాకుసు ఖమన్పించి ఈ పని చేస్తున్నాను. క్షమించగల్గితే క్షమించండి. లేదా మరిచిపోండి. నాకోసం వెదకవద్దు. నన్ను వెదికి జీవన్‌కి దూరం చేయాలని చూస్తే నా చావు వార్తవింటారు అని రాసింది.

అది విన్న వాళ్లమ్మ ఏడుపు మరీ ఎక్కువైంది.

కరుణాకర్ "నోర్మూయ్యి" అని కసురుకున్నాడు.





అతడిలో ఉద్రేకం, బాధ, ఆవేశం అన్నీకలగాపులగమై ప్రతిబింబిస్తున్నాయి. ఒక్క చోట నిలవలేక, కూర్చోలేక బయటికి గదిలోకి తిరుగుతున్నాడు. ఒక్కోసారి కిటికీ చువ్వల్నిపట్టుకుని బయటకు చూస్తూ నిలుచుంటున్నాడు. మళ్లీ అటూ ఇటూ తిరుగుతూ అకస్మాత్తుగా "నువ్వు మొదట్లోనే నాతో చెబితే ఇలా జరిగేది కాదు. ముండని కాళ్లు చేతులు కట్టిపడేసి ఉండేవాణ్ని. ఆ దొంగనా... ని నరికిపారేసేవాణ్ని" ఉద్రేకంగాఅన్నాడు.

"నాగభూషణానికి చెబితే ఏం చేశాడు. అతడే మీకు చెప్పొద్దంటేనేనెలా చెప్పగలను" నన్ను నేను సమర్థించుకుంటున్నట్లు అన్నాను.

"ఒరేయ్.. మీ బాబాయి దగ్గర వెళదాంపదరా. నేనిక్కడ ఉండలేను. ఇప్పుడాయనికి నేనేమని చెప్పుకోను. లోకులికి ఏం జవాబు చెప్పను. చస్తే చచ్చిందని ఏడ్చి ఊరుకునేదాన్ని. పాపిష్టిది ఎంతపని చేసింది. కొంప ముంచింది. పరువు తీసేసింది. వాడు... ఆ జీవన్‌గాడు... ఇంట్లో ఉంటూనే ఎంత పని చేశాడు. వాడు నాశనమైపోను. వాడి శ్రాద్ధంపెట్ట" శాపనార్థాలు శోకాలు పెడుతూ అంది.

పరువు, ఆ పదానికి వీళ్లకర్థం తెలుసా అనుకుంటూ నాలో నేను నవ్వుకున్నాను. కోపం, బాధలో వాళ్లేం తిడుతున్నారో వాళ్లకే తెలియడంలేదు. ఆ పరిస్థితిలో ఎవరున్నా అది సహజమేలే అనుకున్నాను.

"బాబాయి దగ్గరికి నే వెళ్లివస్తాలే" అన్నాడు కరుణాకర్.

"నేనూ వస్తానురా నాయనా. ఇక్కడుండలేనురా బాబూ. సమయానికి పెద్దాడూలేడే" అంది ముక్కు చీదుతూ. "పదరా" అంటూ లేవబోయింది.

"ఇప్పుడేం తగలడ్డాయని వెళ్లాం. పొద్దునే వెళ్లాలి" విసుక్కున్నాడు కరుణాకర్.

ఇద్దరం ఇంట్లో నుండి బయటికొచ్చాం. నీ దగ్గర డబ్బులుంటే ఇవ్వు. రాగానే చూసిస్తాను" అన్నాడు.

"నా దగ్గరా లేవు. ఎవరి దగ్గరైనా దొరుకుతాయేమో ప్రయత్నిస్తాను. ఒక గంటాగిరా" అని వచ్చేశాను.

ఒక మిత్రుడి దగ్గర రెండొందలు తీసుకుని కరుణాకర్ వస్తే ఇచ్చిపంపాను.

భోంచేసి పడుకున్న జీవన్, పూర్ణిమల గురించిన ఆలోచనలెన్నో నాలో.

"లోకం ఎంతో విశాలమయింది. ఈ లోకంలో మీరు హాయిగా బ్రతికే కాసింత చోటు దొరికితే చాలు. కష్టంలో సుఖంలో కలకాలం కలిసి ఉండండి. ప్రేమగా పెనవేసుకుని ఆ ప్రేమ పంటలో పండిపోండి" వెళ్లిపోయిన వాళ్లను మౌనంగా దీవించింది నా మనసు.

వాళ్లు కలిసి ఉన్నారన్న ఆనందమో, నాకు దూరమయ్యారన్న బాధో, ఏమీ లేని శూన్యమో నాలో ఉన్నదేదో నాకే అర్థం కావడంలేదు.

వెళ్లిపోయారు. ఈ బ్రతుకు ప్లాట్ ఫారం మీద మరో ఇద్దరు ప్రయాణీకులు ఆగి తమరైలు రాగానే ఎక్కి వెళ్లిపోయారు. ప్లాట్ ఫారం మాత్రం ఎప్పటిలాగే ఒంటరిగా ఉన్న చోట మిగిలిపోయింది. ఆ ప్రయాణీకులు ఎక్కిన రైలు ఏ స్టేషన్లో ఆగుతుందో వారి మజిలీ ఏ విధంగానో...

నన్నెనన్నుగా పెరిగిన బాధ గుండెలోని మంచుకొండని కరిగించి రెండు కన్నీటి బొట్లు బయటకు పొంగించింది. నిర్వేదంగా నాలో నేను నవ్వుకుంటూ కళ్లు తుడుచుకున్నాను. సెన్సిటివ్‌నెస్ మరీ ఎక్కువయిపోతోందనుకుంటూ.



కరుణాకర్ తల్లితో కలిసి వాళ్ల బాబాయి దగ్గరకెళ్లాడు. ఆ సమయానికి నాగభూషణం అక్కడే ఉన్నాడు. నలుగురు ఆచుట్టుపక్కల గల బంధువుల దగ్గరకు వెళ్లి వాకబు చేశారు. నాగభూషణం జీవన్ తల్లిదండ్రుల దగ్గరకు, వాళ్లన్నయ్యా అక్కయ్యల దగ్గరకు మామూలుగా వెళ్లినట్లుగా వెళ్లి జీవన్, పూర్ణిమ ఉన్నారేమోనని చూసి వచ్చాడు. జీవన్‌కి సన్నిహిత మిత్రులనుకున్న ఒకరిద్దరి దగ్గరకు కూడా వెళ్లి అడిగి వచ్చాడు. ఎక్కడా జీవన్, పూర్ణిమ ఆచూకీ తెలియలేదు. నాలుగు రోజుల తర్వాత అందరూ కలిసి ఇక్కడికి తిరిగి వచ్చారు.

వచ్చీ రావడంతోనే నాగభూషణంవాళ్ల బాబాయిని తీసుకుని మా ఇంటికి వచ్చాడు. వస్తూనే ఆవేశంతో నన్ను తిడుతూ "ఇదంతా నువ్వే చేయించావు. నేనూళ్లో లేకపోవడం చూసి నీవే వాళ్లను పంపించేసావు. నీ పాత్రలేకుండా ఇది జరగదు" అన్నాడు.

వస్తూనే అతడు తిట్లు లంకించుకోవడంతో నాకు ఒళ్లు మండిపోయింది. నేను కాస్త హెచ్చుస్వరంతో "నాగభూషణం ఒళ్లు దగ్గరుంచుకో. మాటలు మీరకు" అన్నాను.

"ఏం చేస్తావు" అనరిచాడు.

"ఏదైనా చేయగల్ను. ఆవేశంలో నీవేం మాట్లాడుతున్నావో నీకు తెలియడంలేదు. కాస్త ఆలోచనతో మాట్లాడు" అన్నాను.

వాళ్లబాబాయి అతణ్ణే కసురుకుని "నువ్వు తగ్గు" అన్నాడు.

"జీవన్, పూర్ణిమల్ని నేనెందుకు పంపిస్తాను. పంపించే వాడినైతే వాళ్ల విషయం మీదాకా రాకుండా, మీరిలా నన్నునుమానించకుండా ఆ పని ఎప్పుడో చేసేవాణ్ణి. నీతో వాళ్ల గురించి మాట్లాడేవాణ్ణి కాదు. వాళ్లని వద్దని వారించేవాణ్ణి కాదు" అన్నాను.

"ఎప్పుడు చెప్పావు అంతా జరిగిపోయాకా?"

"నాకు మాత్రం తెలిసిందెప్పుడు అంతా జరిగాక కాదా?"

"నువ్వు ముందు నాకు చెప్పలేదు. నాకు తెలిసాకే చెప్పావు"

"అవును మీరు మంచి మూడ్‌లో ఉన్నప్పుడు చెబుదామనుకున్నాను. ఈలోగా నేను క్యాంప్ కెళ్లాల్సివచ్చింది. వచ్చేసరికి వాళ్ళే చెప్పుకున్నారు. అప్పటికైనా నీకు తెలియని విషయాలు చెబితే నీవు మాత్రం ఏం చేసావు. అందరి అభిప్రాయాలు తెలుసుకుందామంటే వినకుండా అల్లరవుతుందంటూ మీ అమ్మకూ,

తమ్ముడికీ చెప్పొద్దన్నావు" అన్నాను తీవ్ర స్వరంతో.

అది విని వాళ్లబాబాయి నాగభూషణాన్నే తిట్టాడు. తర్వాత "అసలేం జరిగిందో చెప్పు" అనడిగాడు నన్ను.

వీళ్లకు చెప్పిందే మరోసారి ఆయనకూ చెప్పాను. విన్నాక "దానికోసం ప్రయత్నించడం అనవసరం. చచ్చిందని ఊరుకోవడమే"అని లేచాడు వాళ్ళ బాబాయి. ఆయన నన్ను అనుమానించకపోలేదు. ఆయన చూపే దాన్ని బయటపెడుతోంది. నేనది గమనించినా మౌనంగానే ఊరుకున్నాను.

నాగభూషణం కోపంగా నన్ను చూసి వాళ్ల బాబాయి ననుసరించాడు.

చచ్చిందనుకున్నా వాళ్లు జీవన్, పూర్ణిమల కోసం ప్రయత్నించకుండా ఊరుకోరని తెలుసు నాకు. అందునా వాళ్ల బాబాయి ఘటికుడు. ఒక పట్టాన వదలడు.

వీళ్లు వచ్చిన టైముకి ఇంట్లో ఎవరూలేరు. అన్నయ్య ఇంకా రాలేదు. అమ్మ అక్కయ్య దగ్గరకెళ్లింది. వాళ్లే ఉంటే ఈ గొడవకి నన్నెన్ని తిట్టిపోసేవారో అనుకున్నాను.

★ ★ ★

పది రోజుల తర్వాత జీవన్ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది.

మేమక్కడినుండి సరాసరి చీరాలలో ఉన్న ఓ మిత్రుడి దగ్గరకొచ్చాం. ఆ మరునటిరోజే పాండురంగస్వామిగుళ్లో పెళ్లి చేసుకున్నాం. తర్వాత రెండు రోజులకు బయలుదేరి మా ఊరెళ్లాం. అన్నయ్య, అక్కల్ని పిలిపించాను. అందిరికీ మేం పెళ్లి చేసుకున్న సంగతి చెప్పేశాం. మేం ఎవరికీ చెప్పకుండా ఇలా వచ్చేసి ఎవరూ లేకుండా ఇలా పెళ్లి చేసుకోవడాన్ని అందరూ నిరసించి పెద్దగొడవే చేశారు. పూర్ణిమను తీసికెళ్లి వాళ్లన్నయ్య దగ్గర వదిలి పెట్టిరమ్మన్నారు. నేనందుకు ఒప్పుకోలేదు. మీ దృష్టిలో మేమిలా వచ్చేసి పెళ్లి చేసుకోవడం తప్పుకానచ్చు. మేమది తప్పనుకోవడంలేదు. నేను మళ్లీ మావాళ్ల దగ్గరకెళ్లేప్రసక్తిలేదు. మీరాదరిస్తే ఆదరించండి. లేకపోతే మా దారి మేం చూసుకుంటామని పూర్ణిమ కూడా తెగేసి చెప్పింది. మావాళ్లు ఒక పట్టాన వినలేదు. అదీ ఇదీ అని బెదిరించారు. వాళ్లకి శతవిధాల నచ్చచెప్పి పూర్ణిమ తరపువాళ్లెవరైనా వచ్చి వాకబు చేస్తే మేం రాలేదని, అసలు మా గురించేమీ తెలియదని చెప్పమని వాళ్లకి చెప్పి మళ్ళీ చీరాల వచ్చాం రెండురోజుల క్రితం. నా బంధువులు స్నేహితులు ఎవరెవరో నాగభూషణానికి తెలుసు కనుక వాడు ఇక్కడికీ వచ్చే అవకాశం లేకపోలేదు. అందువల్ల మరో రెండు మూడు రోజుల్లో రాయగఢ్ వెళదామనుకుంటున్నాను. మిగతా వివరాలతో తర్వాత ఉత్తరం రాస్తానని రాశాడు.

నేనది చదువుకుని ఏదో బరువుదిగినట్లు హమ్మయ్య అనుకుని ఊపిరి పీల్చుకున్నాను జవాబు రాద్దామనుకున్నాను కాని జీవన్ అడ్రను రాయలేదు.

మళ్లీ ఇరవై రోజులకు జీవన్నుండి మరో లేఖ వచ్చింది. రాయగఢ్నుండి రాశాడు. అక్కడ వాళ్ల పెదనాన్నగారబ్బాయి ఉన్నాడు. అతడు ఎక్స్‌సర్వీస్‌మెన్. ఏదో కంపెనీలో సెక్యూరిటీ ఇన్‌స్పెక్టర్‌గా ఉన్నాడు. వయసులో అతడు ఆరేడేళ్లు పెద్దే అయినా జీవన్‌కీ, అతడికీ మధ్య ఎంతో సన్నిహితత్వం ఉంది. బంధుత్వంకన్నా వారి మధ్య స్నేహబంధం ఎక్కువ.

ఈ విషయాలన్నీ రాసి, 'అతడూ మేం తొందరపడ్డామని ముందు కోప్పడ్డా ఆత్మీయంగా ఆదరించాడు. అతికష్టంమీద వాళ్ల కంపెనీలోనే సెక్యూరిటీ గార్డ్‌గా ఉద్యోగమిప్పించాడు. జీతం ఆరొందలు. ఖాళీగా కూర్చుంటే బతుకుతెరువుండదు కాబట్టి ఏదో ఒకటని చేరిపోయాను. కంపెనీకి దగ్గర్లోనే చిన్న గది అద్దెకు తీసుకుని ఉంటున్నాం. పరిసరాలన్నీ ఎక్కువగా లేబర్ ఉండేదయినా తప్పదుగా. అయినా నేనూ ఒక లేబర్‌నేగా. వీలయితే మూడు నాలుగొందలు పంపించు' అని రాశాడు.

'అక్కడి విషయాలేమిటి. మేం వచ్చేశాక నాగభూషణంవాళ్లు పెద్ద అల్లరే చేసి ఉంటారు. నీమీద విరుచుకుపడి ఉంటారు. మావల్ల నీవెన్నో మాటలు పడివుంటావు. స్నేహానికి నీవిస్తున్న విలువకు, మాపట్ల కనబరిచే ఆప్యాయతకు నీకు మేమిచ్చే ప్రతిఫలం అదే





అయింది. ఎప్పటికప్పుడు జీవితానికి లొంగిపోతుంటే అది మరీ లొంగదీసుకుంటోంది. దాన్ని ప్రతిఘటించి ఒక అవకాశమైనా చేతుల్లోకి తీసుకుని దాన్ని లొంగదీసుందామనే మా ప్రయత్నంలో నీ స్నేహాన్ని పణంగా పెట్టాం. నీదొడ్డ మనసును మా అవసరంకోసం ఉపయోగించుకున్నందుకు మమ్మల్ని క్షమించు' అని కూడా అందులోనే రాశాడు.

పిచ్చి జీవన్ నేను క్షమించడమేమిటి?!

మీరు పరిస్థితుల్ని తట్టుకుని మీ బతుకుల్ని కాస్తంతైనా సుఖమయం చేసుకోండి అనుకున్నాను మనసులో.

పూర్ణిమకూడా అందులోనే రాసింది. 'అన్నయ్యా భౌతికంగా దూరంగా ఉన్నా మానసికంగా మనం దగ్గరగానే ఉన్నాం. నీవు చూపిన ఆత్మీయతనుజీవితాంతం మరచిపోలేను. నీకు మేమెప్పుడు ఋణపడేఉంటాం. ఎక్కడున్నా ఏం చేస్తున్నా నిన్నే తలచుకుంటుంటాం. ఆలోచించి నడచుకోండి. పరిస్థితుల్ని అవగాహన చేసుకుని వెలుగుతూ జీవితాల్లో వెలుగు నింపుకోండనే నీ పలుకులు మా మనసుల్లో మారుమోగుతూనే ఉంటాయి. మళ్లీ ఎప్పుడు కలుస్తామో ఏమో. ఎప్పుడు కలిసినా, కలవకపోయినా నిన్ను మాత్రం ఏరోజూ మేం మరవమని రాసింది.

పూర్ణిమ తన అభిమానాన్నంతా కుమ్మరించి రాసిన ఆ వాక్యాల్ని ఒకటికి నాలుగుసార్లు చదువుకున్నాను.

నిర్వచించలేని తృప్తి, ఆనందం నాలో.

ఇక్కడ నాగభూషణంవాళ్లు మరీ నీచంగా, చెప్పుకోవడానికే అసహ్యమన్పించే బూతులు తిట్టడం, చచ్చిందని నిర్ణయించుకోవడం, నాగభూషణం అతడి బాబాయి వాళ్లూరు వెళ్లడం అంతా వివరంగా తెలియజేస్తూ వదిలేసాం అన్నట్లున్నా మీ ఆచూకీ కోసం ప్రయత్నాలు చేయకుండా ఉండరు. జాగ్రత్తగా ఉండండని ఉత్తరం రాశాను.

నాగభూషణం, కరుణాకర్- ఇద్దరూ నాతో మాట్లాడ్డం మానేసారు. నేనూ వాళ్ళని కలవడంలేదు. ఇదంతా నావల్లే జరిగిందని, నేనే చేయించానని, వాళ్లని నేనే దగ్గరుండి పంపానని నాగభూషణం బాగా అనుమానించడమే కాకుండా అదే భావాన్ని తనవాళ్లలో బలంగా నాటాడు.

సామాన్యంగా ఎవరూ తమ చెల్లెలు లేచిపోయిందని చెప్పుకోరు. ఎంతో సిగ్గుతో చచ్చిపోతారు. కాని నాగభూషణం అలా చెప్పుకోవడమే కాక దానికి కారకుణ్ణిగా నన్ను చిత్రించాడు. ముందుపెట్టి జీవన్, పూర్ణిమలను కలిపానని చెబుతూ ఎదుటి వ్యక్తులనుండి మరింత సానుభూతిని పొందాలని ప్రయత్నిస్తూ మా ముగ్గుర్నీ పచ్చి బూతులు తిడుతూ ఇక్కడి సర్కిల్ నాపై చెడుగా ప్రచారం చేస్తున్నాడు. అయినా దాన్ని నేను పెద్దగా పట్టించుకోలేదు. కొంత మంది సంస్కారం అంతేలే అనుకున్నాను.

ఈ మధ్య నాగభూషణం వాళ్లబాబాయి ఇక్కడకు తరచూ వస్తున్నాడు. నాగభూషణం కూడా వాళ్లూరు ఎక్కువగా వెళ్లి వస్తున్నాడు. వాళ్ల ప్లానులు, ఉద్దేశాలు సరిగ్గా నాకు తెలియటంలేదు. అప్పుడప్పుడు ఆనోటా ఈనోటా ఏదైనా వినడమే. నాగభూషణం చేసిన ప్రచారం ఇక్కడి నా సర్కిల్‌పై బాగానే పనిచేసింది. దాదాపు నేనొంటరివాడినైపోయాను. ఆఫీసు ఇల్లు తప్ప నేను ఎక్కువగా ఏమీ పట్టించుకోవడంలేదు. ఎప్పుడైనా అరగంటో, గంటో కొలీగ్స్‌తో కాలక్షేపం. అంతే.

ఈ గొడవకు మావాళ్ల కోపతాపాల్ని కూడా అమితంగానే ఎదుర్కోవలసి వచ్చింది నేను.

ఎప్పుడూ లేనిది ఎంతో సహనాన్ని ప్రదర్శించే అమ్మకూడా నాగభూషణం ప్రచారం తన చెవిన పడినప్పుడు భరించలేక కోపంగా మాట్లాడింది రెండు మూడుసార్లు.

జరిగిందేమిటో అర్థంచేసుకోగలిగినా నాకు వచ్చిన చెడు పేరును నేనంతగా ఖాతరు చేయకపోవడంతో కలిగిన బాధలో నుండి వచ్చిన కోపమదని నాకు తెలుసు.

అందుకే అమ్మ ఏమన్నా నేనేంమాట్లాడలేదు.

★ ★ ★

జీవన్‌నుండి మళ్లీ ఉత్తరం వచ్చింది. మొదటి రెండు ఉత్తరాల్లోనూ కనుపించని ఆనందం అందులో కనుపించింది.

"జీవితంలో ఆనందం అనేది ఎలా లభి





స్తుందో అనుభవపూర్వకంగా చూసాను. పూర్ణిమలో అంత ఆనందాన్ని హాయిని చూడడం అదే మొదటిసారి. ఆరోజు తొలిసారిగా నా జీవితంలో తొలిసారి కాకపోయినా మా ఉమ్మడి జీవనంలో తొలిసారిగా- జీతం అందుకున్నాను. దేశం కాని దేశంలో తన వాళ్లంటూ ఆత్మీయులెవరూ లేని ఇక్కడ మా ఇద్దరికీ మేమే అన్నీ అయ్యాం. అందుకని తొలిసారి జీతం అందుకోగానే పూర్ణిమకు ఏమైనా కొందామనుకున్నాను''

''మిగిలిన వాళ్లు అంటే కొత్తగా పెళ్లయిన వాళ్లు ఆ తర్వాత తొలిగా జీతం అందుకున్నప్పుడు ఏం అనుకుంటారో, ఎలాగడుపుతారో నాకు తెలీదు. విననూలేదు. బహుశా సినిమాకి వెళ్లి అటునుండి షాపింగ్‌కి వెళ్లి ఆపై స్టార్ హొటల్లో భోజనంచేసి ఇక ఆ తర్వాత ఏ అపరాత్రిదాకానో కబుర్లు చెప్పుకుంటూ గడిపి ఆరాత్రిని మధురానుభూతుల మందిరం చేసుకుంటారేమో''

''జీతం అందుకున్నాక నేను నేరుగా ఇంటికి వెళ్లాను ఒంటి గది ఇల్లు. రూంలా ఉండే ఇల్లు. ఇల్లులా అన్పించే ఒంటిగది. గది ఆనుకుని చిన్న పెరడు. దానిలోనే రూఫ్ లేని స్నానాలగది. గదంటే చుట్టూ రాళ్లు పేర్చారు'' అంతే.

"ఆమె చేతుల్లో డబ్బులు పెట్టాను. జీతం ఇచ్చారని చెప్పాను. కాస్సేపాగి ఆమెకోసం తెచ్చిన జాకెట్‌గుడ్డ ఇచ్చాను. పూర్ణిమ ముఖంలో ఎన్నడూ కనిపించని సంతృప్తి"

"ఆమె ఏం మాట్లాడలేదు. కానీ ఆమె కంటినుండి రాలిన రెండుబొట్లు ఆమె భావాలను తెలియజేశాయి. ఆమె గుండె ఏదో మాట్లాడినట్టయింది"

"పూర్ణిమ డబ్బుని భద్రంగా దాచింది"

"ఆ తర్వాత భోజనంచేసాం. పేదవారికి విందులుండవు. తిన్న నాలుగు మెతుకులే విందు భోజనం. అదే ఎంతో రుచిగా అనిపించింది. ఆమె తన మనసులోని ఆనందం రంగరించితే తప్ప ఆమె చేసిన వంటకు అంతరుచి రాదనిపించింది. భోజనాలయ్యాక సినిమాకి వెళ్లాలనిపించింది"

"కానీ ఇక్కడ తెలుగు సినిమాలెక్కడివి?"

"పూర్ణిమతో అదే అంటే తనంది మనం ఎక్కడుంటే అదే మన ప్రాంతం. అదే మన భాష. ఇక్కడున్నాం కనక ఇక్కడి సినిమాలే చూద్దాం అంది"

"సరే అనుకుని ఇద్దరం కదిలాం. గదికి తాళంవేసి తాళంచెవి నాకిచ్చింది దాయమని. ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ సరదాగా నడుచుకుంటూ మైలు దూరంలో ఉన్న సినిమాహాలుకెళ్లాం. టికెట్లు తీసుకుని లోపలికి వెళ్లి కూచున్నాం. ఇక్కడి జనం కట్టూ బొట్టూ వేరు. మేమిద్దరం వేరుపడినట్టు కన్పించాం. మరీ చిన్న క్లాసుకాదు. పెద్దక్లాసు కాదు. మధ్యస్తంగా వెళ్లాం"

"సినిమా మొదలైంది. ఇంటర్వెల్ అయింది. మళ్లీ మొదలయింది. పూర్తయింది. మాకిద్దరికీ ఒకముక్క అర్థంకాలేదు. కానీ సినిమాని ఎంజాయ్‌చేసాం. అప్పుడు తెలిసింది సినిమా అయినా డ్రామా అయినా షికారయినా ఏదైనా అనుభూతించి అనుభవాన్ని పంచుకోగల మనస్సు కావాలి అని"

"సినిమానుండి వచ్చి పడుకున్నాం"

"పూర్ణిమ త్వరగా నిద్రపోయింది. కానీ నాకు నిద్రపట్టలేదు. ఆమె ముఖం చూస్తూ అలాగే ఉండిపోయాను. ఆమె ముఖంలో ఎంత తృప్తి. ఎంత కళ! ఇన్నాళ్లలో ఊహా-ఇన్నేళ్లలో ఏనాడూ ఆమె ముఖంలో అంత ప్రశాంతత కన్పించలేదు"

"ఏ స్త్రీకయినా తనవాడు ఒకడు జతపడి, ఆత్మవిశ్వాసం కలిగించి, రక్షణ కల్పించి నీడగా నిలువగలిగితే ఆస్త్రీకి ఇహ లోకమే దేవలోకం అవుతుంది కాబోలు. అలాంటి భర్తకు ఆ ఇల్లాలు దేవతగా మారి ఇంటిని స్వర్గంగా మారుస్తుంది కాబోలనిపించింది ఆ క్షణంలో పూర్ణిమను చూస్తూంటే"

"స్త్రీ కోరుకునేది రక్షణ. ఆప్యాయత. భోగంకాదు భాగ్యంకాదని తెలుసుకున్న నేను పూర్ణిమ కోసం ఏమైనా చేయాలనిపించింది. ఆమె చుట్టూ కోటగోడలా నిలిచి, ఆమెకోసం మల్లె పందిరిలా నీడనిచ్చి, ఆమెకోసం ఎంత కష్టపడి అయినా సంపాదించాలి అనుకున్నాను"

"మా జీవితం ఇంత తృప్తిగా ఉండడానికి కారణం నువ్వు. నీకెలా కృతజ్ఞతలు తెలుపుకోగలం"

"ఎంత దూరాన ఉన్నా మమ్మల్ని చల్లగా దీవించే ఆ స్నేహ హృదయానికి, ఆ మంచి మనీషికి మరోసారి నమస్కరిస్తున్నాం"

జీవన్ తన సంతోషం, తన తృప్తిలో ముంచి పంపినట్లున్న ఆ అక్షరమాలికలు నాలో ఏనాడూ నేనెరగని ఆనందాన్ని సృష్టించాయి.

★ ★ ★

"జీవన్‌గారూ, జీవన్‌గారూ"

ఫ్యాక్టరీనుండి బయటకు వచ్చి తల వంచుకుని నడుస్తున్న జీవన్ ఆ పిలుపు విని తల పక్కకు తిప్పి చూశాడు.

"జీవన్‌గారూ" మరింత గట్టిగా అదే పిలుపు చప్పట్లమధ్య వెనక్కి తిరిగి చూసిన జీవన్‌కి రోడ్డుకు అవతలివైపు వంద గజాల దూరంలో ఆగి ఉన్నలారీ. దాని పక్కనే చేయి ఊపుతూ నడచివస్తున్న వ్యక్తి కనిపించారు.

కృష్ణారెడ్డి! వీడిక్కడకు ఎందుకొచ్చాడు అతణ్ణి చూడగానే జీవన్‌కి ఆశ్చర్యంతో మదిలో మెదిలిన ప్రశ్నది.

"ఏంటి జీవన్‌గారూ. పిలుస్తున్నా విన్పించుకోనంత పరధ్యానంలో ఉన్నారు" అన్నాడా వ్యక్తి దగ్గరగా వచ్చి.

జీవన్ పలకరింపుగా నవ్వుతూ "ఏంలే దులే" అని "బాగున్నావా" అనడిగాడు.

"ఆ ఆ" తలూపుతూ అని "ఈ ఊళ్లో ఉంటున్నావా" అడిగాడు కృష్ణారెడ్డి.

"కాదు" అని మరో ప్రశ్నకు తావివ్వకుండా "నువ్వేంటి ఇక్కడ ప్రత్యక్షమయ్యావు. రాయిపూర్ వెళ్తున్నావా" అడిగాడు జీవన్. మధ్యప్రదేశ్‌లోని రాయిపూర్ వెళ్ళే మార్గం అదేకావడంతో.

కృష్ణారెడ్డి ఇదివరకు నాగభూషణం లారీ మీద డ్రైవర్‌గా పనిచేశాడు. అప్పుడే అతడికి జీవన్‌తో పరిచయం. జీవన్ ఇక్కడకు రాక ముందే అతడు నాగభూషణంలో గొడవపడిఅదే ఊళ్లో మరొకరి దగ్గర చేరాడు. అందుకే అతణ్ణి అక్కడ చూడడం జీవన్‌కి ఆశ్చర్యమన్పించింది.

"లేదు. ఇక్కడికే. అదిగో. ఆ ఫ్యాక్టరీకే రా మెటీరియల్ తెచ్చాను" కొంచం ముందున్న ఫ్యాక్టరీని చూపిస్తూ చెప్పాడు కృష్ణారెడ్డి.

"ఆ ఫ్యాక్టరీకా" ఎంత అణచుకుందామనకున్నా కాస్తంత ఆశ్చర్యం ధ్వనించింది జీవన్ గొంతులో.

"అవును. ఏం"

"ఏం లేదులే"

"నువ్వక్కడ పనిచేస్తున్నావాయేంటీ" అనుమానంగా అడిగాడు కృష్ణారెడ్డి.

"ఉహూ... ఇక్కడ నాఫ్రెండొకడున్నాడు. వాడితో పనుండి వచ్చాను" అసలు విషయం చెప్పబోయి అంతలోనే తమాయించుకుని చక్కగా అబద్ధం చెప్పేసాడు. కాని కృష్ణారెడ్డి దాన్ని నమ్మినట్లనిపించలేదు జీవన్‌కి.

"పద టీ తాగుదాం" అంటూ కొంచెం దూరంలో హొటల్ ఉన్న చిన్న పాకవైపు దారితీసాడు జీవన్. అతణ్ణనుసరించాడు కృష్ణారెడ్డి.

"ఇంకా నయం. ఫ్యాక్టరీలో నుండి బయటకు వస్తుండగా చూశాడు కాదు" అనుకున్నాడు జీవన్ మనసులో.

హొటల్‌లోకెళ్లి కూర్చుని మంచినీళ్లు తాగాక "ఏమిటి జీవన్‌గారూ కబుర్లేమిటి" అనడిగాడు కృష్ణారెడ్డి.

"ఏమున్నాయి" అంటూ రెండు టీలకు ఆర్డరిచ్చాడు జీవన్.

"ఇప్పుడెక్కడుంటున్నావు"

"విజయవాడలో" అబద్ధంమీద అబద్ధం చెప్పక తప్పడంలేదు జీవన్‌కి.

"అవును నాగభూషణం చెల్లెల్ని లేవదీసుకుపోయావటగా" మోటారు ఫీల్డ్‌లోని సహజమైన మొరటుతనంతో అడిగాడు కృష్ణారెడ్డి.

చివుక్కుమంది జీవన్ మనసు. ఏం చెప్పాలో తేచక క్షణంపాటు ఊరుకుని, తర్వాత "మేము పెళ్లిచేసుకున్నాం" అన్నాడు.

అదేలే... తీసుకొచ్చేసి పెళ్లిచేసుకున్నావ్. అంతేనా" అని అదేదో పెద్దజోకయినట్లు పెద్దగా నవ్వేసాడు కృష్ణారెడ్డి. హొటల్లో వాళ్ళిద్దరు తప్పకస్టమర్స్ ఇంకెవరూ లేకపోయినా అతడి మాటలకు, జీవన్ చాలా ఇబ్బందిగా ఫీలయ్యాడు- వీడెక్కడ దాపురించాడని మనసులో విసుక్కుంటూ.

"ఆ అమ్మాయిని కూడా తీసుకొచ్చావా" మళ్లీ కృష్ణారెడ్డి ప్రశ్నల వర్షం.

"లేదు"

"విజయవాడలోనే ఉందా"

లేదన్నట్లు జీవన్ తల అడ్డంగా తలూపుతూ "ఇక్కడికి వస్తూ మా అమ్మవాళ్ల దగ్గర దింపివచ్చాను" అన్నాడు. ఈ ప్రశ్నల వరంవరకి జీవన్‌కు చికాకన్పించినా ఏమనలేక ఊరుకున్నాడు.

హొటలతను తెచ్చిచ్చిన టీ ఒక గుటకేసి "నాగభూషణం పొగరణగడానికి మంచి పనే చేసావులే. అతడికీమధ్య కళ్లు మరీ నెత్తికెక్కాయి. ఈ దెబ్బకి గిలగిలలాడిపోయుంటాడు. అని టీ మరొరెండు గుక్కలు తాగి అయన చేప్పేమాటల్లో ఏదీ నిజం ఉండదు. అన్నీ అబద్ధాలే. పనులు చేయించుకుని అవసరం తీరాక అందరికీ ఎగనామంబెట్టాడు. అలాంటోడికి మంచి శాస్తే చేసావులే" అన్నాడు గతంలో నాగభూషణంతో జరిగిన గొడవని గుర్తుచేసుకుని తనలోని కసిని వెళ్ళగక్కుతూ.

"వాళ్ల కబుర్లేమిటి. ఏమన్నా తెలుస్తున్నాయానీకు" అడిగాడు జీవన్.

"ఏమున్నాయి... ఆయన, ఆయన బాబాయి



మీకోసం చాలాచోట్ల వెతికారని వాళ్లూ వీళ్లూ చెప్పుకుంటుండగా విన్నాను. బయటకు కనబడడం లేదుగాని మీరిద్దరూ కలిసి వచ్చేసినందుకు లోపల లోపల పినుక్కుని చస్తున్నాడు. నీపేరు వింటేనే శివాలు తొక్కుతున్నాడని అతడి దగ్గరున్న క్లీనర్‌గాడు చెప్పాడు'' అన్నాడు కృష్ణారెడ్డి.

జీవన్ టీ డబ్బులిచ్చి బయటికొస్తూ ''బండి అన్‌లోడ్ చేసావా'' అనడిగాడు.

''లేదు... ఇప్పుడే వచ్చాను. లోడ్ దింపేసరికి ఏ తొమ్మిదో పదో అవుతుంది. రాత్రికి ఇక్కడే పడుకుని పొద్దున్నే వెళతాను'' చెప్పాడు కృష్ణారెడ్డి సిగరెట్ అంటించుకుంటూ.

''సరే... నే వెళతాను'' అన్నాడు జీవన్.

''బండి విజయవాడ వెళుతోంది. నువ్వొస్తావా. వచ్చేటట్లయితే మార్కెట్ దగ్గరుంటుంది బండి. అక్కడికిరా''

''రానులే... నేనొచ్చిన పనికాలేదు. ఇంకా రెండు మూడు రోజులుండాలని'' జీవన్ చెప్పడంతో ''ఉంటా''నని రెండడుగులు ముందుకు వేసిన కృష్ణారెడ్డి అంతలోనే వెనక్కి తిరిగి ''ఇదిగో జీవన్‌గారూ! ఎందుకైనా మంచిది. జాగ్రత్తగా ఉండండి. ఈ మధ్య నాగభూషణం విజయవాడ ఎక్కువగా వస్తున్నాడట'' అని ఓ ఉచిత సలహా పారేసి సాగిపోయాడు కృష్ణారెడ్డి.

హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నాడు జీవన్. కాని అతడి మూడ్ మారిపోయింది. ఒక్కసారిగా ఏదో దిగులు, చికాకు కమ్మేసాయి.

వీడికి నేనెక్కడే ఉంటున్నట్లు అనుమానం రాలేదుకదా. నేనెన్ని అబద్ధాలు చెప్పినా వీడి ద్వారా ఏదో ఒకవిధంగా మా ఉనికి నాగభూషణానికి తెలియకుండా ఉంటుందా. ఎవరికీ కనబడకూడదనుకుని ఆ రాష్ట్రంనుండే బయటపడి ఈ మూల బతుకుతున్నా ఈ దరిద్రుడు ఇక్కడకు రావడమేమిటి. నన్ను చూడడమేమిటి. ఈ పరిస్థితులు కాస్తంత ప్రశాంతంగా కూడా మమ్మల్ని బతకనియ్యవా. ఈ ఉద్రిక్తతలతో, ఇబ్బందుల్లో ఎంతకాలం ఇలా అందరి నుండి పారిపోతూ రహస్యంగా బతకాలి... ఎంతకాలం... ఎంతకాలం... ఒక సంవత్సరం, సంవత్సరంన్నర వరకు తప్పదేమో. ఈలోగా ఆమూర్ఖులు పరిస్థితులకు సర్దుబాటవుతారేమో... పరిపరి విధాలుగా ఆలోచిస్తూ ఇంటికి చేరుకున్నాడు.

మూడీగా ఉన్న జీవన్‌ని చూసి ''ఏమిటలా ఉన్నావని'' పూర్ణిమ అడిగింది. ఏం లేదన్నట్లు తలూపాడు. పూర్ణిమ మరేం మాట్లాడకుండా వెళ్లి ఉన్న కాసిన్ని పాలతో అరకప్పు కాఫీ కలిపి తెచ్చిచ్చింది. తాగి అతడిచ్చిన కప్పు అందుకుంటూ మళ్లీ అడిగింది ''ఎందుకలా డల్‌గా ఉన్నావు'' అని.

గట్టిగా నిట్టూర్చి అప్పుడు చెప్పాడు- కృష్ణారెడ్డి వచ్చిన విషయం. అతడితో జరిగిన సంభాషణ.

అది విన్న పూర్ణిమలో సన్నగా భయం, దిగులు ఆవరించాయి. ఆ తర్వాత ఇద్దరూ ఎక్కువగా మాట్లాడుకోలేదు. పూర్ణిమ అన్నం వండి ఏదో పచ్చడి చేసింది. ఇద్దరూ తిన్నామనిపించి పడుకున్నారు.

ఇక పూర్ణిమకు ఆ మౌనం భరించలేని భారంగా తోచింది.

''జీవన్'' అని పిలిచింది.

''ఊ''

''ఏమిటాలోచిస్తున్నావు''

''ఏంలేదు''

''ఎందుకు నాదగ్గర దాస్తావు నీవాలోచించేదేమిటో నాకు తెలును''

''... ...''

మనం ఇక్కడున్న సంగతి అదే నీవిక్కడ కలిసిన విషయం కృష్ణారెడ్డి మావాళ్లకి చెబుతాడేమోనని కదూ''

''... ...''

''మాట్లాడవేం జీవన్''

''అవును''

''అన్నయ్యతో గొడవపడి మానేసినవాడు వెళ్లి అన్నయ్యకీవిషయం చెబుతాడంటావా?''

''ఏమో అయినా దానికీ దీనికి ఏం సంబంధం. మనం వచ్చేసిన సంగతి, దాని మీద మీ అన్నయ్య ప్రచారం గురించి తెలిసిందేగా. మన విషయం పది మందికీ తెలిసింది కనక కృష్ణారెడ్డి వెళ్ళి మీవాడితో చెప్పక





పోయినా వీడు ఎవరో ఒకరిదగ్గర అనక మానడు. అది అలాఅలా పాకి మీవాడికి చేరక తప్పదు''

''నిజమే'' ఇంకేం మాట్లాడాలో తెలియక మౌనంవహించింది పూర్ణిమ.

''పూర్ణిమా'' ఆమెవైపు తిరుగుతూ పిలిచాడు జీవన్. ''ఏం చేద్దాం'' అన్నాడు.

''ఏంచేద్దాం'' అంతా అయోమయంగా అడిగింది.

క్షణం తర్వాత ''ఇక్కడనుండి వెళ్ళిపోదామా'' నెమ్మదిగా అన్నాడు.

''ఎక్కడికి?'' జీవన్ మౌనంవహించాడు. ఆ ప్రశ్నకు అతడివద్ద సమాధానంలేదు.

''ఎక్కడికని వెళతాం జీవన్'

''అదే ఆలోచిస్తున్నాను''

మళ్లీ ఇద్దరిమధ్య పరచుకున్న మౌనం.

''ఆ జైలు జీవితంనుండి బయటపడి మనదైన జీవితంలో ప్రశాంతగా బతుకుతుంటే మళ్ళీ ఇదేమిటి జీవన్. మనఖర్మకాలి కాకపోతే కృష్ణారెడ్డి ఇక్కడికే, మీ కంపెనీకే రావాలా వచ్చినా నువ్వతడికి కనబడాలా'' బేలగా అంది పూర్ణిమ.

''జీవితం మనల్ని మొదటినుండి ఏదో ఒకరకంగా తరుముతూనే ఉంది పూర్ణిమా. తట్టుకుని నిలదొక్కుకోవాలని ప్రయత్నిస్తున్నకొద్దీ కుంగదీస్తోంది'' నిట్టూరుస్తూ అన్నాడు.

కృష్ణారెడ్డికి తానెన్ని అబద్ధాలు చెప్పినా తాను అతడికి ఇక్కడ కలిసిన సంగతి నాగభూషణానికి తెలిస్తే అతడు తమ ఉనికిని పసికట్టడమేకాక ఏదో ఒక విధంగా దెబ్బతీయకుండా ఊరుకోడనే భయం ఆమాటల్లో ధ్వనించింది.

''మనగురించి అన్నయ్య తెలుసుకోగలిగినా ఇన్నాళ్ల తర్వాత ఏం చేయగలడు జీవన్. మనం పెళ్లిచేసుకున్నాం. అందుకు ఆధారాలు కూడా ఉన్నాయి. నేను మైనర్నికూడా కాను'' కాస్త ధైర్యాన్ని ప్రదర్శిస్తూ అంది పూర్ణిమ.

''ఏమున్నా ఏమైనా కాకపోయినా మీవాడు ఏదైనా చేయదలచుకుంటే అవేవీ అడ్డుకావు. వాడి సంగతి నాకు బాగా తెలుసు. చిన్నప్పటి నుండి స్నేహితులం. ఎన్నోఏళ్లు వాడి మంచిని చెడుని సమానంగా పంచుకున్న నన్నే మన విషయంలో అవమానించి ఒకరికొకర్ని దూరంచేసినవాడు. మనం వచ్చేసి కలిసి జీవించడాన్ని ఎలా సహిస్తాడు. వాడికి తనపంతం నెగ్గించుకోవడం ముఖ్యంకాని మనప్రేమ ముఖ్యంకాదు''

''నువ్వన్నది నిజమే. అన్నయ్య మొండితనానికి, మొరటు మనసుకు అందని సున్నితమైన విషయమది'' సాలోచనగా అంది పూర్ణిమ.

చాలసేపు ఎవరి ఆలోచనలో వాళ్లుండిపోయారు.

లోకమంతా పరుచుకున్న పండువెన్నెల. తలుపులేని కిటికీనుండి ఆ చీకటి గదిలోకి జాలిజాలిగా తొంగిచూస్తోంది. పిలవని ఆహ్వానాన్ని అందుకుని ఆ కిటికీ గుండానే అడుగుపెట్టిన చలిగాలి సన్నసన్నగా దేహాల్ని తడుముతూ వణుకు పుట్టిస్తోంది.

పూర్ణిమ జీవన్‌కి మరింత దగ్గరగా జరిగి అతడి ఛాతీపై తల ఆనించి చేత్తో అతడి జుట్టు చెరుపుతూ ''జీవన్ జరిగేదేదో జరగక మానదు. ఆలోచించి మనసు పాడుచేసుకోవడం మినహా మనకు మిగిలేదేముంది. ఏం ఆలోచించకు. భారమంతా ఆ దేవుడిపై వేసి ఊరుకుందాం. అంతకంటే ఏం చేయగలం'' అంది కొంత నిస్సహాయత, కొంత లాలన మిళితమైన స్వరంతో.

''హు... దేవుడు చాలా ఖరీదైనవాడు పూర్ణిమా. ఖరీదైన గుడులలో కూర్చుని ఖరీదైన మనుషుల ఖరీదైన కోర్కెల్నెలా తీర్చాలా అని అన్నిటికంటే ఖరీదైన ఆలోచనలతో ఉంటాడు. సామాన్యుల బతుకుల్లోని ఆలాపనలు, ఆవేదనలు, ఆ ఖరీదైన భగవంతుడికి విన్పించవు'' అన్నాడు గదిలో పరచుకున్న చీకటిలో ఎటు ప్రసరిస్తున్నాయో తనకే తెలియని చూపుల్ని మరల్చకుండా.

''అలా అనకు జీవన్. మన ప్రయత్నంలో లేనిదానికోసం దైవత్వాన్ని నమ్ముకోక ఏం చేయగలం''

''అలా అనుకోవడమే మన పిచ్చితనం. లొంగినకొద్దీ లొంగదీసుకుని నిస్సహాయతలలో పడదోసి నరాలు తెగేంతగా పడీపడీ నవ్వు

కుంటారీదేవుళ్లు. పగిలిన బతుకుల్లో రగిలిన చితినిచూపి కర్మంటూ చెప్పి భయపెట్టి భయంకరంగా ఆడుకుంటారు. మన నమ్మకంతోనే మన నరాలను మెలిపెట్టి కనుగుడ్లు పెరికి మనం చూడలేని వెలుగులో నిలిచి పరిహసిస్తారు. నిస్సహాయతనుండి నవ్వుని పైశాచిక ఆనందాన్ని పిండుకుని కర్మవధ్యశిలపై కఠినంగా నరికేసే ఆదైవత్వం మంటకలవనా'' ఆవేశంగా అన్నాడు.

''మనం ప్రయత్నించీ నివారించలేకపోయినప్పుడు కనీసం పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కోవడానికి, తట్టుకోవడానికి తగిన స్థైర్యాన్నిచ్చేదైనప్పుడు దైవత్వాన్ని నమ్ముకోవడం తప్పుకాదు జీవన్. నువ్వు అనవసరంగా ఆవేశపడుతూ దేవుణ్ణి నిందిస్తున్నావు''

''అదే పూర్ణిమా అదే! మన బలహీనత... కనుపించని, ఉన్నదో లేదో తెలియని ఇక నిరాకారాన్ని సాకారంగా ఊహించుకుంటూ సాగిలపడి బానిసలం కావడంలోని మొదటి దశ అదే'' అన్నాడు జీవన్.

పూర్ణిమ ఏం మాట్లాడలేదు.

ఒక నిమిషం తర్వాత మళ్లీ తనే అన్నాడు ''ఆ భగవంతుడనేవాడు నా ఎదురుగా నిలిస్తే కసితీరా పొడిచి చంపేస్తాను. సామాన్యమైన వాటికి కూడా దూరంచేసి మనల్ని ఈ స్థితికి ఈడ్చినందుకు''

పూర్ణిమ అతడి పెదవులపై తన వేలుంచి ఆ మాటలకు అడ్డుకట్టవేసింది.

గుండె బలహీనమై బతుకుతీపిబరువుగాక ముంకుంటే నమ్మక ఏం చేస్తారనే ధీమా దేవుళ్లకి. జీవితం సర్వనాశనమైన స్థితిలో నమ్మినవాళ్లలో అనమ్మకమే భళ్లున పగిలిననాడు... జీవన్ మనసు ఇంకా అదే ఆలోచనలో ఉంది.

''పోనీ జీవన్. దేవుడు కాకపోతే కాలాన్ని నమ్ముకుందాం. మనం మనంగా హాయిగా తృప్తిగా బతుకుగడిపే రోజుల్ని మున్ముందైనా ప్రసాదిస్తుందని ఆశిద్దాం. మనం తప్పించుకోవాలనుకున్నప్రతిదీ తప్పనిదై ఎదురు నిలిచి దాన్ని ఆహ్వానించేలా చేస్తున్నప్పుడు ఏదో ఒక నమ్మకాన్ని ఆసరాగా చేసుకోక తప్పదుగా''

పూర్ణిమ అంది. ఇక ఇటువంటి సంభాషణకు, అతడి ఆలోచనలకు ఇక తెరదించుతాం అన్నట్టుగా.

జీవన్ బదులుగా ఏమీ అనకుండా మౌనం వహించాడు.

చలిగాలి ఇంకాస్త ముదిరింది. గాలి తెమ్మెరలు వినురుతున్న ఆ చల్లదనానికి పూర్ణిమ మరింత గట్టిగా భర్తలోకి ముడుచుకుంది. జీవన్ పొదివిపట్టుకున్నట్లుగా పూర్ణిమమీద ఒక చేయివేసి అదిమిపట్టి ఆమె కురులలో మోము దాచుకున్నాడు. ఆమె మెడమీద అతని వెచ్చటి ఊపిరి పవనాలు.

ఇద్దరూ మౌనంగానే ఉన్నా ఇందాకటివరకు ఉన్న భావం ఏదో తొలగిపోయిన హాయి; ప్రశాంతత- ఇద్దరిలో.

ఎంతోసేపటి తర్వాత తమ ఇద్దరిమధ్య పరచుకున్న మౌనగానాన్ని భగ్నంచేస్తూ అంది పూర్ణిమ- ''ఇటువంటి క్షణాలకోసం ఊహ తెలిసిననాటినుండి ఎంతగా తపించానని జీవన్. ఈ మధురిమకోసం, ఈ ప్రేమ, అనురాగం, లాలన, ఆత్మీయతకోసం ఎంతగా పొగిలిపోయానని. ఈక్షణాలు నానిలువెల్లా సంగీతాన్ని వొలికిస్తున్నాయి. ఆనంద తరంగాల్ని పొంగిస్తున్నాయి. ఇవి ఓగుప్పెడుచాలు. ఇవి ప్రసాదిస్తున్న హృదయం చాలు ఇంకెంత బాధనైనా మోయడానికి.

అతడిలోనూ అదేభావన. దాన్ని మాటలుగా మార్చిన పూర్ణిమను ఇంకాస్త తనలోకి హత్తుకున్నాడు.

''ఎంతవేదన కమ్ముకున్నా నాకు దూరమవవుకదూ'' అంతటి హృదయానందహేలలోను లీలగా కదలాడే భయం వీచిక.

''ఊహూ... దూరమవడానికా ఈ చేయినందిపుచ్చుకుంది'' చేతిలో చేయికలిపి మృదువుగా నొక్కుతూ మెడకింద పెదవులానిన స్పర్శ ఇచ్చిన అభయం.

... ... ...

... ... ...

రాత్రి సాక్షీభూతంగా ఊపిరిలో ఊపిరి లయించి నిదురతల్లి వొడిలోకి వొదిగిపోయారు.

★ ★ ★

ఎంత కాదనుకున్నా జీవన్ మనసును శంక పీడిస్తూనేఉంది. నేనిక్కడ కలిసిన సంగతి కృష్ణారెడ్డి ఎవరితోనూ చెప్పకుండా ఊరుకుంటాడా? నేను విజయవాడలో ఉంటున్నానని అతడికి అబద్ధం చెప్పినా అసలు విషయం నాగభూషణం పసికట్టి ఇక్కడకు రాకుండా ఉంటాడా. వచ్చినా ఏదో అల్లరి చేసి, గొడవపడినా ఫర్వాలేదు. కాని అంతకంటే ఎక్కువైన పన్నాగం పన్నకుండా ఊరుకుంటాడా. ఎంత మేం పెళ్లిచేసుకున్నా మమ్మల్ని విడదీయకుండా ఊరుకుంటాడా? ఏం! చేయాలి? ఇక్కడనుండి ఎక్కడికెళ్లాలి? ఎక్కడి కెళ్లినా ఉన్న ఈ కాసింత ఆధారాన్ని పోగొట్టుకుని ఎలా బతకడం?!

జీవితం ఎందుకిలా వేధిస్తోంది? ఒక సమస్యనుండి బయటపడి ఊపిరి పీల్చుకునేలోగానే మరొక సమస్య ఎందుకు చుట్టుముడుతోంది? ఇలా మాకే జరుగుతోందా? అందరికీనా?!

దాదాపు నాలుగు నెలలు కావస్తోందిగా. ఇప్పుడు మా గురించి తెలిసినా నాగభూషణం ఏం చేయగలడులే... ఇట్లా అనుకోవడం భ్రమే అవుతుందేమో. ఆ భ్రమకూడా నిశ్చింత ఇవ్వదే. ఏమైనా, ఏం జరిగినా ముందో పదిహేనురోజులు ఇక్కడ లేకుండా ఉంటే తర్వాతీవిషయం తర్వాత ఆలోచించుకోవచ్చు. కాని ఎక్కడికి వెళ్ళాలి. చీరాలా? ఏలూరా? ఆ రెండు చోట్లకు నాగభూషణం ఇదివరకే వచ్చి వాకబుచేసి ఉంటాడు. అయినా మళ్లీరాకుండా ఉంటాడా? ఏమో? ఆ రెండూ కాక ఇంకెక్కడికి వెళ్లగలం. ఏలూరే వెళితే... అమ్మా నాన్న దగ్గరకెళితే... ఉహూ... చీరాల వెళితే.

లాభంలేదు. ఇలా ఆలోచిస్తుంటే ఏదీ తెగదు. పరిస్థితుల్ని ఎదుర్కోవడానికి సిద్ధపడాలి. తెగించాలి. లేదా వాటిని తప్పించడానికి ప్రయత్నం చేయాలి. ముందు డబ్బులు చూసుకుని కొంతకాలం ఇక్కడనుండి తప్పుకోవాలి. జీతాలందడానికి ఇంకా ఎనిమిది రోజులుంది. ఈలోగా మేం వస్తున్నట్లు చీరాలకు ఉత్తరం రాయాలి. అతడి నుండి ఉత్తరం వచ్చి చాలా రోజులయింది. అక్కడికీ రాయాలి... నాగభూషణం గ్యాంగ్ ఏం చేస్తోందో తెలియదు.

క్యాంటీన్‌లో కూర్చుని సిగరెట్ పీలుస్తూ ఎడతెగని ఆలోచనల్లో కొట్టుకుపోతున్న జీవన్‌ని ఫ్యాక్టరీ సైరన్ ఈలోకంలోకి పడవేసింది.

ఆరోజు సాయంత్రమే డ్యూటీనుండి వచ్చాక రాయదల్చుకున్న ఇద్దరు మిత్రులకీ ఉత్తరాలు రాసి పోస్టుచేశాడు.



ఆఫీసునుండి వచ్చి బట్టలు మార్చుకుని నాగది ముందున్న చిన్న కారిడార్‌లో కుర్చీవేసుకుని కూర్చుని వేడివేడి కాఫీ సిప్‌చేస్తూ రిలాక్స్ అవుతున్నాను.

పడమట దిక్కున పరచుకున్న సింధూరపు చేలు. వాటి మీదుగా ఊగుతూ, తూగుతూ హొయలు పోతూసాగుతున్న మబ్బుతునకలు వాటికి ఆవలగా అల్లంత దూరాన ఉన్న జంట కొండమీదనుండి బారులు బారులుగా మెలికలు తిరుగుతూ- దిగివస్తున్న గొర్రెల మంద. కొండల మధ్యగా కాస్త కాస్తగా జారుతూ పశ్చిమ లోకాల మేలుకొలుపుకు పయనమై సాగుతున్న సూరీడు.

అలల తెరలవుతూ అల్లనల్లన నడచివస్తూ మేనిని మృదువుగా స్పృశిస్తూ హాయిని చిలకరించి ఎటో తరలిపోతున్న సాయంసందెల గాలి తరగలు. వాటి తాకిడికి మెల్లమెల్లగా తలలూయిస్తూ ఆకుల కురులను విరబోసుకున్న కొబ్బరి చెట్లు.

అడపాదడపా గుంపులుగుంపులుగా గూళ్లకు తిరిగివస్తున్న పక్షులు బారులు.

ఈ నగరాల్లోనూ సాయంత్రాలు అప్పుడప్పుడూ అందంగానే ఉంటాయనడానికి రుజువుగా నిలిచిన ఆవేళలో తేలికైన మనసుతో ఆ

అందాల్ని ఆస్వాదిస్తున్నాను.

అమ్మ పిలుపుతో ఆ సాయంసంధ్యానుభూతినుండి, ఆమూడ్‌నుండి బయటకు వచ్చాను.

కాఫీ కప్పు తీసుకుని "ఏమిటమ్మా" అంటూ గదిలోకి అడుగుపెడుతుండగా అమ్మే ఎదురువచ్చింది. ఆమె ముఖంలో ఆదుర్దా.

ఎందుకలా ఉన్నావని నేనడగబోయేలోపు తనే చెప్పింది. "పోలీసులురా... పోలీసులొచ్చారు నీకోసం"

ఆశ్చర్యపోయాను... నాకోసం పోలీసులు రావడమేమిటి? అదే అమ్మనడిగాను.

"ఏమో మరి... నాకూ అర్థంకావడంలేదు. నువ్వున్నావా అనడిగారు. ఉన్నావన్నాను. పిలవమన్నారు. దేనికని అడిగితే చెప్పలేదు" అంది కంగారు, భయంతో.

ఆశ్చర్యంనుండి తేరుకోలేకపోయినా సర్దుకుంటూ పద అని వరండాలోకి దారితీశాను. నా వెనకే అమ్మ వచ్చింది.

వరండాలో ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్, ఇద్దరు పోలీసులు ఉన్నారు. నన్ను చూసి పేరడుగుతూ "మీరేనా" అన్నాడు ఇన్‌స్పెక్టర్... అవునన్నట్లు తలూపాను.

"మీరు పోలీస్ స్టేషన్‌కి రావాలి" అన్నాడు.

"ఎందుకు"

"ఆ విషయం తర్వాత చెబుతాం. మీరు మాతోపాటు రావాలి"

నాలో ఆశ్చర్యం రెట్టింపయింది. ఎందుకు, ఎందుకు అనే మనసులోని ప్రశ్నకు సమాధానం లేదు.

"ఒక్క నిమిషం. బట్టలు మార్చుకుని వస్తాను" అని చెప్పి వెనుదిరగబోయాను.

"జస్ట్ ఎ మినిట్. మీ ఇల్లు సోదాచేయాలి"

"దేనికి"

"అన్ని విషయాలు స్టేషన్లో తెలుస్తాయి మీకు. ఇదిగో సెర్చివారంట్. సోదాచేయడానికి" అని నేనడగకుండానే వారంట్ చూపించాడు ఇన్‌స్పెక్టర్.

అది చదివి "ఇన్‌స్పెక్టర్. ఏమిటిదంతా నన్ను పోలీస్ స్టేషన్‌కి రమ్మనడానికి, ఇల్లు సోదాచేయడానికి వారంట్‌తో రావడానికి కారణమేమిటి? నా అఫెన్స్ ఏమిటి?" కాస్త గట్టిగా అన్నాను.

"చెప్పాను కదండి అదే విషయం మళ్లీ ఎన్నిసార్లు చెప్పాలి. టైంవేస్ట్‌చేయొద్దు. కమాన్ షో అజ్‌యువర్ రూమ్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అతణ్ణి తేరిపార చూసి "రండి" అని నా గదిలోకి దారితీశాను. నా వెనకనే వచ్చిన ఇన్‌స్పెక్టర్, పోలీసులు గదంతా క్షుణ్ణంగా సోదాచేశారు. పుస్తకాలు, బట్టలు, క్యాసెట్లు- ఒకటేమిటి. అన్నీ-చిన్న కాగితం ముక్కకూడా వదలిపెట్టలేదు.

తర్వాత హాలు, అన్నయ్యవాళ్ల బెడ్‌రూం, మిగిలిన గదులు తనిఖీ చేశారు. కాని వాళ్లకి కావల్సింది ఏదీ దొరకలేదు.

అరగంట తర్వాత ఇన్‌స్పెక్టర్ పెదవి విరుస్తూ బయటకు నడిచాడు. పోలీసులు అతణ్ణి అనుసరించారు.

అంతసేపు విషయం ఏమిటో తెలియని అయోమయంలో కొట్టుమిట్టాడాను. అమ్మ ఆదుర్దా, భయం ఇంతని చెప్పలేను. వాళ్లు సోదా చేస్తుండగా అమ్మ నన్ను పక్కకు పిలిచి "ఏమిటిరా ఇది. వాళ్లు వెతికేది దేనికోసం" అనడిగింది. నాకూ తెలియదని తనకి తెలిసినా.

"ఏమోనమ్మా నాకు మాత్రం ఏం తెలుసు" అన్నాను.

ఇన్‌స్పెక్టర్ జీపుదగ్గరకు వెళ్లబోతూ ఆగి "రండి" అన్నాడు.

"అమ్మా నువ్వు కంగారుపడకు. అన్నయ్య రాగానే ఆ విషయం చెప్పేవు. వద్దు వాడు ఖంగుతిని మరీ అల్లరి చేసేస్తాడు. వాడికి నేనొచ్చి చెబుతాలే" అని భయంభయంగా చూస్తున్న అమ్మకు చెప్పి నేను జీపు ఎక్కాను.

చుట్టు పక్కలి ఇళ్లనుండి కొన్ని జతల కళ్లు నన్ను పరికించడాన్ని కనిపెట్టక పోలేదు నేను.

పోలీస్‌స్టేషన్‌కి చేరుకుని లోపలికి వెళ్లగానే ఇన్‌స్పెక్టర్ జీవన్ పూర్ణిమల గురించి అడిగాడు. "ఏమయ్యారు వాళ్లు ఎక్కడికి వెళ్లారు?"

నాకు తెలియదని చెప్పాను.

వాళ్లకు నాకు ఉన్న స్నేహం. వాళ్లు నాకు పరిచయమైననాటినుండి ఇద్దరూ కలిసి వెళ్లిపోయేవరకు జరిగిన వాటిగురించి గుచ్చిగు

చ్చి ప్రశ్నించాడు. నేను ఎందుకిలా ప్రశ్నిస్తున్నారు విషయం ఏమిటని అడిగితే అప్పుడు చెప్పాడు.

మైనారిటీ తీరని తన చెల్లెలు పూర్ణిమను ప్రలోభపరచి బలవంతంగా తన వెంట తీసుకుపోయాడని, ఇంట్లోనుండి పదివేల రూపాయల నగదు, ఐదు తులాల బంగారం దొంగిలించుకుని పోయాడని నాగభూషణం జీవన్ మీద థెఫ్ట్ అండ్ కిడ్నాపింగ్ కేసుపెట్టాడు. తన చెల్లెలికి మానసిక అస్వస్థత ఉందని కూడా ఫిర్యాదులో చెప్పాడట. ఇందులో నా హస్తం ఉందని, నేను వాళ్లు వెళ్లడానికి ఉద్దేశపూర్వకంగా సహకరించానని ఫిర్యాదుచేస్తూ ఈ కేసులో అనుమానితుడిగా నా పేరు చేర్చాడట.

జీవన్, పూర్ణిమ వెళ్లిపోయి మూడు నెలలు దాటాక ఇప్పుడు కేసు పెట్టాడేమిటి? ఇప్పటిదాకా ఎందుకు ఊరుకున్నాడు అనుకున్నాను మనసులో. అదే ఇన్‌స్పెక్టర్‌తో అన్నాను. "అది మేం చూసుకుంటాం. ఇటీజ్ నాట్ యువర్ వర్రీ. మీకు తెలిసింది మీరు చెప్పండి" అన్నాడతడు.

నాగభూషణం చెప్పినవన్నీ అబద్ధాలని, పూర్ణిమకు మైనారిటీ తీరిందని, ఆమె కె లాంటి మానసిక అస్వస్థత లేదని, వాళ్లు వెళ్ళిన విషయం నాకు కరుణాకర్ వచ్చి చెప్పేవరకు తెలియదని, వాళ్లు వెళ్లడానికి నేనేం సహకరించలేదని, దొంగతనం కూడా అబద్ధమని, నాకు తెలిసిందంతా- అందరికీ చెప్పిందే - చెప్పి అంతకుమించి నాకేం తెలియదన్నాను.

మైనారిటీ తీరలేదనే స్కూలు సర్టిఫికేట్ మానసిక అనారోగ్యానికి చికిత్సకోసం రాసిన మందులచీటి అంటూ సబ్‌ఇన్‌స్పెక్టర్ కొన్ని కాగితాలు చూపించాడు. "ఇప్పుడేమంటారు" అనడిగాడు.

అంటే... అంటే... జీవన్, పూర్ణిమల కోసం వెతికి వెతికి ఎక్కడా ఆచూకీ తెలియకపోవడంతో కేసు పెట్టడమేకాక అందుకు తగిన బలమైన సాక్ష్యాల్ని కూడా సంపాదించుకున్నాడన్నమాట ఈమధ్యకాలంలో.

"అబద్ధం... అంతా అబద్ధం... అది దొంగ సర్టిఫికెట్ దొంగ ప్రిస్క్రిప్షన్" అన్నాను కాస్త గట్టిగా.

"ష్... ఇవి దొంగవో కాదో మేం తెల్చుకుంటాం మీరు మేమడిగిన వాటికి వివరాలు చెప్పండి" అంటూ అడిగినదాన్నే మార్చిమార్చి ఒకటికి నాలుగుసార్లు అడిగాడు. కొన్నిసార్లు బెదిరించాడుకూడా. ఇన్‌స్పెక్టర్ ఎన్ని మెలికలు పెట్టి ప్రశ్నించినా, బెదిరించినా నేను చెప్పే జవాబుల్లో మార్పులేకపోయింది. చెప్పిందే మళ్లీ మళ్లీ చెప్పాను. అంతకుమించి నాకేం తెలియదన్నాను.

"వాళ్లెక్కడికి వెళ్లిందీ, ఎక్కడ ఉన్నదీ తెలియదా? ఉత్తరాలు రాయలేదా" అనడిగాడు.

"తెలియదు... రాయలేదు" అని చెప్పాను.

ఇంతలో ఫోన్ మోగింది. రిసీవర్ ఎత్తి ఇన్‌స్పెక్టర్ "హలో" అన్నాడు. అటువైపు నుండి ఎవరు మాట్లాడుతున్నారో ఏమో, ఆ వ్యక్తి ఎదురుగా లేకపోయినా మనిషి అటెన్షన్ అయిపోయాడు కుర్చీలోనే. మధ్యమధ్యలో "యస్ సర్", "అవును సర్", "ఇక్కడే ఉన్నాడు సర్", "అలాగే సర్" "ఇప్పుడే సర్" అంటూ అటువైపునుండి చెప్తున్నది విని రిసీవర్ పెట్టేశాడు.

తర్వాత పదిక్షణాలపాటు నిశితంగా నన్ను చూస్తూ "మిస్టర్... మీరు వెళ్లవచ్చు. కాని వాళ్ల గురించి ఏ సమాచారం తెల్సినా, ఉత్తరాలు వచ్చినా వెంటనే మాకు తెలియజేయండి" అని హెచ్చరికగా అన్నాడు.

నేను "అలాగే" అని వచ్చేశాను.

ఇంటికి రాగానే అమ్మ, బాబాయి, పిన్ని అక్క, బావ, అన్నయ్య అందరూ కనిపించారు. తలో వక్క నాతల వాచేలా చీవాట్లు పెట్టారు, "ఈ విషయంలో నీ వెందుకు తల దూర్చావంటూ. ఆవెధవలతో నీకు స్నేహమేమిటి? వాళ్లెవరు, నీవెవరు. దగుల్బాజీలను దరిచేరదీస్తే ఇంతే" అని.

అందరూ కాకపోయినా అందులో కొందరు గతంలో కూడా ఈ విధంగా చివాట్లు పెట్టినవాళ్లే.

అప్పుడే తెల్సిందినాకు- నన్ను పోలీసులు తీసికెళ్లగానే అమ్మ పిన్ని బాబాయికి; అక్కా బావలకు కబురుచేసింది. బావ రాజకీయంగా

ను, పోలీసు డిపార్ట్‌మెంటులోను పలుకుబడిగలవాడు కావడంతో ఆయన ఎస్.పి.కి ఫోన్‌చేసి నా గురించి చెప్పాడు. ఆ ఎస్.పి. నన్ను తీసికెళ్ళిన ఎస్.ఐకి ఫోన్‌చేసి వదలి పెట్టమని చెప్పడంతో వెంటనే నన్ను పంపించివేశాడని.

బావ- "భయపడాల్సిందేమీ లేదు. మళ్ళీ పోలీసులొచ్చినా, చిల్లర తనంగా వీళ్ళేమైనా గొడవచేసినా నాకు కబురుచేయండి. నేను చూసుకుంటానని" అమ్మతో, అన్నయ్యతో, నాతో చెప్పాడు.

అందరూ వెళ్ళిపోగానే అన్నయ్య మళ్ళీ అంతెత్తెగిరాడు నామీద. "నెత్తీ నోరు కొట్టుకు చెప్పాను. వాళ్ళతో స్నేహం చెయ్యొద్దని, తిరగొద్దని, వింటేనా" అంటూ.

నేనేం మాట్లాకుండా తల వంచుకుని నా గదిలోకి వెళ్ళిపోయాను.

ఆ తర్వాత నాకు తెలిసిందేమిటంటే నాగభూషణం, వాళ్ళ బాబాయి వాళ్ళూళ్లో పూర్ణిమ చదివిన హైస్కూలునుండి దొంగ సర్టిఫికెటు, డబ్బు ఎరచూపి ఒక డాక్టరు నుండి దొంగ ట్రీట్‌మెంట్ రుజువులు సంపాదించారని; ఒక ఛోటానాయకుణ్ణి పట్టుకుని పోలీస్‌ఇన్‌స్పెక్టర్ని కూడా ఇన్‌ఫ్లూయెన్స్ చేయించారని.

ఈ గొడవంతా జీవన్‌కిరాయాలా వద్దా. రాస్తే వాళ్ళు బెంబేలుపడతారేమో. రాయకపోతే వాళ్ళే మాత్రం అజాగ్రత్తగా ఉన్నా ఇబ్బందవుతుంది. ఏం చేద్దామా అనే సందిగ్ధంలో పడిపోయి మూడు నాలుగురోజులు ఉత్తరం రాయలేదు.

★ ★ ★

కృష్ణారెడ్డి కలిసాడని, తనలోని భయాందోళనల్ని వ్యక్తంచేస్తూ జీవన్ రాసిన ఉత్తరంఅందాల్సినదానికంటే నాలుగు రోజులు ఆలస్యంగా అందింది నాకు. ఆ ఉత్తరం చూశాక కృష్ణారెడ్డి జీవన్ కలిసినట్లు ఎవరితోనైనా చెప్పాడేమో. నాగభూషణానికి ఆ విషయం తెలిసిందేమో కనుక్కోవడంకోసం ఆ అన్నదమ్ముల సర్కిల్‌లో నాకు తెలిసిన వాళ్ళని కదిపిచూశాను. జీవన్ కనబడ్డాడని కృష్ణారెడ్డి ఒకరిద్దరితో అన్నట్లు తెలిసింది. కాని నాగభూషణం చెవిని అది పడిందో లేదో తెలియలేదు. అతడు వాళ్ళూరు వెళ్ళాడట. ఈ మధ్య ఎక్కువగా అక్కడికి వెళ్ళివస్తున్న విషయం తెలిసిందే కనుక నేను దాన్ని అంతగా పట్టించుకోలేదు.

ఈ విషయంతోపాటు నాగభూషణం పోలీసు కేసు పెట్టడం, పోలీసులు నన్ను తీసికెళ్ళి ప్రశ్నించడం అంతా వివరంగా రాస్తూ నాగభూషణం మీ ఆచూకీ కోసం ఇంకా తీవ్రంగా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. నామనసేదో కీడును శంకిస్తోంది. మీరు ఏ మాత్రం ఏమరుపాటుగా ఉండక, ఇంకొంతకాలమైనా మీ ఉనికి ఎవరికీ తెలియనీయకుండా జాగ్రత్తపడండని జీవన్‌కి ఉత్తరం రాశాను.

కాని, విధి మనుషులకంటే చాలా తెలివైంది. బలీయమైంది. మనిషి అనుకున్నాదాన్ని తారుమారు చేసి అడుగడుగునా దెబ్బతీసి అతడు బాధతో అల్లాడిపోతుంటే పగలబడి నవ్వుకోవడం దాని సరదా. మనిషి తనమీద ఎన్నటికీ ఆధిపత్యం వహించజాలడని సవాలు చేస్తూ పదేపదే దాన్ని రుజువుచేస్తుంటుంది. ఇప్పుడూ అలాగే రుజువుచేసింది.

జీవన్‌కి నా ఉత్తరం అందలేదు. అది రాయగఢ్ చేరకముందే చాలా సంఘటనలు చకచకా జరిగిపోయాయి.

జీవన్ భయపడ్డట్టే, అతడు రాయగఢ్‌లో కనిపించిన విషయం నాగభూషణం చెవినపడింది. అతడాసంగతి పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కి చెప్పాడు. ఆయన ఇక పోలీసు బృందాన్ని నాగభూషణంతోపాటు పంపించాడు. వాళ్ళు రాయగఢ్ వెళ్లి అక్కడి పోలీసుల సహకారంతో జీవన్, పూర్ణిమల ఆచూకీ సులువుగానే తెలుసుకుని, వాళ్లని పట్టుకుని వెంటనే ఇక్కడకు తీసుకొచ్చారు.

ఆకర్షించకుండా, ఆకర్షింపబడకుండా, ప్రేమించబడకుండా, ప్రేమను పంచివ్వకుండా గడచిపోయే బతుకులు నిజంగా నిరర్థకాలే. గుండెల నిండుగా అభిమానం నింపుకుని తన దోసిలిలోకి మోము తీసుకుని గుండెలకు హత్తుకునే భాగ్యం ఆ హృదయాలకు ఎలాగూ ఉండదు. అవన్నీ ఉండి బతుకు సార్థకం చేసుకోబోయేవాళ్ళకేమో కాలం ఇలా...

ఇది ప్రారబ్ధం అనుకోవాలా? విధి అనుకోవాలా నాగభూషణంలోని పంతం, కసి

సాధించిన విజయం అనుకోవాలా?

★ ★ ★

జీవన్, పూర్ణిమలను అరెస్టుచేసి ఇక్కడకు తీసుకొచ్చిన విషయం తెలియగానే నా నవనాడులు కుంగిపోయాయి.

'హే భగవాన్... వాళ్లనెందుకు ఇన్ని కష్టాల పాలు చేస్తున్నావు. వాళ్లమానాన వాళ్లని బతకనీయవెందుకని? ఏ పాపం చేశారని వాళ్లనిలా శిక్షిస్తున్నావు' మూగగా ఆక్రోశించింది నా మనసు. సమాధానాలు రావని తెలిసే కనిపించని భగవంతుణ్ణి ప్రశ్నించింది.

క్యాంప్‌కి వెళ్లాల్సివున్నా ఆరోగ్యం బాగోలేదని కాన్సిల్ చేసుకుని, జీవన్ పూర్ణిమలను కలుసుకోవడానికి పోలీస్‌స్టేషన్‌కి వెళ్లాను.

వాళ్లతో మాట్లాడటానికి ఇన్‌స్పెక్టర్ ముందు అనుమతించలేదు. ఆయన్ని ఎంతో అర్థించిన మీదట రెండునిమిషాలు మాత్రం పర్మిషన్ ఇచ్చాడు.

వాళ్లని చివరికీస్థితిలో చూడాల్సివస్తుందని ఎంతమాత్రం ఊహించని నన్ను నిలువెల్లా నిస్సత్తువ కమ్మేసింది. వాళ్లతో ఏం మాట్లాడాలో తెలియని మూగతనంలో కూరుకుపోయిన నన్ను జీవనే రాని నవ్వును బలవంతంగా పెదాలమీదకు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ పలకరింపుగా చూశాడు. పూర్ణిమ పిచ్చిదానిలా చూసింది. ఆ చూపుకు ఏం భాష్యం చెప్పుకోవాలో నాకే తెలియలేదు.

ఇద్దరూ బాగా ఖంగుతిన్నారు. ముఖాల్లో అలసట, నీరసం, చూపుల్లో షాక్.

ఎలాగో నోరు పెగుల్చుకుని- "ఎలా జరిగింది'' అనడిగాను జీవన్‌ని చాలా పొడిగా.

"చీరాల వెళ్లి పదిహేనురోజులు అక్కడే వుండివద్దామనుకున్నాను. ఫ్యాక్టరీలో ఏదో గొడవ జరిగి వర్కర్స్ స్ట్రైక్ చేయడంవల్ల జీతాలు అందడంలో ఆలస్యమయింది. సమయానికి మా కజిన్ కూడా అక్కడ లేడు. లీవుపెట్టి విజయవాడ వచ్చాడు. ఎక్కడ ప్రయత్నించిన డబ్బు దొరక్కపోవడంతో జీతం వచ్చేవరకు ఆగవలసివచ్చింది. అది అందుకున్నరోజు సాయంత్రమే చీరాలకు బయలుదేరబోతున్నాం. అదే సమయానికి వీళ్లొచ్చారు'' తలదించుకుని చెప్పాడు.

"నాగభూషణం కేసు పెట్టిన సంగతితో రాసిన ఉత్తరం మీకు అందలేదా'' నెమ్మదిగా అతడికి మాత్రమే విన్పించేలా అడిగాను.

అందలేదన్నట్లు తల అడ్డంగా ఊపాడు.

కానిస్టేబుల్ వచ్చి ఇక నడవమన్నట్లు సైగ చేయడంతో నిట్టూరుస్తూ అక్కడినుండి కదిలాను.

పోలీస్‌స్టేషన్‌నుండి నరానరి నాగభూషణం ఇంటికి వెళ్లాను.

అతణ్ణి, వాళ్ల బాబాయిని పూర్ణిమ జీవితం నాశనం చేయొద్దని బతిమిలాడాను.

"ఎంత కాదనుకున్నా రక్తం పంచుకుపుట్టిన చెల్లెలు. ఇప్పుడు ఆవేశంతో కాదనుకున్నా తర్వాతైనా ఆమెను కావాలనుకోకపోరు మీరు. ఈ కోపం, బాధ, ఆవేశం ఎల్లకాలం ఉండవు. నా మాటవిని వాళ్లని విడదీయవద్దు. ఆమె కోరుకున్న బతుకునుండి బయటకులాగి నరకం సృష్టించవద్దు. ప్లీజ్... పూర్ణిమ అన్నీ తెలిసి కావాలనుకుని కోరి అతడితో వెళ్లింది. జీవన్‌కేదైనా హాని జరిగినా, మీరు చేయతలపెట్టినా ఇప్పుడు నష్టపోయేది పూర్ణిమే. వాళ్ల బతుకుల్ని పాడుచేయకండి. కోపం తగ్గించుకుని ఆలోచించండి. ఆలోచన లేకుండా ఆవేశంతో ఏ ఘాతుకానికి పూనుకోవద్దు. వాళ్లమీద దయతలచి కేసు ఉపసంహరించుకోండ''ని ప్రాధేయపడ్డాను. ఎన్నో రకాలుగా నచ్చచెప్పాలని చూశాను.

నా మాటలు విన్పించుకోకుండానే కోపంతో వాళ్ల నోటికొచ్చినట్లు మాట్లాడారు.

"నీవెవడివి? నీకీవిషయం సంబంధం లేదు. ఇది మా కుటుంబవిషయం. ఇందులో అనవసరంగా జోక్యం చేసుకోకు''

"ఆ-లం... ని నాశనం చేస్తాం.. వాడికెన్ని గుండెలు. ఇంట్లో ఉంటూ ఇంత చిచ్చు పెడతాడా? వాడి శవాన్ని కళ్ల చూస్తాం''

"చెల్లీ చెల్లీ అంటుంటే ఏమో అనుకున్నాం. అలా అంటూనే దానికి నీవే నూరిపోసింది కాదూ ఇదంతా''

ఇటువంటి మాటలు ఇంకెన్నెన్నో అంటూ అవమానించారు. వాళ్లముందు నాదంతా అరణ్యరోదనే అయింది.

ఆ మరునటిరోజు జీవన్, పూర్ణిమలను పోలీసులు మెజిస్ట్రేట్ ముందు హాజరుపరిచారు. పూర్ణిమకు మానసిక స్వస్థతలేదని, అందుకు చికిత్స చేయించినట్లు దొంగ రుజువుతోపాటు ఆమెకి మైనారిటీ తీరలేదంటూ ముందుజాగ్రత్తగా తీసుకుని ఉంచిన దొంగ సర్టిఫికెటు మేజిస్ట్రేట్‌కు చూపించారు.

జీవన్ విడాకుల కేసు కోర్టులో ఉండడంవల్ల ఆ కేసుకు సంబంధించిన వివరాలు జీవన్ మొదటిభార్య తరపు లాయర్‌నుండి సేకరించి వాటిని కూడా ఆయనకు సమర్పించారు.

అవన్నీ చూసి నాగభూషణం, పోలీసులు చెప్పిందివిని జీవన్‌ని జ్యూడీషియల్ ఉంచమని, వెంటనే కేసు కోర్టులో దాఖలు చేయమని చెప్పి, పూర్ణిమను ఆమె అన్నల ఆధీనంలో ఉంచమని ఆదేశించాడు మేజిస్ట్రేట్. ఇది విని పూర్ణిమ నిజంగానే పిచ్చిదయింది. తను మైనర్‌ని కానని, తనకెలాంటి మానసిక జబ్బులేదని, తనకు నచ్చిన వ్యక్తిని పెళ్లిచేసుకుని ఆనందంగా ఉన్నానని పూర్ణిమ ఎంతగా మొరపెట్టుకున్నా, మెడలోని తాళితీసి చూపించి ఏడుస్తూ ఎంతగా అభ్యర్థించినా మేజిస్ట్రేట్ పట్టించుకోలేదు.

జీవన్‌ని గట్టిగా పట్టుకుని ఏడుస్తున్న పూర్ణిమ తనను దూరంగా లాగిన అన్నయ్యల్ని, బాబాయిని తిట్టింది. తోసేసింది. "అన్నయ్యా" అంటూ నా చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

గుండెలవిసేలా రోదిస్తున్న పూర్ణిమను దగ్గరికి తీసుకుని నా కళ్లలో ఉబికే కన్నీళ్లను కళ్లలోనే అదిమిపెట్టుకుని ఆమె తలనిమిరి కన్నీళ్లు తుడిచాను.

నాగభూషణాన్ని, వాళ్ల బాబాయిని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది నాకు. రక్తం ఉడికిపోయింది. ఆవేశం కట్టలు తెంచుకుంది. కాని ఏం చేయగలను. అసహాయతని నాలోనే అదిమిపెట్టుకుని మౌనం వహించాను.

చట్టాల న్యాయంముందు నిజం ఎప్పుడూ నిదురపోతూనే వుంటుంది. ఇప్పుడు కూడా అదే జరిగింది.

జీవన్‌ని బెయిల్‌కోసం ప్రయత్నించాను. కేసు సీరియస్ కాబట్టి బెయిలు నిరాకరిస్తున్నానన్నాడు మేజిస్ట్రేటు.

జీవన్ నన్ను చూసి నిర్వికారంగా నవ్వాడు వేదాంతిలా.

మేజిస్ట్రేట్‌ని పర్సనల్‌గా కలుసుకుని వాస్తవమేమిటో వివరించి చెప్పాను. అది విని ఆయన- "సారీ మిస్టర్... ఐ కెనాట్ డు ఎనీథింగ్ నౌ. అతనికి వ్యతిరేకంగా వాళ్లంతా బలమైన సాక్ష్యాన్ని చూపించినప్పుడు నేను మాత్రం ఏంచేయగలను. దాన్నిబట్టే ప్రొసీడ్ కావాలిగా. ఎనీ హౌ. మీరు కోర్టులో ప్రయత్నించండి" అన్నాడు.

పూర్ణిమను నాగభూషణం, కరుణాకర్ బలవంతంగా తీసుకెళుతుంటే ఏడుస్తూ పెనుగులాడుతూ వాళ్ల చేతుల్లోనుండి తప్పించుకోవడానికి చేస్తున్న ప్రయత్నంలో ఆమె గుండెకోత చూసి నా గుండెనెవరో నులిమివేస్తున్నంతగా గిలగిలలాడాను.

చేసిన ప్రయత్నాలు విఫలమవుతుంటే బాధకాక ఇంకేం మిగులుతుంది? ఒక్కక్షణం బావద్వారా బెయిలు ప్రయత్నిద్దామా అన్పించింది. లాభంలేదు. ఆయన ఖచ్చితంగా ఈ విషయంలో జోక్యం చేసుకోడు. పైగా నన్నే తిడతాడు. ఆ ఆలోచన విరమించుకున్నాను.

జరిగిన గొడవ తెలిసి జీవన్ అమ్మా నాన్న వచ్చారు. వాళ్ళు ఘోరున విలపిస్తుంటే వాళ్లకేం చెప్పాలో, ఎలా ఓదార్చాలో నాకర్థంకాలేదు.

వాళ్లూ- "ఇంత జరగడానికి నీవే కారణం" అన్నట్లు మాట్లాడారు. అది విని నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు.

నేను చేసిందేమిటి? ఇందులో నా తప్పేమిటి? ఇంత దారుణం కాకపోయినా ఏదో ఒక అనర్థం జరుగుతుందని ముందే ఊహించి హెచ్చరించాను. జీవన్, పూర్ణిమ వినకుండా ఎంతకైనా తెగిస్తామన్నారు. ఏంచేసినా ఆగరని గ్రహించి, వాళ్లలోని ప్రేమభావనలోని గాఢత తెలిసి సాయం చేయాలనుకున్నాను. అందుకు నాకిది ప్రతిఫలం.

నాలో నేను నవ్వుకున్నాను.

వాళ్లు జీవన్‌ని చూసి- "చెప్పినా వినకుండా పీకలమీదకు తెచ్చుకున్నావు. ఇప్పుడేం జరి





గిందో చూడు, జీవితం పాడుచేసుకున్నావుకద నాయనా'' అని విలపిస్తూ, నిష్ఠూరంగా మాట్లాడుతుంటే జీవన్ మౌనంగా తలదించుకున్నాడు.

వాళ్లింకా ఏడుస్తూ ఏదో అంటూంటే జీవన్ దీనంగా నన్ను చూశాడు.

''జీవన్‌ని నేనేదో ఒకరకంగా కాపాడుకుంటాను. మీరు భయపడొద్దు. బాధపడవద్దు. ఏ ఆపద రాకుండా చూసుకుంటానని'' జీవన్ అమ్మా నాన్నలకు ఎన్నో చెప్పి ఓదార్చాను.

ఆ ఓదార్పు మాటలు మాత్రం ఏం పనిచేస్తాయి. తుఫానుగాలికి తాళలేని ఆకుల్లా తల్లడిల్లిపోతున్న ఆ వృద్ధ హృదయాలను ఎంతగా సేదదీరుస్తాయి?

బలవంతంగా వాళ్లని జీవన్ దగ్గరనుండి ఇవతలకు తీసుకువచ్చేశాను. మనోబలం క్షీణించిపోయిన జీవన్ మేం వచ్చేస్తుంటే తనలోని దుఃఖాన్ని అణచుకోవడానికి ముఖం తిప్పుకోవడం కనిపించింది.

★ ★ ★

బెయిల్ ప్రయత్నం తర్వాత నాగభూషణం, కరుణాకర్‌లతో నాకున్న స్నేహం పూర్తిగా తెగిపోయింది.

పూర్ణిమను ఇక్కడకు దూరంగా ఉంచటం మంచిదనుకున్నాడో ఏమో, నాగభూషణం వాళ్లమ్మను, పూర్ణిమను మేనమామగారింటికి తీసికెళ్లి అక్కడే వుంచివచ్చాడు. పూర్ణిమ అక్కడినుండి తప్పించుకోవడానికి ఒకసారి, ఆత్మహత్యకు మరోసారి ప్రయత్నించడంతో లాభంలేదనుకుని మళ్లీ ఇక్కడకు తీసుకువచ్చేశాడు.

పూర్ణిమ గడపదాటి అడుగు బయటపెట్టడానికి వీల్లేదు. ఎవరూ ఆమెతో మాట్లాడడానికి వీల్లేదు. ఇంట్లో అట్లా కట్టుదిట్టం చేశారు.

ఒకసారి పూర్ణిమను చూసొద్దామని నేను వెళితే, నన్ను లోపలికి అడుగుపెట్టనీయకపోవడమే కాకుండా పచ్చిబూతులు తిడుతూ బయటకు గెంటారు.

ఇప్పుడు వాళ్లు నోరుతెరిస్తే బూతులు తప్ప మరేం రావడంలేదు.

వాళ్లమాటలు, ప్రవర్తన నాలో జుగుప్సతోపాటు ఆవేశాన్నీ కలిగించాయి. వాళ్ల తిట్లు భరించడం నావల్ల కాలేకపోయింది- ''వళ్లు దగ్గరుంచుకుని మాట్లాడండని'' హెచ్చరించాను.

''ఏం ఏంచేస్తావేంటి'' చాలా కరకుగా అన్నాడు నాగభూషణం.

''సవాళ్లు విసురొద్దు. మర్యాదగా ప్రవర్తించమని చెబుతున్నాను. అంతే'' సాధ్యమైనంత సౌమ్యంగానే అన్నాను.

''నీతో మర్యాదేమిటి?'' రెచ్చిపోయి అన్నాడు.

''అవున్లే... మనుషులైతేగా మీరు మర్యాద తెలియడానికి''

''పిచ్చిపిచ్చిగా వాగకు. మంచి మర్యాద అనేది లేకుండా ప్రవర్తించి చిచ్చుపెట్టింది నీవుకాదూ'' కరుణాకర్ కల్పించుకుంటూ అన్నాడు.

''చూడండీ... మీకిదివరకు చెప్పాను. ఇప్పుడు చెబుతున్నాను. నా తప్పుగాని, నా పాత్రగాని ఇందులో ఏదీలేదని. ఈ మొత్తం గొడవలో దోషి అనేది ఎవరైనా ఉంటే అది నీ అన్నయ్యే. దీనికంతటికీ కారణం అతడే'' అన్నాను.

''ఏం కూస్తున్నావు'' అరుస్తూ ముందుకొచ్చాడు నాగభూషణం.

''తగ్గు. తగ్గు'' అక్కడే ఆగమన్నట్లు చేతితో సైగచేస్తూ- ''దోషివి నీవే అంటున్నాను. వయసొచ్చిన చెల్లెల్ని ఇంట్లో పెట్టుకునీ జీవన్‌ని ఇంట్లో వుంచుకోవడం నీ తప్పు. మీ అమ్మవాళ్లు రాగానే పంపించివేయాల్సింది అదీ చేయలేదు. పోనీ వాళ్లు ప్రేమించుకున్న సంగతి తెలిసి పెద్దమనసుతో వాళ్లని ఒకటి చేయాల్సింది. అదీ చేయలేదు. వాళ్లు వెళ్లిపోయారు. ఆ ఇద్దరిలో ఒకరికి అన్నయ్య, ఒకరికి చిన్నప్పటినుండి స్నేహితుడివయినందుకు ఆవేశం పక్కకుపెట్టి పెద్దరికంగా వాళ్లని దీవించాల్సింది. అందుకిష్టం లేకపోతే వెళ్లినవాళ్లను వాళ్లమానాన వదలివేయాల్సింది. అవేవీ చేయకుండా వాళ్ల జీవితాల్ని సర్వనాశనం చేయడానికి కంకణం కట్టుకున్నావు. సొంతచెల్లెలని చూడకుండా అమానుషంగా ప్రవర్తిస్తున్న నీవే ముమ్మాటికీ దోషివి'' అన్నాను.

''నీవు మాకు నీతులు చెప్పక్కరలేదు.

మేమేం చేయాలో మాకు తెలుసు'' అన్నాడు కరుణాకర్.

''ఊరుకుంటుంటే నీ ఇష్టం వచ్చినట్లు వాగుతున్నావ్'' కోపంతో కళ్లు పెద్దవిచేసి చూపుడువేలుని బెదిరిస్తున్ననట్లుగా ఊపుతూ అన్నాడు నాగభూషణం.

''అసలు నీకిక్కడకు రావాల్సిన పనేమిటి?'' నిలదీస్తున్నట్లు ప్రశ్నించాడు కరుణాకర్.

''పూర్ణిమను చూడడానికి'' అతడికి బదులిచ్చాను.

''ఎందుకు?'' కళ్లు చిట్లిస్తూ అడిగాడు.

''అన్నయ్యా అని పిలిచిన అభిమానానికి నా హృదయం ఇంకా రుణపడి వుందికాబట్టి''

''ఒహోహోహో... ఏం డైలాగు'' అని ఎద్దేవా చేస్తూ- ''దాన్ని నువ్వేం చూడనక్కరలేదు. ముందు బయటకు నడు'' అన్నాడు నాగభూషణం.

''ఒక్కసారి పూర్ణిమను చూసి పలకరించి వెళ్లిపోతాను'' అన్నాను.

''పొమ్మని చెప్తుంటే నీక్కాదు బే, పో'' అంటూ విసురుగా నెట్టాడు.

మాటలతోనేకాక చేతల్తో కూడా అతడంత దురుసుగా ప్రవర్తిస్తున్నందుకు ఒక్కక్షణం బిత్తరపోయాను. అంతలోనే తేరుకుని- ''యుక్తాయుక్త జ్ఞానం మరచి మీరెలా ప్రవర్తిస్తున్నారో మీకు తెలియడంలేదు'' అన్నాను.

''సరే... మాకింతకంటే మంచిగా ప్రవర్తించడం చేతకాదు. ఏంచేస్తావో చేసుకో పో'' అన్నాడు.

''సవాళ్లు విసరొద్దని ముందే చెప్పాను. చేయాలనుకుంటే ఏదైనా చేయగలను. జన్మలో మళ్లీ మీరు ఈ ఊరు ముఖం చూడకుండా తరిమి తరిమి కొట్టడంతోసహా. తెలిసిందా. కాని మీలాంటి మూర్ఖుణ్ణి కాదు'' అన్నాను.

నా మాటలకు మరింత ఆవేశంతో దూకుడుగా మీదకు రాబోయాడు. అతణ్ణి కరుణాకర్ అడ్డుకున్నాడు.

నాగభూషణం ప్రవర్తన నాలో కలిగించిన ఏహ్యాభావమంతా చూపుల్లో, మాటల్లో వ్యక్తంచేస్తూ- ''ఛీ'' అని ఛీత్కరించి వచ్చేశాను.

ఊహకి, వాస్తవానికి ఎంతదూరం ఉందో అంత దగ్గరితనమూ ఉంది. ఒక సినిమా చూస్తున్నప్పుడో, ఒక నవల చదువుతున్నప్పుడో కొన్ని సంఘటనలు చాలా అసహజమనిపిస్తు వుంటాయి. కాని అటువంటివే జీవితాలలో జరిగినప్పుడు- ఎవరైనా వాటి గురించి చెబితే విన్నప్పుడు నమ్మశక్యంగా అనిపించకపోవచ్చు కాని కంటికెదురుగా జరుగుతుంటే- అవి అసహజమనే భావనరాదు. పైగా మనుషులలోని దుర్బలత, మూర్ఖత్వం కొట్టొచ్చినట్లు కనుపిస్తూ ఎందుకింత మూర్ఖత్వం అని ఆలోచింపచేస్తాయి. ఆ అసహజ సంఘటనలకు కారకులైన వ్యక్తులు అపరిపక్వ మానసికస్థితిని, వారి దౌర్భాగ్య ఆలోచనాధోరణిని ప్రతిబింబింపచేయడమే ఇందుకు కారణం.

కేసు కోర్టులో దాఖలు పరిచాక మరోసారి బెయిలు కోసం ప్రయత్నించాను. నాగభూషణం ఉపయోగించిన డబ్బు, పలుకుబడి ముందు నేను చెప్పిన వాస్తవాలు, చేసిన అభ్యర్థన ఎందుకూ పనికిరాకుండా పోయాయి.

బెయిలు దొరకలేదు.

ఆశ చావక చివరియత్నంగా బావని అర్థించాను. ఆయన తాను ప్రయత్నించనని నిర్మొహమాటంగా చెప్పి- ''నీదేదో నువ్వు చూసుకో. వెధవ వ్యవహారాలు నెత్తిన వేసుకోకు'' అని మందలించాడు.

పరిస్థితి చెప్పినా- ''ఆ ప్రస్తావన నా దగ్గర తేబోకు. ఆ వెధవలకోసం నేను ప్రయత్నించడమేమిటి'' అని విసుక్కుంటూ లేచిపోయాడు.

ఏమి చేయలేని నిస్సహాయతలో కూరుకుపోయాను.

'ఇది నాకెందుక'నే భావం కలగడంలేదు నాలో. స్నేహితులైన 'జీవన్, పూర్ణిమలనెలా కాపాడాలా' అనే ఆలోచనలే తప్ప.

రెండు రోజులకోసారి జీవన్‌ని కలుసుకుని నాగభూషణం ప్రయత్నాలు గురించి నాకు తెలిసిన వివరాలు, నేను చేస్తున్న ప్రయత్నాలను తెలియజేస్తున్నాను.

కేసులో నాగభూషణానికి వ్యతిరేకంగా నేను గట్టి సాక్ష్యాన్ని సంపాదించలేకపోతే చేయగలిగిందేమీ ఉండదు. దేనికైనా గట్టిసాక్ష్యం ఒక్కటే- పూర్ణిమ.





కావాలని పిచ్చిదాన్ని చేసి ఆ సాక్ష్యం విలువలేకుండా చేసేశారు. పూర్ణిమకు మాన సిక జబ్బు వుందని సర్టిఫై చేసిన డాక్టరు దగ్గరకెళ్ళి ఎంత డబ్బు ఆశ చూపినా పిచ్చిదికా దని మరో సర్టిఫికెట్ ఇవ్వడు. అలా చేస్తే అది తనకే ఎసరు కనుక.

ఆమెను మరో డాక్టరుకి చూపించినా- కోర్టు అలా చేయమని ఆదేశిస్తే తప్ప- ఫలితం ఉండదు. అసలు నేనామెనెలా చూపించగ ల్ను'.

ఏం దిక్కుతోచక నాకు కొద్దిగా పరిచయం ఉన్న లాయర్‌ను కలిసి అన్ని వివరాలు చెప్పి ఈ కేసు ప్రయత్నించమని 'రిక్వెస్ట్' చేశాను. ఆయన అంతా విని- "లాభంలేదు. మన తరఫున ఒక్కసాక్ష్యమనేది లేదు. కేసు గెల వలేం. అయినా ప్రయత్నిస్తాను. ఆమె అతడికి రాసిన ఉత్తరాలేమైనా ఉంటే సంపాదించండి ముందు. మిగతా విషయం తర్వాత ఆలోచి ద్దాం" అన్నాడు.

జీవన్‌ని కలుసుకుని లాయర్‌ని కలిసిన విషయం చెప్పి ఉత్తరాల గురించి అడిగాను.

"మొదట్లో నాగభూషణానికి చెప్పినప్పుడు వాడికి నమ్మకం కలిగించడం కోసం ఆ ఉత్తరా లను చూపించాను. వాడవి లాగేసుకుని చూడ కుండానే చించేశాడు" అన్నాడు దిగులుగా.

ఉన్నదనుకున్న ఆధారమూ పోయింది.

దీర్ఘంగా నిట్టూర్చాను.

లాయర్‌కీవిషయం చెబితే ఇక లాభం లేద న్నట్లు పెదవి విరిచాడు. నా సంతృప్తి కోస మైనా ప్రయత్నించమని బతిమిలాడాను. ఆయన నా బాధ చూసి- "సరే... వీళ్ళిద్దరికీ సంబంధించిన ఆధారాలింకేమైనా దొరుకుతా యేమో ప్రయత్నం చెయ్యి" అన్నాడు అంగీక రిస్తున్నట్లు.

★ ★ ★

రోజులు నెమ్మదిగా దొర్లుతున్నాయి. జీవన్, పూర్ణిమల పరిస్థితిలో ఎలాంటి మార్పు లేదు. చేయడానికేప్రయత్నమూ మిగలక కోర్టు హియరింగ్‌కోసం ఎదురుచూస్తున్నారు.

మనిషిచుట్టూ ఎన్నో ద్వారాలు తెరచి ఉంటాయి. తన అంతరంగపు ద్వారం తెరచు కుని బయటకు వచ్చి చుట్టూఉన్న జీవిత గవాక్షాలగుండా తొంగిచూస్తే ఆ బయటకాను కున్న అనుభవాలు స్వీయానుభూతిలో లయించి, మనిషిని రగిలించి మనుగడ రహ స్యాల్ని తెలుపుతాయి. ఎన్నో భావాలు, ఆలోచ నలు ఆవేదనలుగా రూపందాల్చే ఈ అనుభ వానుభూతి మనిషిలో పదిలమై తనలోని వెలు గుని, తన చుట్టూ ఉన్న అనంత చైతన్యాగ్ని జ్వాలల్లో దీప్తిని గుర్తించేలా చేస్తాయి. తద్వారా విశ్వపు వాకిట పథికుడై నిలచిన మనిషి తనలోను, తన చుట్టూ పెనవేసుకున్న చీక టిని పారద్రోలి నిత్యసత్యతత్వాన్ని అవగాహన చేసుకుని తన పయనం సాగించగలుగుతాడు.

అలాకాక అంతరంగం తలుపులు మూసు కుని ఆలోచనల కానకట్ట కట్టి ఆవేశం, డాబు, దర్పాల నడుమ మూర్ఖత్వంలో నిలిచిన మనిషి తనలోకే తను కుంచించుకుపోతూ తన చుట్టూ ఉన్న జీవితాల అవగాహన లేక తను గీసుకున్న గిరిలోనుండి కళ్ళు చికిలించి చూస్తే కనిపించేవి వినిపించేవి ఉన్నత హృదయా లు, వాటి స్పందనలు కావు. తన ఆలోచనల్లాగే కుంచించుకుపోయిన అర్థరహితమైన అస్పష్ట చిత్రాలు. అవే నిజమని భ్రమసి తమ మూర్ఖ త్వాన్ని కాపాడుకోవడమే ఆ మనుషుల పరమా వధిగా మిగిలిపోతుంది.

ఆ కోవకి చెందిన వ్యక్తుల్లో నాగభూషణం ఒకడు. అతణ్ణి కమ్మిన ఆవేశకావేషాలు అతడి లోని మానవత్వాన్ని ఏనాడో మాయంచేసే శాయి.

పూర్ణిమ నెల తప్పిందని అమ్మకు చుట్టుప క్కలవాళ్ల ద్వారా తెలిసి ఏవో మాటలమధ్య నాకా విషయం చెప్పింది.

పూర్ణిమను చూడాలనిపించి ఏదో ఒకరకంగా అవకాశం దొరుకుతుందేమోననే ఆశతో వాళ్లింటికి వెళ్లాను. గతంలోని అనుభవంతో మనసు వద్దువద్దని చెబుతున్నా దాన్ని పట్టించుకోలేదు.

నన్ను లోపలినుండే చూసిందికాబోలు, నేను వరండా మెట్లెక్కుతుండగానే పూర్ణిమ "అన్న య్యా" అంటూ పరుగెత్తుకు రాబోతూ గడపత గిలి పడబోయింది. గ్రిల్‌డోర్ తోసుకుని పరు గున వెళ్లి పట్టుకున్నాను.

వెనువెంటనే పూర్ణిమ చెంపనేకాదు, నా

చెంపను పరామర్శించింది - పూర్ణిమ కేకకు లోపలినుండి బయటకు వచ్చిన నాగభూషణం చేయి - ''ఎవడే నీకు అన్నయ్య'' అంటూ.

ఆ వెనక వాళ్లమ్మ తిట్టుదీవెనలు.

నాగభూషణం కొట్టిన దెబ్బకు ప్రతిస్పందనగా నా చేయి పైకి లేచింది. కాని సంస్కారం అడ్డొచ్చి చేయి కిందకు దించేసి పళ్లబిగువున నాకోపాన్ని అణచుకున్నాను. అతణ్ణి తీవ్రంగా చూస్తూ- ''మీరు మనుషులా? పశువులా?'' అన్నాను. పడితే ఆమె గర్భానికి ఏ ప్రమాదం ముంచుకొచ్చేదో అనే ఆలోచనకూడా లేక నన్ను అన్నయ్యా అని పిలిచినందుకు కొట్టడంతో.

''నోర్ముయి, ముందు బయటకు నడు'' అరిచాడు.

పూర్ణిమ ఏడుస్తూ గింజుకుని రాబోతున్నా నాగభూషణం ఉక్కుచేయి ఆమె జుట్టు పట్టుకుని లోపలికి ఒక్క తోపుతోసింది.

ఇంకా నేనక్కడుంటే పూర్ణిమను హింసించడం మరింత ఎక్కువవుతుందని పించి. పూర్ణిమ ''అన్నయ్యా, ఇక్కడుండలేను, నన్ను తీసికెళ్లిపో అన్నయ్యా'' అంటున్నా ఆమె హృదయవిదారకమైన స్వరం నా నరా

ల్ని పిండుతున్నా నిస్సహాయంగా వెనుదిరిగి వచ్చేసాను.

పూర్ణిమ అభ్యర్థనకు సమాధానంగా నాకళ్ల నుండి రెండు వెచ్చని కన్నీటిబొట్లు రాలాయి.

ఏంచెయ్యను? పూర్ణిమను వాళ్లబారినుండి ఎలా తప్పించగలను? జీవన్ పూర్ణిమలను ఎలా కలపగలను? నన్ను నేను ప్రశ్నించు కుంటూ నుదురు కొట్టుకున్నాను దిక్కుతోచక.

ఇరుకుగా ఉన్న ఆ వీధిలోని వాళ్లంతా నన్ను చూసి నవ్వుతున్నట్లనిపించింది.

ప్రేమ, మమత, చెల్లెలన్న అభిమానం, రక్తసంబంధం - ఉందని తమని తాము మభ్యపెట్టుకుంటున్న వాళ్లకు లేని పరువు ముందు, మూర్ఖమైన పంతంముందు- విలువ లురాహిత్యమైపోయాయి. అందుకే వాళ్లనుండి దూరమై ఒకరిలో ఒకరుగా ఐక్యమై కరిగిపో బోయే ఆ ప్రేమజంటను ఎందుకూ పనికిరాని, ఎవరికీ లాభంలేని పంతం నెగ్గించుకోవ డంకోసం; చిరకాల స్నేహితుడైనా తమ చెల్లె ల్ని లేవదీసుకుపోయాడని, పరువు మంటకలి పాడనే భావంతో జీవన్‌ని నాశనం చేయాలనే కోపం, కసి చల్లార్చుకోవడంకోసం దేనికైనా సిద్ధపడ్డారు. జీవన్ తమ కొంపముంచాడు, అల్లరిపాలు చేసాడని అనుకుంటున్నారేకాని తమలో పేరుకుపోయిన దౌర్జన్యాన్ని ఊర డించుకోవడంకోసం రెండు నిండుజీవితాలకు తీరని చిచ్చు పెడుతున్నామని తెలుసుకోలేక పోతున్నారు. తెలియజెప్పాలనే ప్రయత్నాల్ని నీరుకారుస్తున్నారు.

వీళ్లలో ఇంత కర్కశత్వం దేనికి? అదీ, జీవన్, పూర్ణిమ వెళ్లిపోయిన సంఘటనతో ఇంత హఠాత్తుగా బయటపడడం దేనికి? ఈ మూర్ఖపు పట్టుదలకు అర్థం ఉందా? జీవన్‌ని ఏంచేసినా నష్టపోయేది ఆ జీవన్‌తో తాళిక ట్టించుకుని ఆ జీవన్ బిడ్డకే తల్లికాబోతున్న తమ చెల్లెలేనని తెలియని మృగాలా? తెలి యక కాదు. మరెందుకీ రాక్షసత్వం?

నాకు సమాధానం దొరకలేదు.

జీవన్‌ని కలిసి ఈ సంఘటన గురించి చెప్పాను.

పూర్ణిమ గర్భవతని తెలిసి అతడి కన్నుల్లో ఒక్కక్షణం విద్యుత్తటిల్లత. ఆ మరుక్షణం దాని స్థానంలో నీలినీడలు.

నా రెండు చేతుల్లో వాలిపోయి పసిపిల్లా డిలా ఏడ్చేసాడు. అసలే సెన్సిటివ్ అయిన జీవన్ ఇప్పుడున్న పరిస్థితిలో గూడుకట్టుకున్న నిరాశలో, నిస్పృహలో మరింతగా కదిలిపోతు న్నాడు.

అతడినెలా ఓదార్చాలో తెలియడంలేదు. అతడి దుఃఖం చూస్తుంటే నాలో చెప్పలేనంత దిగులు.

ఈ బ్రతుకుల్ని మళ్లీ కలిపే అవకాశం వస్తుందా? ఆ శక్తి నాకుందా? నేనేంచేయాలి? ఏం చేయగలను. వాళ్ల పశుత్వంముందు నాలోని మానవత్వం గాయపడితల వంచు కుంటుంటే ఏంచేయగలను?

నా, పర అనే భేదం ఎప్పుడో అంతరించిపో యింది వారి విషయంలో.

జీవన్‌ని ఓదార్చడం మరచి నేనూ అతడి స్థితికి చేరుకున్నాను.

కాలం మా బాధకు స్తంభించిపోయింది - అనుకున్నాను సెంట్రీ టైమయిపోయిందని చెప్పేంతవరకు.



జీవన్ కేసు విచారణకు వచ్చింది.

నాగభూషణంలోని మూర్ఖత్వం, పశుత్వం పరాకాష్ఠనందుకున్నాయి.

జీవన్ మొదటి భార్యను, మామను సాక్షు లుగా రప్పించారు. సాయి అమ్మా, నాన్నా కూడా వచ్చారు.

కోర్టులో జరగాల్సిన తతంగమంతా జరిగాక ప్రాసిక్యూషన్‌వారి ప్రశ్నలకు జీవన్ మొదటి

భార్య చెప్పిన సాక్ష్యానికి నా తల తిరిగిపోయింది.

జీవన్ నపుంసకుడట. డబ్బుకోసం తనను ఇతరుల దగ్గర పడుకోమనేవాడట. రెండుసార్లు తనే స్వయంగా ఎవరినో తీసుకువచ్చాడట. ఒప్పుకోకపోతే దారుణంగా కొట్టి హింసించాడట. తాగివచ్చి అమానుషంగా ప్రవర్తించాడట. అది తట్టుకోలేక పెళ్లయిన సంవత్సరంలోపే తను వెళ్లిపోయి పుట్టింట్లో ఉంటోందట. విడాకులకోసం అప్పీలు చేసుకున్నానని ప్రస్తుతం ఆ కేసు కోర్టులో ఉందని నిర్లజ్జగా సాక్ష్యం చెప్పింది.

ఆమె తండ్రి కూడా జీవన్ తన కూతుర్ని చాలా హింసించేవాడని చెప్పాడు.

రాక్షసులు! ఎంత ఘోరానికి పాల్పడ్డారు!

జీవన్ మొదటి భార్య. ఎంతటి నెరజాణ! కంటికెదురుగా జరుగుతున్నా ఆడవాళ్లలో ఇలాంటి వాళ్లుంటారని నమ్మలేకపోతున్నాను.

ఒకప్పుడు బంధాన్ని కలుపుకున్నా దాన్ని అనుబంధంగా మార్చుకోలేక మంకుతనంతో బంధాన్నే తెంచుకున్న మనుషులు ఆ బంధానికి, ఆ మనిషికి విలువ ఇస్తారనుకోవటం పొరపాటే.

కాని. తమతో సంబంధంలేక దూరమైపోయిన వ్యక్తిని ఇంకా ఎందుకు వెంటపడి సాధిస్తున్నారు? ఏ ప్రయోజనాన్ని ఆశించి ఇలా ప్రవర్తిస్తున్నారు? ఇందులో వాళ్లకి వొరిగేదేమిటి? ఎవరిమానాన వాళ్లు బ్రతుకుతున్నప్పుడు తెలిసి తెలిసి ఇంతటి ఘోర అసత్యాలతో రెండు నిండుజీవితాలలో ఈ చిచ్చు ఎందుకు పెడుతున్నారు?

ఈ తప్పు పూర్తిగా వాళ్లది కాదు. వాళ్లతో ఆ తప్పు చేయిస్తున్నది నాగభూషణం.

జీవన్‌కి అతడి మొదటి భార్యకు ఉన్న వైరాన్ని ఆసరాగా చేసుకుని నాగభూషణమే అలా సాక్ష్యం చెప్పించడానికి బ్రతిమిలాడి ఒప్పించి తీసుకువచ్చాడు. తననుకున్నది నెరవేర్చుకుంటున్నాడు. దానికోసం వీళ్లకెంత ముట్టజెప్పాడో.

అతడి పాత్ర ఎంతైనా వాళ్లూ ఇందుకు తమ వంతు చేయూత అందించడమే లౌక్యం తెలియని నా మెదడుకు అంతుపట్టని విషయంగా మిగిలిపోయింది.

నాగభూషణం డబ్బుతో లొంగదీసుకున్న మరో సాక్షి డాక్టర్.

“పూర్ణిమను జీవన్ తీసుకుపోవడానికి ముందు ఐదారునెలలపైనుండి ఆమె మానసికారోగ్యం బాగా దెబ్బతింది. హిస్టీరిక్ నింఫోమానియా, అబ్సెసివ్ కంపల్సివ్ న్యూరోసిస్‌తో బాధపడుతూ ఏదో ఆందోళనకు, వత్తిడికి గురవుతున్నట్లుండేది. ఉద్రేకంతో ప్రవర్తించేది. ఏమాత్రం కుదురుగా ఉండేది కాదు. చేసిందే పదిసార్లు చేస్తే ఉండుండి హిస్టీరిక్‌గా బరస్ట్ అయ్యేది. మొదటినుండి ఆమెకు నేనే ట్రీట్‌మెంట్ ఇస్తున్నానని” ట్రీట్‌మెంట్ వివరాలిచ్చాడు.

నలిగిపోయిన ప్రిస్క్రిప్షన్ చీటీలుగా పేర్కొంటూ నాగభూషణం కొన్ని కాగితాలను కోర్టుకు సమర్పించాడు.

నేను బతిమిలాడగా కేసు టేకప్‌చేసిన లాయర్ క్రాస్ ఎగ్జామిన్ చేసినప్పుడు కూడా ఈ ముగ్గురూ ఎలాంటి తొణుకు, బెణుకు లేకుండా మొదట చెప్పిన విషయాలనే మరింత గట్టిగా నొక్కిచెప్పారు.

“ఎక్కడుండగా జీవన్ హింసించాడు? ఇతరులను మీ దగ్గరకు తీసుకువచ్చాడు?” అని మా లాయర్ అడిగిన ప్రశ్నలకు “అత్తగారింట్లో ఉండగానే అలా జరిగిందని తమ గదికి వేరే త్రోవ ఉండడంవల్ల అటుగా తీసుకువచ్చాడని తనని హింసించినా అత్తమామలు ఏమీ అనేవారు కాదని” చెప్పింది జీవన్ మొదటి భార్య.

జీవన్ తల్లిదండ్రులను పిలిచి అడిగితే అదంతా అబద్ధం. కట్టుకథ. వాళ్ళిద్దరికీ పొసగనందువల్లే విడిపోయారు. ఆమెకే జీవన్‌తో కలిసి సంసారం చేయడం ఇష్టం లేకపోయింది. జీవన్ ఏనాడు హింసించలేదని” కళ్లనీళ్లపర్యంతమవుతూ చెప్పారు.

క్రాస్ ఎగ్జామిన్‌లో డాక్టర్‌ని అతడు చెప్పిన జబ్బులను వివరించి చెప్పమని అడిగాడు మా లాయర్.

హిస్టీరిక్ నింఫోమానియా అంటే విపరీతమైన కామవాంఛలు ఉండటమని చెప్పాడత

డు. "ఆ స్థితిలో ఉన్నవాళ్లు ఉన్మాదంగా ప్రవర్తించడమేకాక నరాల టెన్షన్‌ని భరించలేక ఏడుస్తుంటారు. అప్పుడప్పుడు స్మృతి కోల్పోవడం కూడా జరుగుతుంటుంది. అబ్సెసివ్ కంపల్సివ్ న్యూరోసిస్ అంటే చేసిన పనినే పదేపదే చేస్తుంటారు. అతి శుభ్రంగా ఉండాలనుకుంటారు. తమని, తమ వస్తువులను ఎవరినీ ముట్టుకోనీయరు. ఇతరులమీద లేనిపోని అనుమానాలతో బాధపడుతుంటారని" చెప్పాడు.

ఇందులో ఒక్క లక్షణంకూడా పూర్ణిమకు లేదు. ఆమెది పరిపక్వమైన ఆలోచనతో కూడుకున్న మనసు. వీళ్లందరివి అపరిపక్వమైన మనసులే కాదు. కంప్లీట్ పెర్వర్సిటీ! అయినా ఆ నిండుమనంమీద ఈ ధూర్తులు ఎన్ని మచ్చల్ని ముద్రిస్తున్నారు!

ఈ సాక్ష్యాలన్నీ విని జీవన్ రెండు చేతులతో నుదురు కొట్టుకుంటూ ఆవేశం, ఆవేదన కలగాపులగమై ఉద్వేగాన్ని భరించలేక "అబద్ధం... అంతా అబద్ధం. పూర్ణిమకు ఏ జబ్బు లేదు. ఇవన్నీ ఆమెపై వేస్తున్న నిందలు. నా మాటలు నమ్మండి. ప్లీజ్. నా మాటలు నమ్మండి" అని అరుస్తూ తాను నుంచున్న బోన్ చెక్కకు తలబాదుకున్నాడు.

నా కాళ్లకింద భూమి కుంగిపోతున్నట్లనిపించింది.

'ఓహ్! మై గాడ్! ఇంత ఘోరనిందలెలా వేయగలుగుతున్నారు? అవి విని ఈ పశువులు మామూలుగా ఎలా ఉండగలుగుతున్నారు? ఓహ్ వాటెహెల్. వాటె పెర్వర్సిటీ!

జీవన్ మొదటి భార్య - అది ఆడదా... కాదు రాక్షసి! అదీకాదు అంతకంటే ఘోరమైంది. దాన్ని ఆ డాక్టరును పీకపిసికి కాలికింద నల్లుల్లాగ నలిపి చంపెయ్యాలన్నంత కోపాన్ని, ఆవేశాన్ని అదుపులో పెట్టుకున్నాను - నాకు సాధ్యమైంది అదొక్కటేమరి!

వాళ్లందరిమాదిరి నాలోనూ రాక్షసత్వం విజృంభించలేకపోతోంది. అందుకు నా వివేకం, సంస్కారం, ఆలోచన అడ్డొస్తున్నాయి.

పూర్ణిమను ఎదురుగా నిలిపి 'జీవన్ నపుంసకుడు కాదు, పూర్ణిమ గర్భానికి కారకుడై తల్లి కాబోయే అదృష్టం కల్పించిన అతడిలో పుంసత్వం ఉంది. కావాలంటే పరీక్షించి చూడండి' అని గొంతెత్తి అరవాలనిపించింది.

పూర్ణిమ పిచ్చిది కాదు. పిచ్చిదానిలా మార్చేస్తున్నారు. వీళ్లు చేస్తున్నదానికి సగం పిచ్చిదయింది. ఈ అన్యాయాలు న్యాయాలుగా చలామణీ అయినంతకాలం పిచ్చిదానిలాగే మిగిలిపోతుందని నా కంఠనాళాలు పగిలేలా, ఈ కోర్టుహాలు దద్దరిల్లేలా గర్జించాలనిపించింది.

కళ్లు మూసుకున్న న్యాయదేవత సమక్షంలోనే నాగభూషణం కంఠం నులిమి వాడి చేత అసలు నిజాన్ని కక్కించాలని ఉంది. కాని సాక్ష్యంలేని అరుపులకు విలువ ఉండదు. మనసుతోటి. జరిగిన నిజంతోటి కోర్టుకు పనిలేదు. పచ్చి అబద్ధాలైనా బలమైన సాక్ష్యాలు, రుజువులు ఉంటే చాలు. ధర్మం అటువైపే మొగ్గుతుంది.

అంతరంగమనే న్యాయస్థానం ఒకటి ఉన్నా వీళ్లంతా దాని పీక ఏనాడో పిసికి, దానిమీద ఉక్కుపాదాలు మోపి, దాని ఉనికిని అణచివేసి అహంతో వికట్టహాసం చేస్తున్నారు.

కేసు వాయిదా పడింది. మళ్లీ వాయిదాకు పూర్ణిమను కోర్టులో హాజరు పరచమని జడ్జి ఆదేశించాడు.

మళ్లీ వాయిదాకు పూర్ణిమ హాజరుపరిచేలోగా ఆమె గర్భాన్ని ఈ పశువులు విచ్ఛిన్నం చేసినా చేయవచ్చు. లేదా పిచ్చిదని సర్టిఫికెట్ ఆధారంగా కోర్టు నమ్మినా, తను గర్భవతినని పూర్ణిమ ఆక్రోశిస్తే కోర్టు పొరపాటున మళ్లీ పరీక్ష చేయిస్తే ఆ పరీక్ష చేసే డాక్టర్‌ని కూడా లొంగదీసుకోవచ్చు. ఈ రాక్షసులు ఎంతకైనా తెగిస్తారు.

ఏమీ చేయలేని, దేనినీ నిరోధించలేని నా అసహాయతమీద నాకే అసహ్యం, జుగుప్స, కోపం కలిగింది. నా గుండె ఆవేదనతో బరువెక్కిపోయింది. నాలోనుండి బలమైన నిట్టూర్పు తన్నుకువచ్చింది.

మనిషిలో ఇంత దానవత్వం దాగి ఉంటుందని, సమయమొస్తే, అవసరమైతే ఎంతకైనా దిగజారగలడనే నిజం నాకీనాటివరకు తెలియదు. నాకు తెలియని మనిషి




స్వభావం, స్వరూపం ఎంతో ఉందని, మనిషి మానవత్వం చచ్చిపోయి గండశిలగా మిగిలి పోగలడని తెలిసి నివ్వెరపోయాను.

కోర్టుహాలునుండి బయటకు వస్తూ జీవన్‌ని పరీక్షగా చూసాను. అతడి కళ్లు ఎక్కడో అగాధాల్లోనుండి చూస్తున్నట్లున్నాయి. తమ ఎడబాటు కంటే తనమీద, పూర్ణిమమీద పడిన నిందలకు అతడిలో ఎక్కడో లోలోపల దాగిఉండే అక్కడినుండి కూడా నవ్వనేది పారిపోయింటుంది. ఇదివరకు ఎంతటి బాధలోనూ నవ్వే ఆ సన్నని పెదవులు ఎండిపోయి బిగుసుకుపోయాయి. పెరిగిన గడ్డం మాకెందుకు సంస్కారం అంటోంది. నూనెముఖం ఎరుగని జుట్టు చిందరవందరగా ఉంది.

మనిషి చాలా చిక్కిపోయాడు. చాలా అలసటగా కనిపిస్తున్నాడు.

తనపక్కనే నెమ్మదిగా నడుస్తున్న నన్ను దీర్ఘంగా చూసాడు. ఆ చూపులో తడి ఇంకి నా గుండెల్ని తొలిచేస్తున్న వేదన. మా ప్రేమ, తపన, మా కలయిక మాకు మిగిల్చిన బహుమానమా ఇది అని అతడి చూపు నన్ను గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తున్నట్లుంది.

వీళ్లు వెళ్లిపోకముందు పూర్ణిమనుండి ఆ ఉత్తరం నేనందుకోకపోతే... అసలు వీళ్లని కలవనీయకుండా మొదటినుండి నేనూ కర్కశంగా ఒకరికొకరు చేరువకాకుండా చూసినట్లయితే ఈ పరిస్థితి వచ్చేదా? అన్న భావం లిప్తపాటు నాలో కలిగింది.

ఎస్కార్ట్స్ మధ్య నడుస్తున్న జీవన్‌ని అమాంతం కౌగలించుకుని "నన్ను క్షమించు జీవన్" అంటూ గొణిగాను. నా కళ్లనుండి రాలిన ఒక కన్నీటి బొట్టు జీవన్ చేతిమీద పడింది.

ఎస్కార్ట్స్ నన్నివతలకి తోసేసి జీవన్‌ని నడవమని ముందుకు గెంటారు.

అతడు వెనుదిరిగి చూసిన చూపు... అది భాషకు అందనిది.

ఈ ప్రపంచంలోని మనుషులందరి స్వభావాల్ని చదివి ఔపోసన పట్టిన వేదాంతి చూపులా ఉందది. అందులో ఆనందం, బాధ, హృదయస్పందన - మరే ఇతర భావం లేదు. చీల్చుకుపోయే ఆ చూపులో అర్థంకాని శూన్యం ఉంది.

వెళుతున్న జీవన్‌నే చూస్తూ అచేతనంగా నిలబడిపోయాను.

ఎవరిదో నవ్వు వికృతంగా, భయంకరంగా ప్రతిధ్వనించింది నా చెవుల్లో. తలతిప్పి చూస్తే నా పక్కనే నిలుచున్న నాగభూషణం కన్పించాడు. అతడిలోని విజయగర్వం స్పష్టంగా ప్రతిఫలిస్తోందా నవ్వులో.

తల తిప్పేసుకున్నాను - అతణ్ణి చూడలేక.

మళ్లీ అంతలోనే పక్కకు తిరిగి ముందుకడుగేయబోతున్న నాగభూషణాన్ని నెమ్మదిగా పిలిచాను.

ఆగి ఏమిటన్నట్లు చూసిన అతణ్ణి పక్కకు రమ్మని పిలిచాను, వచ్చాడు.

"ఎందుకిలా చేస్తున్నావు?" లేని సౌమ్యాన్ని తెచ్చిపెట్టుకుంటూ అడిగాను.

"నేనొకసారి చెప్పాను గుర్తుందా? ఓటమి నంగీకరించనని. నేననుకున్నది సాధించడానికి ఏమైనా చేసితీరతానని. అప్పుడు మాటలు మాత్రమే విన్నావు. ఇప్పుడు చేతలు స్వయంగా చూస్తున్నావు. నన్ను మోసంచేసిన మిమ్మల్ని ఎన్నిరకాలుగా దెబ్బతీయగలనో అన్నిరకాలుగా దెబ్బతీసి నాశనంచేయడమే నా లక్ష్యం" భయంకరంగా ఉందతడి జవాబు.

"కాని మాలో నీ చెల్లెలుందని, మాతోపాటు ఆమె జీవితమూ నాశనమైపోతుందనే విషయాన్ని మరచిపోతున్నావు" మొదటంత సౌమ్యంగానే అన్నాను.

"నాదృష్టిలో అది మిమ్మల్ని కాదని ఆ ప్లాట్‌ఫారం లం...తో లేచిపోయినప్పుడే చచ్చిపోయింది. మిమ్మల్ని దెబ్బతీసి, మీకు దాన్ని దూరంచేసి, నాతో పెట్టుకుంటే నాశనమవుతారనే విషయాన్ని మీకు చవిచూపి, దాన్ని నాదారిలోకి తెచ్చుకోవడమే నాకు ముఖ్యం" అన్నాడు.

"చాలా నిజాయితీగా ఒప్పుకుంటున్నావు. సంతోషం. నీ చెల్లెలు చచ్చిపోయిందనుకున్నప్పుడు ఊరుకోవచ్చుగా. ఇంత గొడవ చేయడం దేనికి?"

"అదెలా కుదురుతుంది. దాన్ని దూరంచె

య్యేందే మిమ్మల్నిఎలా దెబ్బతీయగలను?"

"అందుకోసం ఇన్ని అబద్ధాలాడాలా? ఇంత... ఇంత ఘోరమైన నిందలు వేయాలా?" అనడుగుతుంటే అలవికాని బాధ లీలగా ధ్వనించింది నా స్వరంలో.

"యస్... వాడిని నాదగ్గరుంచుకుంటే, వాడేమిటో తెలిసిన నన్ను మోసంచేసి దాన్ని వలలో వేసుకుని మా పరువు మంటగలిపాడు. వాడి జీవితం నాశనం చేయకుండా వదులుతానా? అందుకు ఇంతకంటె మంచి అవకాశం లభిస్తుందా? మంచి మార్గం ఉందా?" క్రూరంగా నవ్వుతూ అన్నాడు.

"దుర్మార్గుడని తెలిసాకకూడా జీవన్ని నీదగ్గరుంచుకోవడం తప్పుకాదా?" అంత సౌమ్యంగా ఎలా మాట్లాడగలుగుతున్నానో నాకే అర్థంకాలేదు.

"కాదు. చిన్నప్పటినుండి తెలిసినవాడు, ఒకే ఊరివాడు, స్నేహితుడు అవడంవల్ల చేరతీసాను - మార్పురాకపోతుందా? మంచితనం అలవడకపోతుందా అని"

"ఇంట్లో వయసొచ్చిన చెల్లెలొకటి ఉందన్న సంగతి అప్పుడు గుర్తులేదా? వాళ్ళిద్దరినీ వంటరిగా వదలడం నీ తప్పుకాదా?"

"కాదు... ఇంత ఘోరం తలపెడతాడని కలగన్నానా?"

"అది ఘోరమంటావా?"

"కాదా... వాడికులమెక్కడ, నా కులమెక్కడ? పెళ్లయి, పెళ్లాం వదిలేసినవాడు నా చెల్లెలికి తగినవాడా?"

"ఇంకా చెల్లెలంటున్నావు. ఆకాస్త అభిమానాన్నైనా మిగుల్చుకున్నందుకు ఆనందం. కులమతాలు పట్టింపు లేదని, మంచివాళ్లయి మనసులు కలిస్తే చాలని నీవు చెప్పినవన్నీ..."

సగంలో అందుకుని అన్నాడు - "చూడు మిస్టర్! లోకంలో బ్రతకడానికి ఎన్నో చెప్పాలి. ఎంతో లౌక్యంతో వ్యవహరించాలి. పనులు జరుపుకోవడానికి ఎంతో నాటకమాడాలి. అవన్నీ బయటి జనానికి వినిపించడానికి. అంతే కాని ఆచరించడానికి కాదు"

"బాగా లౌక్యం తెలిసినవాడివి. రాజకీయ నాయకుడిగా పనికొస్తావు" హేళనగా అన్నాను.

"వెక్కిరిస్తున్నావా?" బెదిరింపుగా అన్నాడు నాగభూషణం.

"కాదులే, కానీ ఒక్క ప్రశ్న నువ్వు బాబాయి అని పిలిచే వ్యక్తిదేకులం? మీ అమ్మదే కులం?"

"నోర్మూయ్" అంటూ నా షర్టుకాలరు పట్టుకున్నాడు విసురుగా.

నెమ్మదిగానే విడిపించుకుంటూ- "మీకు పరువుందా? అసలది ఎలా ఉంటుందో మీ కుటుంబంలో ఎవరికైనా తెలుసా? మీ బ్రతుకులకు ఓ విలువంటూ ఉందా?" అనడిగా.

"షటప్" గొంతు తెగిపడేలా అరిచాడు. పళ్లు పటపట కొరుకుతూ చేయి లేపాడు - కొట్టడానికి.

అతడి అరుపుకి కారిడార్‌లో, మైదానంలో ఉన్న జనం, లాయర్లు - అందరూ తలలు తిప్పి మావైపు చూసారు.

విసురుగా అతడి చేయి పట్టుకుని కిందకి లాగి వదిలిపెట్టాను.

"ష్... అరవకు. గొంతు నీకేకాదు. నాకూ ఉంది. నీకంటె బిగ్గరగానే అరవగలను. మృగంలాకాక కాస్త మనిషిలా ప్రవర్తించు" అన్నాను.

నన్ను మింగేసేలా చూసాడు.

మనిషి వ్యక్తిత్వం, స్వభావం రూపుదిద్దుకోవడంలో అనుభవాల ప్రభావం బలంగా ఉంటుంది. పసితనంలో తల్లిదండ్రుల నవ్యమైన పెంపకం లేనప్పుడు, వారి ప్రేమను పొందలేనప్పుడు, జీవితంలో అది చూపించే ప్రభావంనుండి తప్పుకోవడం కష్టం. ప్రేమరాహిత్యంలో, ఒకవిధమైన అదుపు లేని పిచ్చుల విడితనంలో పెరగడంవల్ల మానసిక సమతుల్యత కొరవడుతుంది. దుడుకుస్వభావంతో ఊరికే ఆవేశానికి, ఉద్రేకానికి లోనవుతూంటారు. మంచిచెడుల గురించిన నవ్యమైన ఆలోచన లోపిస్తుంది. అల్పత్వభావన, తమకు రక్షణ లేదనుకునే ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్. వాటివల్ల నిరంతరం తమగురించి ఇతరులేమనుకుంటారోనన్న మథన.

ఆ మథనంలోనుండి ఇతరులను - ముఖ్యంగా తనమీద ఆధారపడిన వారిని - అదుపుచేయాలని, తన అభిరుచులకనుగుణంగా





మార్చాలని శతధా ప్రయత్నిస్తుంటారు. గూడు కట్టుకుంటున్న అసంతృప్తి అంతరంగంలో ఎక్కడో దాగిఉండి బద్ధలై ఇతరులలో వారు అంగీకరించలేని అంశాలుంటే సహించలేని స్థితి తెచ్చిపెట్టి వారిని అవమానపరచాలని, భిన్నమైన వ్యక్తిత్వాన్ని నాశనం చేయాలన్న దౌర్జన్యధోరణి పెచ్చుపెరిగిపోతుంది. తమలో చెలరేగే ప్రమాదకరమైన ఆలోచనలు అణచు కుంటూ అసలటువంటివి తమలో లేవని సరి పెట్టుకుంటూ తమ కోరికలకు విరుద్ధంగా ప్రవర్తిస్తుంటారు. తమ దౌర్జన్యధోరణిని, అసహ నాన్ని అదుపులో పెట్టుకోలేక ఏదో ఒక సంద ర్భంలో వాటిని విపరీత రూపంలో వ్యక్తపరుస్తూ ఒక్కోసారి జీవితాలనే నలిపి నాశనం చేసే స్థితికి చేరుకుంటారు.

ఇవన్నీ నాగభూషణంలో గాఢంగా పేరుకు పోయి ఉన్నాయి. అందుకే అతడిలో ఈ దౌర్జ న్య ధోరణి, అసహనం ఇతరులను అవమా నించడం, నలుగురిలో ఉన్నప్పుడు తన స్వ భావాన్ని మరుగుపరచుకోవాలనే తాపత్ర యంలో నీతులు వల్లించడం వగైరాలన్నీ.

ఇటువంటి మానసిక స్థితిలో ఉన్న ఈ మూర్ఖుడికి ప్రేమికులను వేరుచేయాలని తీవ్రంగా ప్రయత్నిస్తే దానివల్ల ఆ ప్రేమికుల మధ్య ప్రేమభావం మరింతగా బలపడు తుందని,వ్యక్తులు కలిగించే అవరోధాలు, బల వంతపు ఎడబాటు, భయం - అన్నీ ఆ ప్రేమ భావనను మరింత బలవత్తరం చేస్తాయని తెలియదు.

నేనూ నాగభూషణాన్ని తీవ్రంగా చూస్తూ - "రాక్షసులంటే ఎవరో కాదు, మీరే... మీరే... ఛీ" అని తుపుక్కున ఉమ్మేసి వడివడిగా అక్కడి నుండి వచ్చేశాను.

★ ★ ★

కోర్టు హియరింగ్ జరిగి పదిహేనురోజులు పైనే కావస్తోంది. తరువాతి వాయిదాకు ఇంకా పదిరోజులు గడువుంది.

మనసు బాగుండక, ఆఫీసుకు వెళ్లాలని పించక ఆరోగ్యం బాగుండడంలేదని ఆఫీ సుకు నెలరోజులు సెలవు పెట్టేశాను.

ఆప్తంగా భావించే ఎవరినైనా, ఏ సంఘట ననైనా హృదయానికి దగ్గరగా తీసుకోవచ్చు. కాని 'ఏమోషనల్'గా మాత్రం దగ్గరకు తీసుకో కూడదని ఎక్కడో చదివాను.

అనుభవాభిమానాల కోసం అల్లాడే నీ మన సుని హత్య చెయ్యి. లేదా నరకమెలా ఉంటుందో తెలుసుకో అని నా మిత్రుడొకడు హితవు చెప్పాడు.

కాని, అవి రెండూ నాకు సాధ్యంకానివి. హృదయం మెచ్చినవారిని, ఆత్మీయులుగా భావించినవారిని హృదయంలోకే కాదు, ఎమో షనల్‌గా నా దగ్గరకు తీసుకోవడం ఓ అలవాటై పోయింది. అభిమానాన్ని పంచిస్తూ, దాన్ని తిరిగి అందుకుంటూ జీవితానికి ఆప్యాయతా నురాగాలతోనే అర్థం చేసుకోవాలని నా నిరంతర ప్రయత్నం.

ఆ రెండూ నాకు నరకాన్ని చూపించలేకపో యినా హృదయం నలిగిపోవడమంటే ఏమిటో ఎప్పటికప్పుడు రుచిచూపిస్తూనే ఉన్నాయి. ఈ ఆధునికయుగంలో జీవితానికి ఉన్నత విలువ లు, ఆప్యాయతలతోకాక లౌక్యంతో, డబ్బుతో, పైపై మెరుగులతో, మెహర్బానీలతో అర్థం చెప్పుకోవాలని ఎదురయ్యే ప్రతిఘటన రు జువు చేస్తూనే ఉన్నాయి.

ఇప్పుడు జరుగుతోందీ అదే.

జీవన్, పూర్ణిమ, నాగభూషణంల ప్రభావం నామీద అధికమైనది. మనసు పదేపదే వారి గురించి ఆలోచిస్తోంది. కాసింతసేపు కూడా ప్రశాంతంగా ఉండలేకపోతున్నాను.

మామధ్య రక్తసంబంధం లేకున్నా నేను చేయగలిగేదేమీ లేకున్నా ఏదో బంధం గాఢంగా నన్ను జీవన్, పూర్ణిమలవైపు లాగు తోంది. వారిబాధ నా బాధగా మనసు అల్లాడి పోతోంది.

మా మధ్య బంధం- మేము పెంచుకున్న స్నేహానుబంధమో, ఏ జన్మలో తీరక మిగిలిన రుణానుబంధమో!

ఇంట్లో కూర్చోబుద్ధికావడంలేదు. విశాఖప ట్నంలో ఉన్న స్నేహితుల దగ్గరకెళ్లి అక్కడో వారం గడిపి వద్దామనుకుని వెళ్లాను. కాని అక్కడ ఉండలేకపోయాను. నాలుగురోజుల్లో తిరిగి వచ్చేశాను.

ఈ మధ్యకాలంలో పూర్ణిమ కబుర్లేమీ తెలి యలేదు.

'చేజారిన పరిస్థితులను తిరిగి మన చేతులలోకి తీసుకుని చేతనైతే సరైన మార్గం చూపించడం ఒక జీవితానికి చేసిన మేలవుతుందేమోకదూ' అనిపూర్ణిమ రాసిన వాక్యాలే మదిలో మెదులుతున్నాయి.

ఈ పరిస్థితిని ఎలా సరిచేయగలను? సరైన మార్గం ఎలా చూపించగలను?

పూర్ణిమ రాసిన ఆఖరిలేఖ- తను జీవన్‌తో వెళ్లిపోయేముందు రాసిన లేఖకోసం నాలుగైదురోజులనుండి వెదుకుతున్నాను. దాదాపు అయిదునెలల క్రితంనాటి ఉత్తరం. ఇన్నాళ్లూ దానిగురించే మరచిపోయాను. విశాఖనుండి వచ్చాక లాయర్‌ను కలిసి మాట్లాడివస్తుండగా గుర్తొచ్చింది. వెంటనే ఇల్లంతా గాలించాను. ఎక్కడ దాచానో గుర్తులేదు. వెదికివెదికి విసుగొచ్చి అమ్మమీద విసుక్కున్నాను.

నా గది సర్దుతున్నప్పుడు షెల్ఫులో, దాంట్లో వేసిన పేపర్లకింద, పుస్తకాల మధ్య, నేను ఉంచిన టికెట్స్ పాతబిల్స్, చిన్న చిన్న కాగితాలు పనికిరావని పారేస్తుంటుంది అమ్మ. ఎన్నిసార్లు చెప్పినా అంతే.

"అదెందుకు పారేస్తానురా నిన్నడగకుండా చూడకుండా ఏ కాగితం పారేస్తానూ. టికెట్లవీ జేబులో చెత్త ఎందుకని తీసేస్తేగాని ఉత్తరాలెందుకు తీస్తాను. అయినదానికి కానిదానికి బాగా ఎగరడం, విసుక్కోవడం అలవాటయింది. ఎక్కడ పెట్టావో గుర్తుతెచ్చుకో' అని నన్నే కోప్పడింది అమ్మ.

ఆ ఉత్తరాన్ని పొరపాటుగా ఎక్కడైనా పెడితే ఎవరి దృష్టిలోనైనా పడుతుందేమోనని వారంపైగా నా జేబులోనే పెట్టుకుని తిరిగాను. తర్వాత ఎక్కడైనా పెట్టానో, పొరపాటుగా జేబులోనే వుంచి బట్టలు లాండ్రీకి వేశానో ఎంత ఆలోచించినా గుర్తురావడంలేదు.

ఒకరోజు-

ఆరోజు పొద్దుటినుండీ పూర్ణిమ ఎలావుందో చూసిరావాలని మనసు పీకుతోంది.

గతంలో ఎదురైన అనుభవాలు, పరాభవం దృష్ట్యా దాన్నణచుకుంటూ గడిపాను కొంతసేపు. అయినా ఉధృతమవుతున్న దాన్నాపుకోలేక పూర్ణిమ ఎలాగైనాసరే కలిసి మాట్లాడిరావాలనే నిశ్చయంతో వాళ్లింటికి బయలుదేరాను.

దగ్గరకువేసి ఉన్న వరండా గ్రిల్ తలుపులు తీసుకుని సరాసరి లోపలికి వెళ్లాను. నా అదృష్టంకొద్దీ నాగభూషణం, కరుణాకర్ ఇంట్లో లేరు.

తలుపు శబ్దంవిని వంటగదిలో ఉన్న పూర్ణిమ తల్లి వచ్చి నన్ను చూసి హడావిడిగా నా దగ్గరకొస్తూ- "ఎందుకొచ్చావ్. బయటకు నడు" అంది.

ఆమె మాటలు పట్టించుకోనట్లుగా ముందు కడుగేసి ఎడంచేతి పక్కరూం బయటగొళ్లెంపెట్టి ఉండడం చూసి తీయబోయాను. నా కడ్డుగా నిలుచుని చేత్తో బయటకు చూపిస్తూ- "నీకే చెప్పేది వినబడడంలా. ముందు బయటకు నడు" అంది కోపంగా.

ఒక్కక్షణం ఆవిడను చూసి సందేహించినా మరుక్షణమే ఒక పక్కకు లాగేసి గొళ్లెంతీసి లోపలికి వెళ్లి వెంటనే లోపలివైపు గడియపెట్టాను.

పూర్ణిమ కిటికీలో కూర్చుని మోకాళ్ల చుట్టూ చేతులు బిగించుకుని కూర్చుని తదేకంగా బయటకు చూస్తోంది.

"పూర్ణిమా" నెమ్మదిగా పిలిచాను. ఆమె తలతిప్పి చూడలేదు. మళ్లీ పిలిచాను. ఆ పిలుపూ విన్పించనంతటి పరధ్యాన్నంలో ఉందేమో ఇటు తిరగలేదు.

నేను వెళ్ళి ఆమె పక్కనే నిలుచున్నాను. కిటికీనుంచి బయటపడిన ఆ చూపుకి-

ఆ పక్కనే ఉన్న తాటాకు ఇంటిచూరులో ఉన్న రెండు పిచ్చుకలు కన్పించాయి. అవి ఒకదాని ముక్కును మరొకటి తాటించుకుంటూ ముక్కులతో మెడలను దువ్వుకుంటూ ప్రేమను కలబోసి మురిపాలాడుకుంటున్నాయి. ఇంటిముందు వాకిలిలో కోడిపెట్టరెక్కలు చాపుకుని ఆ రెక్కలకింద ఒదిగి ఒదిగి నడుస్తున్న కోడిపిల్లలతోపాటు ముందుకు నడుస్తూ గింజల్ని వెతుక్కుంటూ ఏరుకుంటోంది.

ఆ దృశ్యాల్ని చూస్తూ పూర్ణిమ ఏదో తీవ్రాలోచనలో ఉందో లేక శూన్యం నిండిన మనసులో వేటినైనా చిత్రించుకుంటుందో తెలియలేదు.

ఆమె భుజం మెల్లగా తడుతూ- "పూ





ర్ణిమా'' అని పిలిచాను.

ఉలిక్కిపడి తలపక్కకి తిప్పిచూసింది.

ఆమె ముఖాన్ని చూసి నాకు మతిపోయినట్లనిపించింది. నిజంగా పిచ్చిదిలాగే కనిపించిందామె.

కొద్దిరోజులలో ఎంత మార్పు. మానసికమైన బాధ ఇంత త్వరగా మనిషి రూపురేఖలు మార్చేస్తుందా?

ఏడ్చి ఏడ్చి అలసిపోయి ఇక ఏడవడానికి ఓపికలేక బయటకు రావడానికి కన్నీళ్ళు లేక జీవం ఏనాడో పారిపోయిన పూర్ణిమ కళ్లు ఏవో అగాధాల్లోకి రాలిపడి అడపా దడపా గుడ్డివెలుతురు విరజిమ్ముతున్న నక్షత్రాల్లా ఉన్నాయి.

నుదుట బొట్టులేదు. జుట్టు చిందర వందరగా ఉంది. బుగ్గలు పీక్కుపోయాయి. లేలేత గోధుమరంగు పెదవులు నల్లబడి ఈ లోకంమీదే అలిగినట్లు ముడుచుకుపోయాయి.

శుష్కించిపోయి దాదాపు అస్తిపంజరం ఆకారంలో ఉన్న పూర్ణిమను చూస్తుంటే అసలు వీళ్లీమె గురించి పట్టించుకుంటున్నారా? తిండి పెడుతున్నారా? అనే సందేహం కలిగింది.

ప్రేమ. దానికోసమేగదా వీళ్లిలా తయారయింది. ఈ ప్రేమకింతటి బలవత్తరమైన శక్తివుందా?

భాషకందని మధురభావనగా హృదయాన్ని ఆక్రమించి, శరీరమంతా పాకి ఉత్తేజాన్ని కలిగించి, నిర్వచించలేని ప్రకంపనాల్లో ముంచి, ఆనందం, సంతృప్తితోపాటు ఆరాటాన్ని పెంచి మనసును నలిపి ఎవరి రూపంగా తను ఉద్భవించిందో ఆ మనిషి పొందుకోసం తపనపడుతూ ఆ వ్యక్తి సమక్షంలో ఉద్రిక్తతతో ఒక లయగా ధ్వనిస్తూ ఒక లహరిగా ముంచేస్తూ ఒకరిలో ఒకరిని మమేకం చేసే ఆ ప్రేమ కోరి జీవితం పంచుకున్న వ్యక్తి దూరంచేయబడితే కలిగించే మానసిక సంఘర్షణ, పరిస్థితులతో జరిపే మానసికపోరాటం ప్రభావాలింత గాఢంగా ఉంటాయా? మనిషినీ స్థితిలో నిలుపుతాయా... ఎన్నో ఆలోచనలు నాలో.

పూర్ణిమ మొదట్లో గుర్తుపట్టనట్లు నన్ను అయోమయంగా చూసింది. ఆ తర్వాత ఆ కళ్లలోని భావం మారింది. అంతకుమునుపున్న శూన్యంస్థానే కాసింత వెలుగు.

మెల్లగా మంచందిగి నిల్చుంది.

ఆమె నుదుటమీద పడుతున్న జుట్టు సరిచేశాను.

అమాంతం నన్ను వాటేసుకుని- ''అన్నయ్యా'' అంటూ తన తలను నా గుండెకేసి బాదుకుంది.

ఆ గుండెలో కోటి అగ్నిపర్వతాలు పేలినా ఆ ధ్వని అస్పష్టంగా కన్నీరురాని వెక్కిళ్ల నడుమ బయటకు వచ్చింది. మనిషి నిలువెల్లా కంపించిపోతోంది.

బయటనుండి పూర్ణిమ తల్లి తలుపులు బాదుతోంది.

''పూర్ణిమా'' అంటూ ఆమెని పొదివిపట్టుకుని గడ్డం పట్టుకుని తలపైకెత్తి- ''ఇటు చూడమ్మా'' అన్నాను.

ఒక నిమిషం తర్వాత తననితాను సంభాళించుకుంటూ, నీరసంతో తడబడే అడుగులతో నన్ను విడచి షెల్ఫ్ దగ్గరకు వెళ్లి పేపర్‌కింద దాచిన కాగితం తెచ్చి నాకిచ్చి,

''వెళ్లిపో అన్నయ్యా. జీవన్‌ని ఎలాగు కలవలేను. చూడలేను. నిన్నయినా చూసి నీకిదివ్వాలనే బతికి వున్నాను. నీవొస్తావని నాకు తెలును. వీళ్లంతా అడ్డగించినా ఈ చెల్లిని చూసుకోవడానికి రాకుండా ఉండవనే నమ్మకంతోనే ఇది రాశాను. జీవన్ కోసం నేను తపన పడినంత కాలం నన్ను ఈ రాక్షసులు బతకనీయరన్నయ్యా. నిన్ను చూశారంటే మరీ మండిపడతారు. వెళ్లిపో'' ఉద్విగ్నంగా వణుకుతున్న స్వరంతో అంది.

నా నోటివెంట మాటరాక నాలో కలుగుతున్న బాధను దిగమింగుతూ ధైర్యం చెబుతున్నట్లు పూర్ణిమ చెక్కిలి నిమిరాను.

''జీవన్ ఎలా ఉన్నాడన్నయ్యా'' కళ్లు తుడుచుకుంటూ అడిగింది.

''బతికివున్న శవంలా'' అప్రయత్నంగా అనేశాను. అన్నాక ఎంతమాటన్నాను అనిపించి నొచ్చుకున్నాను.

దిగులుగా నిట్టూర్చింది.




''పరిస్థితి మారుతుందనే ఆశిద్దాంపూర్ణిమ'' ధైర్యం చెబుతున్నట్లుగా అన్నాను. నా మాటలలో అవనమ్మకమేగాని నమ్మకం ధ్వనించినట్ల నిపించలేదు నాకే?

ఆ ఆశలేదన్నట్లు తల అడ్డంగా ఊపి- ''ఒకసారి మారితే అవకాశం ఏదో రూపేణా వచ్చింది. ఇప్పుడు మళ్లీ అలాంటి అవకాశం లభిస్తుందన్న ఆశ నాకు లేదన్నయ్యా'' అంది.

ఎక్కడో ఇంకా లోలోతుల్లో మిగిలివున్న కొంచెం తడి ఆ కన్నుల్లో.

''నిరాశ వద్దు పూర్ణిమా. అది మనిషిని కాస్త కాస్తగా మింగేస్తుంది. కొడిగట్టబోతున్నదైనా ఆశను ఆధారం చెసుకుంటే అదే ఏదో ఒకదారి చూపించకపోదు'' అన్నాను.

వాళ్లమ్మ ఇంకా నన్ను తిడుతూ తలుపులు గట్టిగా బాదుతూనేవుంది.

అది పట్టించుకోకుండా పూర్ణిమను మంచంమీద కూర్చోబెట్టి ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను.

''అన్నయ్యా'' అర్ధ్రమైన ఆమె పిలుపు.

''ఏమ్మా'' అన్నాను చేయి నిమురుతూ.

''ఆనాడు ప్రేమను నిర్వచించగలవా అని నీవడిగితే అదోశక్తి అని చెప్పానుకదూ. మా జీవితాలను కలిపిన ఆ శక్తి ఆనందంలో పెరిగి పెరిగి ఒక్కసారిగా క్షీణించిపోయింది. బావనలో శక్తి ఉన్నా అదీ తగ్గిపోతోంది. భౌతికంగా అసలే లేదు. అందుకే అసాధ్యమని పరిస్థితులు రుజువులు చూపిస్తుంటే ఎంతగా ప్రయత్నించీ ధైర్యాన్ని ఓక్కబట్టుకోలేకపోతున్నాను. కాని నిన్ను చూడగానే మళ్లీ నాలో ఏదో ఆశ రెపరెపలాడుతోంది- నీ ద్వారా మళ్లీ ఆ శక్తి భౌతికంగా, మానసికంగా బలం పెంచుకోగలుగుతుందేమోనని'' అంది నా చేయి గట్టిగా పట్టుకుంటూ.

పూర్ణిమ భావం అర్థమైంది.

ఆప్యాయంగా చూస్తూ- ''నాలో ఊపిరి నిండిన ఆఖరిక్షణం వరకు నీ కోసం ప్రయత్నిస్తాను పూర్ణిమా'' అన్నాను.

''నీ ఆఖరి క్షణంవరకు ప్రయత్నిస్తానని చెప్పు. అది చాలు నాకు'' అంది సరిచేస్తున్నట్లుగా.

''పూర్ణిమా'' బాధగా అన్నాను.

లోకంలోని వేదనంతా పోగుచేసి తయారు చేసిన బొమ్మలా నిర్జీవంగా పూర్ణిమ... 'అన్నయ్యా...' అంటూ ఆ గుండెలోతుల్నుండి పిలిచే పూర్ణిమ... రక్తంపంచుకు పుట్టకపోయినా అప్పుడిగా భావించిన తన బాధంతా నాతో చెప్పుకుని మనసుకు నచ్చినవాడితో పాణిగ్రహణానికి నన్నాధారం చేసుకున్న పూర్ణిమ... తనని నేనేదో రక్షిస్తానని ఆశించిన పూర్ణిమ... ఆమె, ఈమె ఒక్కరేనా అన్పిస్తోంది.

బయట తలుపులు బాదుతున్న శబ్దం నిలిచిపోయింది. బహుశా ఎవరినైనా పిలవడానికి వెళ్లుంటుందావిడ. త్వరగా బయటపడడం మంచిది అనుకున్నాను.

శూన్యంలోకి చూస్తున్నట్లు ఏదో చూస్తూ నెమ్మదిగా అంది పూర్ణిమ. ''అన్నయ్యా. మనలో ఒక నమ్మకం, ఒక ఆశ. నిండుగా ఉన్నంతకాలం ఏ అవాంతరం అవాంతరంగా కన్పించదు. కాని అవి సన్నగిల్లుతున్న ప్రతిక్షణం అంతరంగం ఐహిక మనుగడకు దూరమైపోతుంటుంది. ఇప్పుడు నాలోనూ అదే పరిస్థితి.

''నేను చేసిన తప్పేమిటన్నయ్యా? నాదైన ఆనందాన్ని నాకు నేనేగా కోరుకోవడమా? అది నేరమా? అదే నేరమైతే నా తల్లి, అన్నయ్యలు చేస్తున్నదేమిటి? కులంవేరు కావడం, ఒకసారి పెళ్లవడం నాతో జీవన్ బంధానికి అనర్హతలా? అయితే నా తల్లి కులం ఏమిటి? నా తల్లిని ఉంచుకున్న వ్యక్తి కులమేమిటి? వీళ్లందరికి మళ్లీ ఎన్ని కులాలవాళ్లతో సంబంధాలు? జీవన్‌తో బంధం కలుపుకోవడానికి మనకి ఉన్న అర్హత ఏమిటి అనే ఆలోచన వీళ్లకు ఎందుకు లేదు? అసలు వీళ్లలో ఉండి నా జీవన్‌కి లేనిదేమిటన్నయ్యా?''

ఆవేశం నీరసించిన దేహాన్ని కుదిపేస్తుంటే వణుకుతూ ప్రశ్నించింది. పగిలిన గుండె చిమ్మిన ఒక్కొక్క రక్తపుబొట్టు ఒక్కొక్క ప్రశ్నగా రూపుదాల్చింది.

నన్నే చూస్తున్న పూర్ణిమ నిర్జీవనయనాల్లో అప్పటివరకు లేని వింతకాంతి. నాకు మాత్రమే అర్థమవుతున్న భాషనియ్యలేని ఆ కాంతి వెనక అనంతమైన క్షోభ.

ఆమె పెదవులపై మెల్లగా దరహాసం చోటు

చేసుకుంది. అది తన ప్రశ్నలతో లోకాన్ని సవాలు చేస్తున్న నవ్వు. తన వాళ్లలోని రాక్షసత్వం అనుభవానికి వచ్చి వాళ్లమీద అపారమైన జాలితో నవ్వే నవ్వది.

"నీ జీవన్‌కు, నీకు లేనిది వాళ్లలా హృదయాల్ని చంపుకుని మూర్ఖత్వాన్ని, పశుత్వాన్ని నింపుకోవడం" అన్నాను.

రెండు క్షణాలేదో ఆలోచిస్తూ- "అన్నయ్యా..." అంది మెల్లగా పిలిచిన ఆ పిలుపులో శతకోటి దుఃఖాశ్రువులు.

"నా జీవన్ నపుంసకుడట. వీళ్లకు మేనల్లుడిని ఇవ్వబోయిన జీవన్‌ని నపుంసకుడిని చేసేశారు. చెల్లెలనే భావం కూడా లేకుండా నన్ను పిచ్చికామంతో కళ్లు మూసుకుపోయిన దాన్ని చేశారు. చాలా... చాలా గొప్పవాళ్లు కదన్నయ్యా వీళ్లు" నవ్వుతూ అంది.

"ఇటువంటి అన్నయ్యలూ ఏ ఆడపిల్లకూ వద్దు. ఎన్ని జన్మల పాపంగా ఈ తల్లి కడుపున, వీళ్లకు తోబుట్టువుగా జన్మించానో" అని చేతుల్లో ముఖందాచుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

"పూర్ణిమా... పూర్ణిమా ఊరుకోమ్మా. ఆ కళ్లు జ్యోతుల్లా ఉన్నాయమ్మా ఏడ్చి ఏడ్చి. ఇంకా ఇంకా ఏడవకమ్మా" అన్నాను ఆమె తలను నా భుజంమీద ఆనించుకుని నిమురుతూ.

ఇక బయలుదేరమని, ఇప్పటికే ఆలస్యమైందని మనసు హెచ్చరిస్తోంది.

దుఃఖంనుండి తేరుకుంటున్న పూర్ణిమను చూస్తూ- "బాగా నీరసించిపోతున్నావు. జీవన్ కోసమైనా కాస్త ఓపిక తెచ్చుకో. లేని ఆశ నింపుకోవడానికి ప్రయత్నించమ్మా" అన్నాను.

నా భుజంమీదే కళ్లు మూసుకుని తల ఆనించి మౌనంగా ఉండిపోయింది.

"వెళతానమ్మా. వాళ్లొస్తారేమో" అన్నాను.

కళ్లు తెరచి నన్ను చూస్తూ- "మళ్లీ నిన్ను చూస్తానా అన్నయ్యా" అనడిగింది.

"తప్పకుండా" అని ఆమె చేయిపట్టుకుని ధైర్యం చెబుతున్నట్లు నిమిరి వదిలాను.

నా చేయిని పట్టుకుని మెల్లగా ముద్దు పెట్టుకుంది. రెండు అశ్రుకణాలు- "నీ వెంటే మేము వస్తాం" అంటూ నా చేయిమీద వాలాయి.

అడుగు ముందుకు పడని నిర్బలత నాలో.

అయినా వెళ్లక తప్పని నేను భారంగా నిట్టూరుస్తూ నెమ్మదిగా అడుగులేస్తూ తలుపు వరకు వెళ్లి వెనుదిరిగి పూర్ణిమను చూసాను.

ఆమె కళ్లలో ఒంటరిగా వదిలేసి వెళ్లిపోతున్నావా అనే ప్రశ్న. దానివెంటే మౌనఅభ్యర్థన.

క్షణం ఆలోచించాను. ఏదయితే అదవుతుందనుకుంటూ ఒక నిర్ణయానికి వచ్చేసి పూర్ణిమను సమీపించి ఆమె చేయి పట్టుకుని రమ్మన్నట్లు తలూపాను.

"పద వాళ్లు వచ్చేలోపు ఈ నరకంనుండి బయట పడదాం. ఏదోఒకటి తర్వాత ఆలోచించవచ్చు" అన్నాను.

ఒక్కసారి ధైర్యం తెచ్చుకుంటున్నట్లు - కళ్లు మూసి, తెరచి తలూపుతూ నాతో కలిసి అడుగేసింది.

తలుపు గడియతీసి తెరచి బయటకడుగెయ్యబోతూ ఆగిపోయాను.

ఎదురుగా రౌద్రావేశాలతో బుసలుకొడుతూ ఎనుబోతులా నిలుచున్న నాగభూషణం, వాళ్లమ్మ.

ఆ ఇద్దరినీ చూసి తల తిప్పుకుని పూర్ణిమ చెయ్యి పట్టుకునేముందుకడుగెయ్యబోయాను.

ఫట్‌మని నాగభూషణం పూర్ణిమను పట్టుకున్న నా చేయిమీద బలంగా కొట్టాడు. పూర్ణిమ తూలిపడబోయి తలుపు పట్టుకుని తమాయించుకుంది. నా అడుగు తడబడి ముందుకు పడ్డాను.

పూర్ణిమను లోపలకు ఒక్కతోపు తోసి "తలుపెయ్యమ్మా"అని వాళ్లమ్మనుద్దేశించి అని "ఒరేయ్... నీకెన్ని గుండెలురా? మేమింట్లో లేనప్పుడు రావడమే కాక దాన్ని తీసికెళుతున్నావా? నీ అంతు చూస్తాను" అంటూ భీకరంగా నామీదకు రాబోయాడు.

అతడు తోసిన తోపుకు పూర్ణిమ కిందపడిందికాబోలు "అమ్మా" అని కేకపెట్టింది.

ఆ కేకకు నా పేగులు బాధతో కదిలినట్లయింది.

తల్లి ఎటువంటిదైనా బాధలో, ఆపదలో తనకు తెలియకుండానే రక్షిస్తుందన్న ఆశతో 'అమ్మా' అని పిలిచింది.





నిజంగా తల్లి కావడం ఎంతదృష్టం!

కాని ఈ తల్లి ఒక పాషాణం.

నామీద పడబోతున్న నాగభూషణాన్ని తప్పుకుంటూ లేచి కూర్చున్నాను. దాంతో ఊపును ఆపుకోలేక తను కింద పడబోతూ తెలివిగా నా కాళ్లు పట్టుకుని లాగాడు. నిలబడబోయే నేను బాలన్స్ తప్పాను. నా తల బలంగా గుమ్మానికి కొట్టుకుని నుదురు చిట్లి రక్తం కారింది. రెండు క్షణాలు కళ్లు బైర్లుకమ్మాయి. తల విదిలిస్తూ తమాయించుకుంటూ లేవబోతుంటే వీపుమీద రెండు చేతులు బిగించి బాదుతూ "మందు పెట్టి దాని మనసు పాడుచేసింది చాలక ఇప్పుడు దాన్నిక్కణ్ణుంచి తప్పించబోతావ్ బే బద్మాష్" అన్నాడు.

నుదురుకు తగిలిన దెబ్బ కలిగిస్తున్న బాధను పళ్లబిగువున భరిస్తూ నాగభూషణం దెబ్బలను తట్టుకుంటూ పక్కకు తిరిగాను. అలా తిరుగుతూనే కుడికాలుతో ఈడ్చి అతడి కడుపులో తన్నాను. నొప్పితో "అబ్బా" అన్నా మనిషి నాకంటే భారీ కావడంతో తట్టుకుని మళ్లీ నామీదకు రాబోయాడు. శక్తిని కూడదీసుకుని లేచి రెండుచేతులు కలిపి బిగించిన పిడికిలితో అతడి గడ్డంకింద ఒక గుద్దు గుద్దాను. ఊహించని ఆ దెబ్బకు రెండు చేతులతో ముఖం కప్పుకున్నాడు.

నేను మళ్లీ గదిలోకి పూర్ణిమను తీసుకురాబోతుంటే ఆమె తల్లి గుమ్మానికడ్డంగా నిల్చుని పూర్ణిమ చేయిపట్టుకు లాగుతూ "దాన్నొదులు" అంది తీవ్రస్వరంతో.

ఈలోగా నాగభూషణం తేరుకుని గదిలోకి వచ్చి అతణ్ణి అవతలకు తోస్తున్న నన్ను "ఒరేయ్... నీ అంతు తేలుస్తాను" అంటూ మెడమీద చేయిపేసి విసురుగా బయటకు నెట్టాడు.

వాళ్లమ్మ పక్కకు తప్పుకుంది.

తూలిపడి మళ్లీ గుమ్మానికి కొట్టుకోబోతూ గోడపట్టుకుని నిలబడ్డాను. ఎర్రబడిన కళ్లతో భయంకరంగా నన్ను చూస్తూ కొట్టడానికి చేయెత్తాడు నాగభూషణం. ఎత్తిన అతడి చేయిని మధ్యలోనే అడ్డుకుని పూర్ణిమను చూశాను.

మంచంమీద పడి దిండులో తలదూర్చి వెక్కుతోంది. నా చూపు నాగభూషణం మీద నిలిచింది. మనిషి రూపంలోనున్న బ్రహ్మారాక్షసుడిలా కన్పించాడు.

అతడి చేయి వదిలేసి మమ్మల్ని చూస్తూ నుంచున్న పూర్ణిమ తల్లిని చూసి - "పొరపాటుగా మానవజన్మ ఎత్తిన పశువులు మీరంతా. ఛీఛీ" అని అడుగులు తడబడ్తున్నా అలాగే బయటకు వచ్చేసాను.

అప్పటికే ఈ గొడవకు గుమ్మందగ్గర చేరిన చుట్టుపక్కల జనంలోనుండి దారి చేసుకుని, నుదుటినుండి ఇంకా కారుతున్న రక్తాన్ని తుడుచుకుంటూ తల దించుకుని ముందుకు నడిచాను.

ఇంటికి రాగానే నన్ను చూసి- "ఆ అవతారం ఏమిటిరా? ఆ దెబ్బలేమిటి?" అని ఆదుర్దాగా అడిగింది అమ్మ.

"ఏమీ లేదులే" అంటూ నా గదిలోకి వెళ్లి తలుపు వేసేనుకున్నాను - "ఏంలేదంటావేమిటిరా?..." అని అమ్మ ఇంకా ఏదో అనబోతున్నా విన్పించుకోకుండా.

మంచంమీద పడుకుని శూన్యమైన మనసుతో పైకప్పువంక చూస్తూండిపోయాను చాలాసేపు. చూసి చూసి కళ్లు మూసిపడుకున్నాను. అప్పుడు పూర్ణిమ ఇచ్చిన కాగితం గుర్తొచ్చి లేచి పాంట్ జేబులోంచి తీసాను.

జేబులో కుక్కడంవల్ల నలిగిన కాగితం మడతలు సరిచేసి మంచంమీద దిండు తీసి గోడకానించి వేసుకుని కూర్చుని చదవడం మొదలెట్టాను. హడావిడిగా రాసిందేమో రాత గజిబిజిగా ఉంది.

"అన్నయ్యా,

ప్రేమించి పెళ్లిచేసుకున్నవాళ్లంతా ఇలాగే అయిపోతున్నారా?.." మొదటి వాక్యం చదివి ఆగిపోయాను. 'లేదు పూర్ణిమా, అందరికీ పంతంకోసం ప్రాణాలైనా తీసే పశుత్వం నిండిన అన్నయ్యలుండరమ్మా' మూగగా జవాబిచ్చింది మనసు.

"...ఒకనాడు, పైకి తన్నుకురాకపోయినా అనుభవానికి వచ్చేవాళ్ల దానవత్వంతో నేను బాధపడ్డానని చెబితే నీవు నమ్మావో, లేదో తెలియదు. కాని ఇప్పుడు నీవే చూస్తున్నావుగా. తీరదని, తీర్చేవాళ్లు లేరని, తీర్చుకోగల శక్తి



సాహసం లేదని ఏనాడూ ఏ కోరిక పెంచుకోలేదు. కావాలని పెంచుకున్నదొక్కటే - జీవన్‌తో జీవితం పంచుకోవాలని. తెగించి సాధించుకోగలిగాను. అల్లుకున్న ఆ బంధంతో తల్లిని కూడా కాబోతున్నాను. కాని మిగిలిందేమిటి? సాధించాననుకున్నది చేజారిపోయింది. కోరుకున్న ఒక్క కోరికను కాలం అవహసించి జీవన్‌ను దూరంచేసింది. నేనైనా కడదాకా బ్రతుకుతానన్న నమ్మకంలేదు. నిమిషనిమిషం కాలం తోడిపోస్తున్న ఈ చేదు వాస్తవాల వెల్లువలో ఉక్కిరిబిక్కిరై ఏక్షణంలో ఏంచేస్తుంటానో నాకై నేను అనే భయం.

"చచ్చిపోయానని అనుకున్నవాళ్లు అలాగే అనుకుని ఊరుకున్నా బ్రతికేదాన్ని. కాని బ్రతుకుతున్న నన్ను తీసికొచ్చి బ్రతకడానికనర్హురాలినని ముద్రవేసి కనీసపు అభిమానం, మానవత్వం లేకుండా తమ పంతాలకు బలిపశువుగా చేసుకున్నారు. కాని ఆశ్చర్యం కలిగించేదేమిటంటే, ఆడదీ ఒక మనిషేనని, ఆ మనిషికీ మనసుంటుందని, ఆ మనసుకూ విలువలనేవి కొన్ని ఉంటాయని, ఆ విలువలకు విలువ ఇవ్వాలని, తమ చెల్లెలైనంతమాత్రాన నేను తమ చేతుల్లో కీలుబొమ్మ కానవసరం లేదనే నిజాలు తెలియని వీళ్లు వీళ్లకి లేని పరువుని నాశనం చేసానని నన్ను నిందిస్తూ అది ఉన్నట్లు పాకులాడడం. వీళ్ల చరిత్ర ఇదీ. వీళ్ల బ్రతుకులు, మనసులు ఇంతగా కుళ్లిపోయాయి, వీళ్ల ఘనకార్యావి అని అన్ని విషయాలు ఇక్కడ తెలియని జనానికి తెలిసిన రోజున ఈ జనం, ఈ సంఘం వీళ్ళముఖాన ఎలా ఉమ్మేస్తారో, ఎంతగా ఛీ కొడతారో తెలుసుకుంటే బాగుండు.

"అన్నయ్యలు - ఆ మాట అనడానికే అసహ్యం వేస్తోంది. పిచ్చిదని ముద్రవేయడమేగాక నన్ను నిజంగానే పిచ్చిదాన్ని చేసేశారు. జీవన్ కట్టిన తాళిని తమ చేతులతోనే తెంపేశారు..."

అప్రయత్నంగా పళ్లు పటపట కొరుకుతూ "దుర్మార్గులు" అన్నాను పైకే. ఇందాక వెళ్లినప్పుడు పూర్ణిమ మెడలో తాళి ఉందో లేదో గమనించలేదు. నాకసలు ఆ ఆలోచన ఎందుకు వస్తుంది.

"... నన్ను తిడుతున్నారు. ఎన్నోరకాలుగా అసహ్యించుకుంటున్నారు. అయినాసరే నామానాన నన్ను వదిలేయక వాళ్లు గీసిన గీటు దాటరాదని ఆంక్ష పెడుతున్నారు. అదెందుకో నాకర్థం కావడంలేదు. లేచిపోయానని, ఒళ్లు కొవ్వెక్కి బరితెగించానని చీదరించుకుంటున్నారు. ఎక్కడికి పోయాను? నాకు కావాల్సిన బ్రతుకునందుకోవడానికి అంతేగా. వీళ్లంతా చరిత్రహీనులే. వీళ్లలా నేనూ చరిత్రహీననై మిగలకూడదనుకున్నాను. అదే తప్పా?

"ప్రేమరాహిత్యంలో అల్లాడిపోయిన ఇద్దరమూ ప్రేమానుబంధంతో జీవితాల్ని ముడివేసుకున్నాం. కాబట్టి ఆ జీవితం మధురకవిత అవుతుందనుకున్నాను. దాన్ని కాలరాసి, నా చరిత్రను చెరిపేసి, మలినపరచి, నిందలు వేసి నన్ను చరిత్రహీనగా చేసేశారు నా కలను వాళ్ల కర్కశత్వంకింద నలిపేస్తున్నారు. ఏతప్పు చేశానని నాకీ శిక్ష అన్నయ్యా?

"ఇది స్వయంకృతాపరాధ ఫలితమా? లేక నిర్దేశించబడిన శాపమా?

"వీళ్లు ఎందుకు మామధ్య ఇంతటి అగాధాల్ని పరుస్తున్నారు. మా గుండెలో మండే అగ్నిపర్వతాలనెందుకు ప్రతిష్టిస్తున్నారు? ఈ బాధ కక్కలేక మింగలేక ఒకరికొకరు దూరమైన ఒంటరితనంలో, నిశ్శబ్దంలో నిశ్శబ్దంకమ్మని ఎందుకు శాసిస్తున్నారు?

"ఇంక ఎక్కువగా రాసే ఓపిక కూడా లేదన్నయ్యా. భరించలేని వేదనాగ్నిని రగల్చడం మినహా ఏమీ ఇవ్వకపోయినా ఈ జీవితంనుండి పారిపోకూడదనుకున్నాను. గెలిచాననుకున్న గెలుపు క్షణికమేనని తెలుసుకునేటప్పటికే ఆలస్యమైంది. మిగిలిఉన్న కాసింత ఆశను వీళ్లు చంపేస్తున్నారు. జీవన్‌ని కలుసుకుంటానని, మళ్లీ మేం ఒకటవుతామనే నమ్మకాన్ని ఎందుకో క్షణక్షణానికి కోల్పోతున్నాను. జీవన్‌ను ప్రేమించిన హృదయం తిరిగి అతణ్ణి చేరేదాకా ఎంత బాధనైనా తట్టుకుంటుందనుకున్నాను. కాని నా ఆశలుడిగిపోతూ కోరిక కరిగి జారిపోతూ హృదయాన్నీ శక్తిహీనం చేసేసింది. ఈ కోర్టు గొడవ ఇప్పట్లో తేలుతుందన్న ఆశ, తేలినా అతడిని కలవగలనన్న నమ్మకం




నాలో అడుగంటిపోయాయి.

"అన్నయ్యా! అన్నీ... అన్నీ నానుండి దూర మైపోయాయి. పోగొట్టుకోవడమే జీవనలక్షణంగా పుట్టుకతో వెంటతెచ్చుకున్న ఆస్తి అయింది. కాలం దాన్ని ఎప్పటికప్పుడు రుజువుచేసింది.

"ఒకవేళ నేను చచ్చిపోతే ఆత్మోద్దీపన కొరవ డిన ఈ మనుషులు, నాలోని అంతర్జ్యోతిని ఎప్పటికప్పుడు కొడిగట్టిస్తూ వచ్చిన ఈ చరిత్ర హీనులెవరూ నా చితికి నిప్పంటించకూడదు. జీవన్‌తో కలిసి నీవే నా చితికి నిప్పంటించాలి. ఈ ఆఖరికోరిక తీరుస్తావు కదూ.

"జీవన్‌ని నీచేతనైనంతగా కాపాడడానికి ప్రయత్నించు. మళ్లీ జన్మనెత్తితే నీ బిడ్డగా పుట్టి రుణం తీర్చుకుంటాను"

-నీ చెల్లెలు పూర్ణిమ.

ఈ ఉత్తరం ఏ అనంతావేదనామయక్షణాన రాసిందో. ప్రతి అక్షరం ఆమె ఉన్న దయనీ యస్థితికి, హృదయాన నిండుకున్న దైన్యానికి, ముక్కలుగా కోసి నలుదిక్కులా వెదజల్లబడిన ఆ గుండెక్షోభకు దర్పణంగా నిలిచింది.

'ఇంతకాలం నీలో ప్రయత్నఫలితంగా నింపుకున్న శక్తితో బతికావు. ఇప్పుడా శక్తి హీనమైపోయిందని తొందరపడి ఏ అఘాయి త్యం చేసుకోకు పూర్ణిమా' - నా అంతరంగం దీనంగా అర్థించింది, ఆక్రోశించింది.

ఒకరి జీవితాన్ని అర్థంచేసుకోవడంకన్నా పరిహసించడం చాలా తేలిక. సృష్టిలో ఉత్కృష్టస్థితిని చేరుకున్న మనిషి ఈ దుర్బల తను దాటలేకపోగా అందులో కూరుకుపోతు న్నాడు. పరిణామస్థితిలో పరిణతి చెందవల సిన అతడి మనసు విశాలత్వంలోకి తొంగిచూ డడానికి బదులు కుంచించుకుపోతోంది, నీర సించిపోతోంది.

అనాదిగా మనిషి అంతరంగంలో సెంటి మెంట్స్‌కే అధిక ప్రాధాన్యత లభిస్తోంది. దేని కైనా సహించగల స్థితిని సంతరించుకుంటా డు గాని సెంటిమెంట్స్‌మీద తీసిన దెబ్బను త్వరగా మరచిపోలేడు. దాన్నుండికోలుకోనూలే డు. అది ఆసరాగా తీసుకుని ఆ సెంటి మెంట్స్‌ను దెబ్బతీస్తూ, బలహీనతల్ని 'ఎక్స్ ప్లాయిట్' చేస్తూ, అదుముతూ, సాటి మనిషి మరింతగా ఆ బలహీనతలో కూరుకుపోయేలా అవసరాన్ని సృష్టిస్తూ, భయపెట్టి లొంగదీసు కుని ఆ మానసికావసరాన్ని క్యాష్ చేసుకోవడం మనిషి ప్రాథమిక చర్యల్లో భాగంగా మారింది. అదెంత నికృష్టమైనదో తెలిసీ ఆ ఎక్స్‌ప్లాయిటే షన్ చుట్టూ పరిభ్రమిస్తూ ఒకరినొకరు కాటేసు కుంటూ సృష్టిలోని తమ ఉత్కృష్టతను మరచి మనుగడ సాగించే మనిషి నిజంగా ఎంత దుర్బలుడు.

పూర్ణిమలోని బలహీనతనాసరాగా చేసుకుని ఎందుకు ప్రవర్తిస్తున్నారు వీళ్లు? ఏమృగత త్వం వీళ్లనిలాఆవహించింది. తల్లి వుంచుకు న్న వ్యక్తిని బాబాయి అని పిలిచినప్పుడు అతడి కులం అడ్డురాలేదు. అతడికీ పె ళ్లాంపిల్లలు ఉండడం అడ్డురాలేదు. అప్పుడ డ్డురానివన్నీ ఇప్పుడెలా అడ్డువచ్చాయి.

చిన్నప్పటినుండి పెరిగిన వాతావరణంలో వాళ్లలో అంతర్గతంగా కరడుగట్టిన కరకు తనం ఈ సంఘటనవల్ల బయటపడి ఇంత విశృంఖలంగా మారిందా? ఏమిటి దీనికి మూలం? ఇంత మూర్ఖత్వానికి కారణం. తండ్రి తల్లినొదిలేయడం, తల్లి చేసిన పనికి తాము పెరిగిన లోకందృష్టిలో చులకనగా మిగలడం చెల్లెలిపోకతో మరింతగా తమను కాటేసిందను కుంటున్నారా? ఆ ఆలోచనే ఇంత దుర్మార్గంగా ప్రవర్తింపచేస్తోందా?



నేను పూర్ణిమ దగ్గరకు వెళ్లివచ్చిన రెండో రోజు-

ఉదయం ఎనిమిది గంటలు కావస్తోంది. అప్పుడే నిద్రలేచాను. బద్ధకంగా అన్పించ డంతో మంచంమీదే పడుకుని సీలింగ్ ఫాన్‌ని చూస్తూండిపోయాను.




నిన్నంతా ఇంట్లోనుండి బయటకు కదల్లేదు. చాలా మూడీగా, స్తబ్దంగా గడిపేసాను. నన్నావరించుకున్న పూర్ణిమ, జీవన్- ముఖ్యంగా పూర్ణిమ దుస్థితి గురించిన ఆలోచనలు ఎంత ప్రయత్నించినా వదలడం లేదు.

నేను చెప్పకపోయినా నాగభూషణం ఇంట్లో జరిగిన గొడవ అమ్మ, అన్నయ్యల చెవిని పడింది.

"ఏమిటిరా... నిన్నటినుండి అలా ఉన్నావు ఒంట్లో బాగుండలేదా" అనడిగి వద్దని చెప్పినా వినక ఆ విషయంలో తలదూర్చావు. ఇప్పుడు తల బద్దలుకొట్టుకుంటూ ఆలోచించి లాభం ఏమిటి? ఇక నీకు సంబంధం లేదని ఊరుకో. ఎంత స్నేహితులైతే మాత్రం ఇటువంటివి నెత్తినివేసుకుంటారా?" అంటూ కోప్పడింది అమ్మ.

అన్నయ్య సరేసరి. పైసాకు కొరగాని ఆ వెధవలతో తిరగొద్దురా అంటే వినవు. మంచి చెడు, ముందు వెనక ఆలోచించక స్నేహం స్నేహం అంటూ పూసుకుతిరిగి ఆ మధ్య పోలీసుల్ని ఇంటిమీదకు తీసుకొచ్చావు. నిన్న తన్నులు తినివచ్చావు. రేపేం తద్దినం తెచ్చిపెడతావ్" అంటూ కోపంగా కేకలేశాడు.

నా మౌనమే వాళ్ళిద్దరికీ సమాధానమయింది.

అదే సమయానికి ఇంటికి వచ్చిన అక్కా బావ ఇదంతావిని నాకు తమవంతు కర్తవ్యంగా చెయ్యాల్సిన హితబోధచేసేశారు.

ఎవరేం అన్నా, చెప్పినా మాట్లాడకపోవడంతో "చెప్తే వినవు. నీకు తోచదు. నీ మతం నీదే" అని విసుక్కున్నారు.

కిటికీ రెక్కలమీద పిచ్చుకలు చేరి కిచకిచలాడుతున్నాయి. తూర్పు వైపునున్న కిటికీలో నుండి నీరెండ లోపలికి జారుతోంది. మెల్లగా వీస్తున్నా గాలి ఉదయ పరిమళాలను తెచ్చి మీద చిలకరించి పోతోంది. చలికాలం కావడంతో ఎనిమిది అవుతున్నా కాస్త చలిచలిగానే ఉంది.

మనసులో ఏ ఆలోచన లేకుండా పడుకున్న నేను అస్పష్టంగా విన్పించిన మాటలతో ఉలిక్కిపడి ఒక్కుదుటున లేచి కూర్చున్నాను.

పనిమనిషి అమ్మతో చెప్తున్న సంగతి నాకు విన్పించింది.

నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను. నో నో అలా జరిగి ఉండదు. ఆమె అంతపని చేయదు. అది ఎవరిగురించో చెప్తోంది అని సరిపెట్టుకోబోయాను.

ఇంతలో తలుపు తోసుకుని కంగారుగా నన్నుపిలుస్తూ అమ్మ గదిలోకి వచ్చింది.

ఏమిటన్నట్లు చూశాను అమ్మని.

నేను అస్పష్టంగా విన్నది నిజంకాదు నిజంకాదని మనసు గొణుక్కుంటూనే ఉంది.

అమ్మ నన్ను రెండు చేతులతో పట్టుకుని "పూర్ణిమ ... పూర్ణిమ... అంటోంది.

నా గుండె వేగంగా కొట్టుకుంది. ఆ హెూరు చెవుల్లో ప్రతిధ్వనించింది. తొందరగా చెప్పమన్నట్లు అమ్మను అసహనంగా చూశాను.

"పూర్ణిమ ఆత్మహత్య చేసుకోబోయిందంట. కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుందంట. హాస్పిటల్‌కు తీసికెళ్లా..." అమ్మ చెప్తున్న మాటలు పూర్తికాకముందే ఆమె నవతలకు నెట్టి బయటకు పరుగెట్టాను.

రెండు నిమిషాల్లో నాగభూషణం ఇంటికి చేరుకున్నాను అదే పరుగుతో. ఇంటికి వేసిన తాళం దర్శనమిచ్చింది.

చుట్టుపక్కల ఇళ్ళలోని ఐదారుగురు ఆడవాళ్లు నాగభూషణం పక్క ఇంటిముందు గుమికూడి పూర్ణిమ గురించే మాట్లాడుకుంటున్నారు. ఆమెను ఏ హాస్పిటల్‌లో చేర్పించారని వాళ్లనడిగి వాళ్లు చెప్పింది విని పరుగెత్తాను.

హాస్పిటల్ దూరమనే విషయంకూడా గుర్తులేకుండా పరుగెడుతూనే హాస్పిటల్‌కు చేరాను. నిద్ర మంచంమీదనుండి హఠాత్తుగా లేచి వచ్చిన నావంటిమీద నలిగిన లాల్చీ పైజామా. జుట్టు చెరిగి పోయిఉంది. రొప్పుతూ ఎవరో తరుముకువస్తున్నట్లు పరుగెత్తున్న నన్ను చూసే జనాన్ని వారి చూపుల్ని పరిసరాల్ని దేన్నీ పట్టించుకునేస్థితిలో లేను.

హాస్పటల్ మెయిన్‌గేటునుంచి లోపలికి వెళ్లి ముఖద్వారం దగ్గరున్న మెట్లెక్కి లోపలికి అడుగుపెట్టి ఎటు వెళ్ళాలో తెలియక నిలబడి అటూ ఇటూ చూశాను.

అప్పుడే అటుగా వచ్చిన నర్స్ రొప్పుతూ

నిల్చున్న నన్ను నా అవతారాన్ని చూసి ముఖం అదోలాపెట్టి "యస్" అంది ప్రశ్నార్థకంగా.

"నర్స్... తెల్లవారుఝామున ఒళ్లుకాలిన ఒకలేడీపేషెంట్ని ఇక్కడ చేర్పించారట. ఆమెని ఏ రూంలో ఉంచారు" అనడిగాను..

"ఎక్యూర్ట్ మెడికల్‌కేర్ యూనిట్‌లో. ఇప్పుడు చూడడానికి వీలువడదు"అని తన టేబుల్ దగ్గరకు వెళ్లిందానర్స్.

ఎక్యూర్ట్ మెడికల్‌కేర్ యూనిట్. ఎ ఎమ్ సి యు అంటే చాలా వరకు ఒళ్లుకాలి సీరియస్ పరిస్థితి అయ్యుంటుంది. మనసులో కలిగిన సందేహాన్నే నర్సుని అడిగాను. ఆమె అవునని సమాధానమిచ్చింది.

"డాక్టర్‌గారెక్కడున్నారు?" ఆదుర్దాగా అడిగాను.

నర్స్ నన్ను చూస్తూ విసుగ్గా ముఖంపెట్టి "మీరామెకేం అవుతారు" అని ప్రశ్నించింది.

అడిగిన దానికి సమాధానం చెప్పక ఎదురు ప్రశ్నవేయడంతో చిర్రెత్తుకొచ్చినా అణచుకుంటూ మామూలుగానే అన్నాను. "షి ఈజ్ మై సిస్టర్. డాక్టర్‌గారి రూం ఏదో ఇప్పుడైనా చెబుతారా?"

"ఆ పెషెంట్ దగ్గరే ఉన్నారు" చెప్పింది నర్స్.

"అంటే ఎ ఎమ్ సి యులోనా?" అడిగాను.

"అవును"

"అదెటువైపు"

నర్స్ పక్కనే ఉన్న పొడవాటి కారిడార్‌వైపు చూపిస్తూ "రైట్‌సైడ్ టర్న్ కాగానే లాస్ట్‌రూం" అంది.

నేనటు పరుగెత్తి కుడిపైపు తిరిగి అడుగువేయగానే నాగభూషణం, కరుణాకర్, వాళ్ళమ్మ కనుపించారు.

నాగభూషణం, వాళ్లమ్మ గోడపక్కగా ఉన్న బల్లమీద కూర్చున్నారు. కరుణాకర్ వారి పక్కనే నుంచున్నాడు.

వాళ్లని చూస్తూనే నాకాళ్లకు బ్రేకులువడి అక్కడే ఆగిపోయాను. అడుగు ముందుకు పడలేదు.

'ఎక్యూర్డ్ మెడికల్‌కేర్ యూనిట్' అని బోర్డు తగిలించి ఉన్న గదితలుపులు మూసి ఉన్నాయి.

అప్పటిదాకా లేని నీరసం హఠాత్తుగా నన్నావరించింది. నిలబడిపోయిన చోటే గోడకు జారగిలబడి మోకాళ్లలో తలదాచుకుని కూర్చుండిపోయాను.

కొంచెంసేపటి తర్వాత వంచిన తల పైకెత్తి వాళ్లవైపు చూశాను. ముగ్గురూ నన్నే చూస్తున్నారు.

నేను చూడడంతో వాళ్లమ్మ తల దించుకుంది. నాగభూషణం ముఖం చాటుచేసుకుంటూ తల పక్కకు తిప్పుకున్నాడు. కరుణాకర్ ఒక్కడే నన్ను చూస్తున్నాడు. అతడి చూపులో ఉన్నదేమిటో నాకర్థంగాలేదు.

నేను మళ్లీ తల మోకాళ్లలో దాచుకుని కూర్చుండి పోయాను.

పూర్ణిమా! పుట్టిననాటినుండీ మూగ బాధననుభవిస్తూనే ఉన్నావు. ఎన్నో ఆవేశపు క్షణాలను నీలో అదుముకున్నావు. ఈ ఒక్క ఆవేశపు, ఆవేదనా క్షణాన్ని తట్టుకుని నీ మనసును అదుపుచేసుకోలేకపోయావా? పూర్ణిమా. నీవు వెలిగించిన దీపం దానికి తైలమైనిలిచే నీవు లేకుండా వెలగలేదని, ఆరిపోతుందని తెలిసీ ఎంత పనిచేసావమ్మా. అంతగా నీలోని శక్తినశించిపోయిందా?... కాదు... కాదు. హరించేశారు. నీ వట్టుదలని, నీ సబలత్వాన్ని అణగదొక్కి అబలవని పదేపదే గుర్తుచేస్తూ నీ శక్తిని మింగేశారు..."

ఎన్నో ఆలోచనలు... మరెన్నో దృశ్యాలు. ఏ ఒక్కటీ కళ్లముందు నిలవక మసకమసకగా కన్పించి తప్పుకుంటున్నాయి.

అలా ఎంతసేపుండి పోయానో నాకే తెలియదు.

భుజంమీద ఎవరిదో చేయివడడంతో తలెత్తిచూశాను. నా పక్కన కరుణాకర్. పెదవులు బిగబట్టి తన వేదననణచుకుంటున్నాడు. అతడు నన్ను లేపబోతుంటే నేనే లేచినుంచున్నాను.

ఇంతలో ఎ ఎమ్ సి యు గది తలుపు తెరచుకుని డాక్టర్, అయన వెనక ట్రేలో బాండేజీ, లోషన్స్, ఆయింట్‌మెంట్స్‌తో వస్తున్న నర్స్ కనుపించారు.



వాళ్లని చూస్తూనే "డాక్టర్ హౌ ఈజ్ షి" ఆదుర్దాగా డాక్టర్‌ని అడిగాను.

వేసుకున్న ఎప్రాన్ జేబులో చేతులు పెట్టుకుని డాక్టర్ "కాంట్ సే మిస్టర్. వియ్ విల్ ట్రై అవర్ లెవెల్ బెస్ట్. సిక్స్టీ పర్సంట్ బర్న్స్. మా ప్రయత్నం మేంచేస్తున్నాం" అన్నాడు.

ఆయన మాటల్లోని అర్థం మరోలా ధ్వనించింది నాకు.

"ఆమెని చూడవచ్చా డాక్టర్?"

"నో" అంటూ తల అడ్డంగా ఊపాడు.

"ఎప్పటివరకు డాక్టర్"

"టూడేస్... రెండు రోజులవరకు ఎలా చేయం" అని చెప్పి డాక్టర్ ముందుకు నడిచాడు. నర్స్ ఆయన్ని అనుసరించింది.

నాగభూషణం సిమెంట్‌తోనే జాలీలాగ కట్టిన గోడకంతల్లోంచి బయటకు చూస్తూ నిలుచున్నాడు. డాక్టర్ బయటకురాగానే లేచి నుంచున్న వాళ్లమ్మ ఆయన వెళ్లగానే బెంచీ మీద కూర్చుని మోచేతులు కాళ్లమీద ఆనించుకుని అరచేతుల్లో ముఖందాచుకుంది.

కరుణాకర్ ఇంకా నా పక్కనే నుంచున్నాడు.

అతణ్ణి చూస్తూ నెమ్మదిగా గొణుకుతున్నట్లుగా అడిగాను "పూర్ణిమ ఇంత దారుణానికెందుకు ఒడిగట్టింది. ఎలా జరిగిందిది?" ఎంతనెమ్మదిగా అడిగినా నాస్వరంలో కర్కశత్వం, బాధ- రెండూ ధ్వనించాయి.

అతడు చెప్పింది విని నివ్వెరపోయాను.

మొన్న నేను పూర్ణిమని చూద్దామని వెళ్లి నాగభూషణంతో గొడవపడి వచ్చేసాక అతడు పూర్ణిమను బాగా కొట్టాడు. ఆ సమయంలో ఆవేశంలో అతడు తన్నిన తన్ను పూర్ణిమ కడుపుమీద బలంగా తగలడంతో ఆమె భరించలేని బాధతో అరచి స్పృహ తప్పిపడిపోయింది. పూర్ణిమను మంచంమీద పడుకోబెడుతూ ఆమె కాళ్లదగ్గర రక్తాన్ని చూచి అదిరిపోయి కంగారుతో దగ్గరలో ఉన్న లేడీడాక్టర్‌ని తీసికొచ్చారు.

డాక్టర్ వచ్చి చూసి తెల్లబోతూ పూర్ణిమను పరీక్షించి పిండానికి దెబ్బతగిలి నలిగిపోయిందని అబార్షన్ అయిందని చెప్పి ఎలా జరిగిందని అడిగితే బాత్రూంలో కాలుజారిపడిందని చెప్పారు. ఆవిడ నమ్మక వీళ్లను తిట్టి పూర్ణిమకు స్పృహవచ్చేవరకు ఉండి ఏవో ఇంజక్షన్స్ ఇచ్చింది. పూర్ణిమ నొప్పి ఎక్కువై బాధపడితే ట్రాంక్విలైజర్స్ ఇవ్వమని చెప్పి ప్రిస్కిప్షన్ రాసిచ్చి వెళ్లింది. వెళుతూ పూర్ణిమను రెండు మూడు రోజులపాటు ఆసుపత్రిలో ఉంచడం మంచిదని కూడా సలహా ఇచ్చివెళ్లింది.

ఆవిడ సలహా వీళ్ల చెవికెక్కలేదు. పూర్ణిమ బాధ భరించలేక మెలికలు తిరుగుతుంటే డాక్టర్ రాసిచ్చిన మాత్రలు తెచ్చివేశారు. ఆ రాత్రంతా మెలకువలేకుండా పడుకుంది. నిన్నంతా కూడా బాధపడుతూనే ఉంది అయినా ఆసుపత్రిలో చేర్పలేదు. మళ్ళీ ఆ లేడీ డాక్టర్‌నే బతిమిలాడి తీసుకొచ్చి చూపించారు. ఆవిడ ఇంజక్షన్ ఇవ్వడంతో పూర్ణిమకు కాస్త ఉపశమనం లభించింది.

ఇవ్వాళ తెల్లవారుజామున అరుపులు విన్పించి అందరూ హడావిడిగా లేచి చూస్తే అలుముకుపోతున్న మంటల్లో పూర్ణిమ భీకరంగా కేకలు పెడుతూ, కింద పడిదొర్లుతూ కన్పించింది. వంటగదిగడపలో ఖాళీ కిరసనాయిలుడబ్బా, నేలమీద వొలికిన కిరసనాయిలు కన్పించాయి, మంటలెలాఆర్పాలో తెలియక నాగభూషణం, కరుణాకర్ నీళ్లు తెచ్చి పూర్ణిమమీద పోశారు. ఈ అరుపులు కేకలు, హడావిడికి ఇరుగుపొరుగువాళ్లు లేచి వచ్చారు. వీళ్లపక్కింటాయన వీళ్లు చేస్తున్న పనిని చూసి కసిరి రెండు దుప్పట్లు, రగ్గు తెచ్చి పూర్ణిమమీద పడేసి ఆమెని అటూ ఇటూ దొర్లించి మంటలార్పాడట. ఆ వెంటనే ఆయనే ఫోన్‌చేసి అంబులెన్స్ తెప్పించడంతో హాస్పటల్‌కు తీసుకువచ్చారు.

కరుణాకర్ చెప్పిన ఈ విషయమంతా విని నిర్ఘాంతపోయిన నేను పిచ్చిగా జుట్టు పీక్కున్నాను- "ఓహ్" అంటూ.

కరుణాకర్ కళ్ళలో కన్నీరు ఒలకడం చూసి "ఏడుస్తున్నావా? ఇప్పుడా? ఎందుకు" అని ఆవేశంగా అడిగాను.

అతడు మాట్లాడక తల దించుకున్నాడు సిగ్గుతో.

మొదట్లో నువ్వు కాస్త మెరుగనుకున్నాను.




బండోడివైనా చలనం, స్పందన ఉందనుకున్నాను. మీ అన్న చేస్తున్నదంతా ఆమోదించి నోరు మూసుకుని అన్నకు తగ్గ తమ్ముడివనిపించుకున్నావు. ఇద్దరూ కల్సి జీవితాల్ని నాశనం చేయడానికి కంకణం కట్టుకున్నారని'' ఈసడింపుగా అని విసురుగా నాగభూషణం దగ్గరకు వెళ్ళి అతడి జుట్టు పట్టుకుని తల పైకెత్తి బలంగా ఊపుతూ కళ్ళలోకి సూటిగా చూశాను.

''నీ లక్ష్యం నెరవేరిందా? ఇప్పుడు ఆనందంగా ఉందా? పంతం నెగ్గించుకున్నావుగా, పండగ చేసుకుంటావా? నిండు ప్రాణాన్ని బలిగొంటున్నావు కదరా రాక్షసుడా? నువ్వు మనిషిగా ఎలా పుట్టావురా? ఛీఛీ'' అని ఆవేశంతో నిలువునా కంపించిపోతూ అన్నాను.

అతడు ఏదో అనబోయి ఆగిపోయి కళ్ళు వాల్చేసుకున్నాడు.

''యూ యూ ఇన్‌హ్యూమన్ బాస్టర్డ్స్'' కసిగా, అసహ్యంగా అని బయటకు వచ్చేశాను.

హాస్పిటల్ బయటకు వచ్చి ఎటువెళ్ళాలో తెలియక నుంచున్నాను. మనసునా వరించిన బలమైన స్తబ్దత, ఒక్కసారిగా ముందుకొక్క అడుగువేయలేని అశక్తత.

నాకు తెలియకుండానే నేను తట్టుకోలేని డెలికసీ నన్ను కమ్మేసింది. పూర్ణిమకు జరిగిన అన్యాయం, ఇప్పుడీ దారుణం చెప్పలేనంతగా నన్ను కదిలించివేస్తున్నాయి.

ఏజన్మబంధం ఇది? వీళ్ళతో ఇంతగా ఎందుకు పెనవేసుకుపోయింది? ఆ ఇద్దరిలోని మనసుకు, అందులోని అభిమానానికి ఎందుకు లొంగిపోయాను? ఇంతగా ఎందుకు బందీనయ్యాను? ఏవిధి వాళ్ళనింతగా నలిపేస్తూ నాకూ పరీక్ష పెడుతోంది? ఎందుకిలా జరుగుతోంది? ఎందుకిలా జరుగుతోంది? సమాధానం దొరకని ప్రశ్నలు.

స్నేహమో, రుణానుబంధమో- ఏదైనా, నాకు కావాల్సినవాళ్ళు ఈ జీవన్, పూర్ణిమ అనేది నా అనుభవానికి వచ్చిన సమాధానం.

బరువుగా నిట్టూరుస్తూ అశక్తంగా కళ్ళు మూసుకున్నాను. కంటిపాపమీద మొన్న నేను చూసిన పూర్ణిమ రూపం దిండులో తల దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తున్న పూర్ణిమ రూపం. చెవుల్లో ఆమె మాటలు, ఇందాక డాక్టర్ చెప్పిన మాటల ప్రతిధ్వని.

ఆవేదనతో భారమైన తల, నుదురు రుద్దుకుంటూ జుట్టులోనికి చేయి పోనిచ్చి సరిచేసుకుంటున్న నా భుజంమీద ఒక చేయి నన్ను మెల్లగా కుదుపుతూ.

వెనక్కి తిరిగాను. కరుణాకర్. అతడి కళ్ళు ఎర్రగా ఉన్నాయి. బుగ్గలమీద తుడుచుకున్న కన్నీటి చారికలు.

చాలాసేపు మాట్లాడకుండా అతణ్ణే చూస్తూ నిలుచుండిపోయాను.

ఈ క్షణంలో నా ఎదురుగా ఉన్న కరుణాకర్‌లో నాకు పరిచయమైన తొలి రోజులనాటి అమాయకంగా, నిర్మలంగా ఉండే కరుణాకర్ కన్పించాడు.

మెల్లగా అతడి భుజం తట్టాను, కాని ఏంమాట్లాడలేదు.

అకస్మాత్తుగా అప్పటివరకు గుర్తురాని జీవన్ నా మదిలో మెదిలాడు.

అడుగులు లెక్కపెడుతున్నట్లుగా మెల్లగా నడచుకుంటూ జైలువైపు బయలుదేరాను. ఆస్పత్రినుండి జైలుకున్న రెండుమైళ్ళదూరం నాలుగు గంటలు నడిచినట్లుంది.

నా అవతారం చూసి అంతకుముందు జీవన్‌కోసం వచ్చివెళ్ళే నాకు పరిచయమైన జైలర్ ఆశ్చర్యపోయాడు.

ఆయనకు విషయం వివరించి చెప్పగానే జీవన్‌ని కలుసుకోవడానికి అనుమతించాడు.

జీవన్‌కీవిషయం ఎలా చెప్పాలో అర్థంకాలేదు. అసలు చెప్పాలా, వద్దా అనే సందేహం నాలో.

'ఇదంతా నీవల్లే జరిగింది' అని అంతరాత్మ చేసే ఘోషకు నావద్ద సమాధానం లేదు. 'ఆరోజు నువ్వు వెళ్ళకుండా ఉంటే ఇంత ఘోరం జరిగేది కాదు' చాచి చెంపదెబ్బ కొట్టినట్లు మనసు అరచింది.

ఎదురుగా నడచివస్తున్న జీవన్‌ను చూసి నిలబడలేనట్లుగా అక్కడున్న బెంచీమీద కూర్చుని కళ్ళు మూసుకున్నాను.

జీవన్ వచ్చి నా గడ్డం పట్టుకుని తల పైకెత్తి జారే కన్నీటిని తుడుస్తూ- "ఏమైంది.., ఏమిటీ కన్నీళ్లు? పూర్ణిమ ఎలా ఉంది? క్షేమంగా ఉందా?" ఆత్రంగా అడిగాడు.

నేను మాట్లాడలేదు.

"పూర్ణిమను చూడడానికి వెళ్లావా?" మళ్లీ తనే అడిగాడు. పూర్ణిమ గురించి తెలుసుకోవాలంటే నేనే తనకి ఆధారమనీ, నేను ప్రస్తుతం వాళ్ల గురించి మాత్రమే పట్టించుకుంటున్నాననీ జీవన్‌కు తెలుసు.

కోర్టులో ఆరోజు విచారణ జరిగిన తర్వాత జీవన్‌ని ఒక్కసారే కలిశాను.

కళ్లు తెరచి అతణ్ణి చూశాను.

నన్ను పట్టుకున్న జీవన్ చేయి వణుకుతోంది. మనిషిలో అతి బలహీనత. అతడు నన్ను పట్టుకున్నట్లుగా కాక నన్ను ఆసరా చేసుకుని నిలబడినట్లుంది. అతడి కళ్లలో మెరుపు ఏనాడో పోయింది. గాజుకళ్లలా ఉన్నాయవి. అతడి చూపు నాలోకి దూసుకుపోయి ఏదో వెతుక్కుంటున్నట్లనిపించింది. దానిని భరించలేకపోతున్నాను.

తల దించుకుని మొన్న నేను నాగభూషణం వాళ్లింటిదగ్గర జరిగిన గొడవంతా చెప్పాను. విని నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

కాలం బరువుగా, నడవలేనట్లుగా, నడుస్తూ నడుస్తూ ఆగిపోయినట్లనిపించింది నాకు.

"జీవన్" వినీ విన్పించనట్లు అతి నెమ్మదిగా పిలిచాను.

"ఊ" అంతకంటే నెమ్మదిగా అన్నాడు. ఆమోజనాల దూరంనుండి విన్పించినట్లనిపించింది ఆ శబ్దం.

"పూర్ణిమ..." అని ఆగిపోయిన నావంక, ఆసక్తిగా చూసాడు.

"పూర్ణిమ ఆత్మహత్యాప్రయత్నం చేసింది"

అసలు నా నోటెనుండి ఆ మాటలు వచ్చాయా అన్పించింది నాకే. కాని వచ్చాయి, వచ్చినట్లు మరో క్షణంలోనే రుజువయింది.

"ఏమిటీ" దాదాపు అరచినట్లుగా, ఆశ్చర్యంగా అడిగాడు. భయంగా, కీచుగా ధ్వనించిందతడి స్వరం. నన్నే చూస్తున్న అతడి చూపు నన్ను అంగుళం అంగుళం కోస్తున్నట్లనిపించింది.

"ఏంజరిగింది? పూర్ణిమకేమైంది. చెప్పు... చెప్పు" అంటూ నా షర్టు కాలరు రెండు చేతులతో పట్టుకుని బలంగా నన్నూపేస్తూ అడిగాడు.

జరిగినదంతా - నాకు ఆ విషయం తెలిసి నేను ఆస్పత్రికి వెళ్లడం, డాక్టరు పూర్ణిమను చూడడానికి అనుమతించకపోవడం, కరుణాకర్ చెప్పిన విషయం అంతా - చెప్పాను.

రెండు నిమిషాలు అచేతనంగా నిలబడిపోయాడు శిలలా. తర్వాత "ఓహ్" అంటూ తల గోడకేసి కొట్టుకున్నాడు. నేను అతణ్ణి పట్టుకుని ఇవతలకి లాగినా ఆగి నా రెండుచేతులతో నుదురు కొట్టుకుంటున్నాడు.

"ఎంతపని చేశావు పూర్ణిమా" ఆపుకోలేని దుఃఖపు తెరలమధ్య గుండె పగిలి ముక్కలు పైకెగిరినట్లుగా బయటికొచ్చాయా మాటలు.

"పూర్ణిమా... పూర్ణి...మా...నే...ను... గుర్తు...కు...రాలే...దా. నన్నొది...లి...పోదా...మనుకు...న్నా...వా. మన... సంసారం...మ...న...బాబు...మనక...ల...లు...అన్నీ ఏమ...య్యాయి...న...న్ను... అన్యా...యం... చేసి...ఒం...టరిని...చేసి పో...దా...మనుకున్నా...వా... నా...కోసమైనా బ్ర...తి...కే సాహసం... చే...య...లేక...పోయా...వా. ఎం...దు...కీప...ని... చేసా...వు. కల...ల...పం...టై...న కడుపు...పం...ట...పోయి...నా...నాకో...సం...నా...కోసం..."

వెక్కిళ్లమధ్య ఏమో గొణుక్కుంటున్నాడు. శారీరకమైన దుర్బలత అతడి మనసును ఏనాడో ఆక్రమించేసుకుంది. అందుకే తట్టుకోలేకపోతున్నాడు. మామూలుగా ఉన్న నా పరిస్థితే ఇలా ఉంటే ఇంకా అతడి పరిస్థితెలా ఉంటుంది.

చేయి గోడకానించి దానిమీద తల ఆనించి రోదిస్తున్నాడు - ఒక్కోసారి జుట్టు పీకేసుకుంటూ. అతడిని ఓదార్చలేకపోతున్నాను.

కొద్దిసేపటి తర్వాత హీనస్వరంతో అన్నాను "నేను వెళ్లివుండకపోతే ఇలా జరిగేది కాదు జీవన్. నన్ను క్షమించు" గిల్టీఫీలింగ్‌తో అతణ్ణి చూడలేక చూస్తూ అన్నాను.

జీవన్ దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్ని




స్తూ, నొసలు పైకిలేపి చూస్తూ మధ్య పిచ్చిగా నవ్వుతూ "క్షమించనా? ఎందుకు?" అని నిట్టూర్చి "మాది ప్రేమకాదని చెప్పినందుకు క్షమించనా? మమ్మల్ని విడదీసి ఉంచాలని ప్రయత్నించినందుకు క్షమించనా? మా పట్టుదల చూసి, మా మనసుల్ని అర్థంచేసుకుని నిజమైన విలువల్ని ఏర్పరచుకోమని, నైతికంగా ఎదగమని చెప్పినందుకా? జరగబోయే పరిమాణాన్ని ఊహించి పదేపదే హెచ్చరించినందుకా? మమ్మల్ని కలపాలని ప్రయత్నించి నీకేమీ కాని మాకోసం నీ పరువుని, నీ సొమ్ముని నాశనం చేసుకున్నందుకా? మమ్మల్ని నీవాళ్లుగా భావించుకుని అనుక్షణం కాపాడాలని, దేనినీ లెక్కచేయక ప్రయత్నించినందుకా? ఆ రాక్షసుల్లోని రాక్షసత్వాన్ని ప్రతిఘటించి ప్రతిఘటించి అలసిపోయి మాకోసం నీవూ జీవచ్ఛవంగా మారినందుకా? ఎందుకు క్షమించను? నిన్నెందుకు క్షమించను?" నా భుజంమీద తల ఆనించి, బాధగా తల ఊపుతూ అడిగాడు.

మళ్లీ కమ్ముకునే దుఃఖపు తెరలో తనని తను కంట్రోల్ చేసుకోవాలని ప్రయత్నించి విఫలుడవుతున్నాడు.

"జీవన్" అంటూ అతణ్ణి గట్టిగా పట్టుకుని, వాటేసుకుని అతడి వీపుమీద చేతులు బిగించాను.

నా భుజంమీదే ఉన్న తలని అటు ఇటు కొట్టుకుని ఒక పక్కకు వాలిపోయాడు.

సెంట్రీని పిలిచి నీళ్లు తెమ్మని చెప్పి మెల్లగా జీవన్‌ని బల్లమీద పడుకోబెట్టాను. సెంట్రీ నీళ్లు తెచ్చాక ముఖాన నీళ్లు చల్లి తుడిచాను. మెల్లగా తలపైకెత్తి నా తొడమీద పెట్టుకుని ఎడంచేత్తో కొంచెం తల పైకెత్తిపట్టుకుని కొంచెంకొంచెంగా మంచినీళ్లు తాగించాను. కొద్దిసేపటికి తేరుకున్నా అలాగే పడుకుండిపోయాడు. నేనతడి తల నిమురుతూ కూర్చుండిపోయాను.

జైలర్ అటుగా వచ్చాడు. పరిస్థితి చూసి ఏమీ అనకుండా వెళ్లిపోయాడు.

ఎంతోసేపటితర్వాత మెల్లగా లేచిన జీవన్ ఏంమాట్లాడకుండా, నావైపు చూడకుండా తన సెల్‌వైపు అడుగులేశాడు.

వెళుతున్న అతణ్ణి చూస్తుండిపోయాను.

నా మనసు మొద్దుబారిపోయింది. నరాలలో నిస్సత్తువ నిండుకుంది. ఆలోచించే శక్తి, ఓపిక కూడా లేవు.

జైలర్ పిలుస్తున్నాడని సెంట్రీ చెప్పడంతో లేచి ఆయన దగ్గరకు వెళ్లి మాట్లాడి ఎల్లుండి ఆస్పత్రికి తీసుకువెళ్లడానికి అనుమతి అడిగాను.

పరిస్థితినిబట్టి కాకపోయినా, కాస్త దయార్ద్రహృదయుడే అయిన జైలర్ అందుకు ఒప్పుకున్నాడు. జీవన్‌ని డాక్టర్‌కి చూపించమని కోరితే అలాగేనన్నాడు.



ఈ రెండురోజులు జీవన్ దగ్గరకు వెళ్లాలనిపించలేదు. అతణ్ణి చూడాలంటేనే నాకు భయంగా ఉంది. అంతకుమించిన బాధ కూడా వుంది. గుండె పగిలిపోతున్నట్టుగా, మెదడులో నరాలు, రక్తనాళాలు చిట్లిపోతున్నట్టుగా ఉంది.

ఆస్పత్రికి వెళ్లలేదు.

ఈ రెండురోజులు విపరీతంగా డ్రింక్ తీసుకున్నాను. ఇంట్లో ఉండాలనిపించనప్పుడు ఒక లక్ష్యం లేకుండా తిరిగి తిరిగి ఇంటికి చేరుకునేవాణ్ణి. ఇంట్లో వుంటే తలుపులు బిగించుకుని నా రూములో పడుకునో, కిటికీలో కూర్చునో శూన్యంలోకి చూపులు సారించి గడిపేసేవాణ్ణి. నిద్రరాదు. ఏపని చేయాలనిపించదు. ఏదో లోకంలో ఉన్నట్లనిపించేది. ఈ లోకంలోకి వస్తే తట్టుకోనంతగా ముసురుకునే ఆలోచనలు. బాధ. మళ్లీ మందును ఆశ్రయించేవాణ్ణి.




అమ్మ నన్నూ నా అవతారాన్నీ నా పరిస్థితిని చూసి ఏడ్చేసింది- "ఏమిట్రా ఎందుకిలా అయిపోతున్నావంటూ"

"ఒక్కసారి నీ అవతారం చూసుకోరా" అనే అమ్మకు సమాధానం చెప్పకుండా నా గదిలోకి వెళ్లిపోయేవాణ్ణి.

స్నానంలేదు. బట్టలు మార్చుకోవడంలేదు. తిండిలేదు. ఏదో ఉన్మాదస్థితి. నిలువునా- ఆపుకోలేని ఉద్రిక్తత. పూర్ణిమ దుస్థితికి నేనే కారణమన్న గిల్టీ ఫీలింగ్. ఎంత కాదనుకున్నా అది నన్నొదలడంలేదు. ఫలితంగా రంపపు కోత.

నా కళ్లు ఉబ్బి ఎర్రగా మండుతున్న జ్యోతుల్లా తయారయ్యాయి. సిగరెట్లు కాల్చి కాల్చి పెదవులు పగిలి రక్తంకారి మంటపెడుతున్నాయి. సరిగ్గా తినకుండా తాగడంవల్ల విపరీతమైన తలనొప్పి.

ఏదో ట్రాన్స్‌లో గడిపేశానీ రెండురోజులు.

మూడవరోజుదయమే లేచి స్నానంచేసి బట్టలు మార్చుకుని ఒక కప్పు కాఫీతాగి ఆస్పత్రికి వెళ్లాను.

డాక్టర్‌ను కలిశాను- "పూర్ణిమను చూడవచ్చా" అనడిగితే చూడవచ్చున్నాడు. కాని దూరంనుండే చూడాలి. కేజ్ తొలగించకూడదు. ముట్టుకోకూడదన్నాడు.

"ఆమె పరిస్థితి ఎలా వుంది డాక్టర్. కోలుకుంటుందా" అనడిగాను.

"అన్నీ బర్న్సుని తట్టుకోవడం కష్టం. చాలా సీరియస్. 'హోప్స్' తక్కువ. ప్రైమరీ షాక్‌నుండీ ఇంకా తేరుకోలేదు" సమాధానమిచ్చాడు.

నెత్తిన పిడుగుపడ్డట్లనిపించాయి ఆయన మాటలు. లేచి డాక్టర్ గదినుండి బయటపడి ఎఎమ్‌సియువైపు అడుగువేశాను.

కారిడార్ చివరికంటా వెళ్లి కుడివైపుకు తిరిగాను. మొన్న వచ్చినప్పుడు పరీక్షగా చూడలేదుగాని మిగిలిన రూములనుండి ఎఎమ్‌సియు రూంను వేరుచేస్తూ మధ్య ఖాళీప్రదేశం ఉంది. అది దాటి శబ్దం చేయకుండా తలుపులు తెరుచుకుని లోపలికి అడుగుపెట్టాను.

లోపల చాలా విశాలంగా ఉన్న ఆ యూనిట్‌లో ఆరు బెడ్స్ ఉన్నాయి. రెండిటిమీదే పేషంట్స్ ఉన్నారు. వారిలో పూర్ణిమ ఒకతె. రెండో పేషంట్ గోడవక్కగా ఉన్న బెడ్‌పై ఉంది. ఆమె బెడ్‌కు పూర్ణిమ బెడ్‌కు మధ్య రెండు ఖాళీ బెడ్స్, పూర్ణిమ ఉన్న బెడ్ తర్వాత మరో రెండు బెడ్స్ ఉన్నాయి.

పూర్ణిమ బెడ్‌పక్కగా కొంచెం దూరంగా ఉన్నవాళ్లమ్మ కనిపించింది. ఆమె కళ్లు ఎర్రగా ఉన్నాయి. కూతుర్ని చూస్తున్న ఆ కళ్లలో ఏదో భయం తారాడుతోంది. నన్ను చూసి చీర చెంగుతో కళ్లు తుడుచుకుని ఇవతలకు వచ్చి నిలుచుంది.

నేనామెతో మాట్లాడకుండా వెళ్లి పూర్ణిమ బెడ్‌పక్కన నుంచున్నాను.

పూర్ణిమ శరీరంమీద ఏదో ఎత్తుగా వుంది. దానిమీద తెల్లని బెడ్‌షీట్ కప్పారు.

మరి రెండడుగులు ముందుకువేశాను. పూర్ణిమ ముఖం పూర్తిగా కన్పించింది.

కనుబొమలతోసహా ఆమె జుట్టంతా తీసేశారు. ముక్కు, నోటికి ఆక్సిజన్‌మాస్క్ తగిలించి వుంది. మాస్క్‌నుండి బెడ్‌పక్కన గోడవారగా ఉన్న ఆక్సిజన్ సిలండర్‌కి ట్యూబ్ కనెక్ట్ చేశారు.

పూర్ణిమ ముఖం కూడా బాగా కాలిపోయింది. వికృతంగా, ఎర్రగా కమిలిపోయిన యాపిల్‌పండులా... చెక్కిళ్లమీద, నుదుట, తలమీద రాసిన ఆయింట్‌మెంట్, కాలిన గాయాలనుండి కారేనీరు రసితో మిక్స్‌అయి అక్కడక్కడ అదేవిధంగా జెల్లీలాగా మారింది. ఒకటి రెండుచోట్ల రసి కిందకు కారుతోంది.

కనురెప్పలు లేని ఆమె కళ్లు మూసుకుని వున్నాయి. ఎప్పుడూ ఏదో వెదుకుతున్నట్లు స్తబ్దంగా ఉండే ఆ నయనాలు మూసుకుని నింపుకున్న చీకట్లో దేనిని వెదుక్కోవడానికి తాపత్రయపడుతున్నాయో. తెరచి ఉన్నంత కాలం కన్నీటిపారిజాతాల్ని అవిరామంగా పూయించిన ఆ కళ్లు, స్వప్నాలు పగిలి, గుచ్చుకుని గాయాలైన ఆ కళ్లు ఇక ఓపికలేక మూసుకుపోయినట్టున్నాయి.

మరొకడుగు ముందుకువేసి దుప్పటి తొలగించాను. పూర్ణిమ శరీరంపై నన్నని రంధ్రాలున్న- ఇనుపతీగతో చేసిన కేజ్ ఉంచారు,

ఎవరూ ఆమెను ముట్టుకోకుండా. తద్వారా ఇన్‌ఫెక్షన్ రాకుండా జాగ్రత్తకోసం.

మెడ కిందభాగంలో ఒళ్లంతా కాలిన బొబ్బలు. కొన్నిచోట్ల ఆ బొబ్బలు పగిలి ఎర్రగా ముద్దముద్దగా కనిపిస్తున్న గాయాలు. ఆ క్షతగాత్ర నగ్నశరీరాన్ని చూడలేక కేజ్‌మీద దుప్పటి కప్పేశాను. చూసిన దృశ్యం కళ్లలో స్థిరంగా నిలవగా అవి భరించలేక కళ్లు మూసుకున్నాను.

'ఇది పరిష్కారం కాదు. ఇది పరిష్కారం కాదు. ఆ విషయం నీకూ తెలుసు. జీవితమంతా విషాదక్షణాల బరువుతో గడిపిన నీవు ఇది భరించలేకపోయావా? కాలంమీద, లోకంమీద నమ్మకం అడుగంటిపోయిందా? ఎందుకీ పనిచేశావు? నీలో ఊపిరిపోసుకుంటున్న జీవాన్ని పోగొట్టుకున్నందుకా? మాతృత్వాన్ని తాత్కాలికంగా పోగొట్టుకున్నా శాశ్వతంగా పోగొట్టుకోదుగా. కడుపులోని చిరుకదలికలు ఆగిపోవడంతోనే నీలో బతుకుతీపి ఇంకిపోయిందా? బిడ్డను అక్కున చేర్చుకోలేని వ్యధే అణువణువును అగ్నిజ్వాలలల్లో మాడిపొమ్మందా? ఆ కర్కశుల మధ్య సజీవంగా ఉండడం ఇష్టం లేకపోయిందా?

'నువ్వా ఆఖరికి ఇదే ముగింపును కోరుకున్నావా? నీ వివేచన ఏమయింది? నువ్వు ప్రయత్నించిన ముగింపు అతిసామాన్యమైనది. అనవసరమైనది. అర్థరహితమైనదని తెలియనిదానివి కాదు. మరెందుకీ పనిచేశావు పూర్ణిమా? ఇంత ఘోరానికి ఎందుకు తలపడ్డావు. నీ అవగాహన, మనోబలం, తెలివితేటలు అన్నీ... అన్నీ పరిస్థితులకు లొంగిపోయాయా...?

కంటిపాపలమీద సుడులు సుడులుగా చీకటి వలయాలు. ఆ గదంతా గిర్రున తిరుగుతున్నట్లనిపించి రెండు చేతులతో తల గట్టిగా పట్టుకుని అదుముకున్నాను.

రక్తప్రసరణవేగం ఒక్కసారిగా పెరిగి నేనెక్కడ బరస్ట్ అయిపోతానోననిపించింది తలంతా దిమ్ముగా వుండి కళ్లు తిరుగుతున్నాయి. ఊపిరి ఒక్కసారిగా స్తంభించిపోయినట్లనిపించింది. ఒంట్లోని శక్తంతా నన్నొదిలి పారిపోయినంత నీరసం.

''మానసికంగా ఎన్నిటితోనో పోరాడావు. ఈ మృత్యువుతోను పోరాడు పూర్ణిమా. స్మృతిని పోగొట్టుకున్నా జీవనేచ్ఛను పోగొట్టుకోకు. నీతో ప్రేమని పంచుకున్న నీ జీవన్‌కోసం రక్తం పంచుకుని పుట్టకపోయినా గాఢంగా అభిమానించిన నీ అన్నయ్య కోసం, ఏ ప్రేమకోసం



అల్లాడేవో ఆ ప్రేమకోసం..."

పూర్ణిమకు బతుకునిచ్చి దీవించమని, కాపాడమని కనుపించని దేవుళ్లను ప్రార్థిస్తోంది మనసు.

ఎందుకో, ఆఖరిసారిగా నాతో మాట్లాడినప్పటి ఆమె రూపం పదేపదే మనఃతెరమీద కదలాడుతోంది. కంటికెదురుగానేమో జీవన్మరణ పోరాటంతో చేతనం ఉన్నా అచేతనంగా కన్పిస్తున్న పూర్ణిమ. బాధగా కణతలు రుద్దుకున్నాను.

శిలలాగా అక్కడే నిలబడి చాలాసేపు రెప్ప వేయకుండా జుట్టులేని పూర్ణిమ శిరస్సును, ముఖాన్ని చూస్తుండిపోయాను.

ధారాపాతంగా పారుతున్న అశ్రువాహినిని ఆపుకోవాలని కూడా ప్రయత్నం చేయలేదు.

ఎంతోసేపటికి కళ్లు తుడుచుకుని వెళ్లడానికి వెనుదిరిగాను. అప్పుడుగాని గమనించలేదు- తలుపుకానుకుని కుళ్లి కుళ్లి దుఃఖిస్తున్న కరుణాకర్‌ని.

ఒక్కక్షణం అతడి దగ్గర ఆగాను. కాని ఏం మాట్లాడకుండా అతడి భుజంతట్టి ఎఐసియునుండి బయటకు వచ్చేశాను. బయట బల్లమీద దిగులుగా కూర్చుని యోచనాముద్రలోనున్న నాగభూషణం కన్పించాడు.

అతడిలోని మృగతత్వం కాదూ పూర్ణిమను ఈ స్థితికి తెచ్చింది. అయినా ఆ సమయంలో, ఆ స్థితిలోనున్న అతణ్ణి చూస్తే ఎంతో జాలనిపించింది నాకు.

ఇప్పుడతడిపై ఇసుమంతైనా నాలో కోపంలేదు- బాధ తప్ప.

జైలుకెళ్లి జైలర్‌ని కలిశాను. జీవన్ ఈ రెండురోజులనుండి ఏమీ తినలేదని, ఒక్క నిమిషమైనా కునుకుతీయలేదని చెప్పాడాయన. అతణ్ణి తీసుకెళతానంటే సరేనన్నాడు.

జీవన్‌ని చూస్తూనే స్థాణువైపోయాను. రెండురోజుల్లోనే అతడిలో అనూహ్యమైన మార్పు. కళ్లు బాగా ఉబ్బి ఉన్నాయి. ఎటో దిగ్దింతాల అగాధాల్లోకి అనంతంగా దూసుకుపోతోందని చూపు. బుగ్గలు రక్తంలేనట్లు పాలిపోయి ముడతలు పడ్డాయి. సన్నని పెదవులు పాలిపోయి అక్కడక్కడ పగిలాయి. మనిషి అస్తిపంజరంలా ఉన్నాడు. నడవడానికి సైతం ఓపికలేక నీరసంతో ఊగిపోతున్నాడు. అడుగు తడబడుతోంది.

లోకంతో సంబంధంలేని అద్వైతంలో, అదో విధమైన ట్రాన్స్‌లో ఉన్నట్లున్నాడు. ముందు నన్ను గుర్తుపట్టనట్లు విచిత్రంగా పరికించాడు నన్ను. తర్వాత రెండుక్షణాలు కళ్ళు మూసుకుని తెరచి, మళ్లీ రెప్పలు తాటించి దీర్ఘంగా చూశాడు నన్ను. ఆ చూపులో నిర్వచింపలేని వైరాగ్యం.

అతడికి ఎదురువెళ్లాను. నా భుజంమీద ఒక చెయ్యివేసి రెండోచేత్తో నా చేయి పట్టుకుని నిలబడ్డాడు.

అతడి స్పర్శ జీవరహితమైనట్లు చల్లగా ఒళ్లు గగుర్పొడిచేలా ఉంది.

మెల్లగా నడిపిస్తూ జీవన్‌ని జైలర్ దగ్గరకు తీసుకొచ్చాను. ఆయన జీవన్‌ని చూశారు. అతడి పరిస్థితికి మనిషిగా రెపరెపలాడిన జైలర్ కళ్లలో అమితమైన జాలి కనుపించింది నాకు.

అది వద్దన్నట్లు తల అడ్డంగా ఊపాను. అర్థం చేసుకున్నట్లు నన్ను చూసి తనూ తల ఊపాడు.

అప్పటికే ఇద్దరు కానిస్టేబుల్స్‌ని సిద్ధంగా ఉంచిన జైలర్ నన్ను, జీవన్‌ని ఒక వ్యాన్‌లో పంపించారు.

పది నిమిషాల్లో ఆస్పత్రి చేరుకున్నాం. ఈ పదినిమిషాలు పది యుగాలుగా బరువుగా గడిచాయి. సాంద్రమైన మౌనంతో.

అంతసేపు జీవన్ యోగధ్యానంలో ఉన్నట్లే కళ్లు మూసుకునే వున్నాడు.

కానిస్టేబుల్స్ కూడా మౌనముద్రే వహించారు- మా ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ.

ఆస్పత్రి చేరుకున్నాక వారి సాయంతో జీవన్‌ని దింపి నెమ్మదిగా నడిపిస్తూ ముందు హాల్‌లోకి అడుగుపెట్టి ఎక్యూట్ మెడికల్ కేర్ యూనిట్‌వైపు దారితీశాను.

హాలుకు రెండోవైపున ఉన్న డాక్టరు రూంలో నుండి వస్తున్న నర్స్ మమ్మల్ని చూసింది. నన్ను గుర్తుపెట్టి- "ఎక్స్‌క్యూజ్‌మి" అంది. ఏమిటన్నట్టు తలవెనక్కు తిప్పి ఆమెను చూశాను.

అక్కడే ఫైబర్ కుర్చీలో కూర్చున్న మరో

ఇద్దరు వ్యక్తులు మమ్మల్ని ఆసక్తిగా చూస్తున్నారు.

తటాపటాయిస్తున్నట్లుగా నర్స్ ఒక క్షణ మాగి- "షి... షి డైడ్ ఎవైల్. కొంచెంసేపటి క్రితమే ఆమె చనిపోయింది" నెమ్మదిగా చెప్పింది నన్నే చూస్తూ.

నాకర్థం కానట్లు అయోమయంగా చూశాను. ఆమె మళ్లీ అంతకుముందు చెప్పిందే చెప్పింది.

నాకు నమ్మశక్యం కాలేదు- "నేను ఇందాక చూసి వెళ్లాను" అన్నాను.

ఆమె తలూపుతూ "ఓ పదినిమిషాలవుతోంది" అని అక్కడినుండి వెళ్లిపోయింది.

స్తంభించిపోయాను. ఆమె ఏం చెప్పింది. పదినిమిషాలు అంది కదూ. నేనుచూసి వెళ్లి గంటకాలేదు. అంతలోనే, వచ్చేలోపునే...

జీవన్‌వంక పిచ్చిచూపులు చూశాను. బిత్తరపోయిన జీవన్ "ఎవరు? పూర్ణిమా? పూ... ర్ణి... మా అని ప్రశ్నార్థకంగా అడుగుతున్నట్లు అంటుంటే ఏం చెప్పాలో తెలియలేదు. మరింత రెట్టించి అడుగుతూ నన్ను గుచ్చి గుచ్చి చూస్తున్నాడు.

నేను నెమ్మదిగా ఊపీ ఊపనట్లు తలూపాను అవునన్నట్లు.

కొన్నిక్షణాల పాటు కదలిక స్తంభించినట్లయిన జీవన్ అంతలోనే "నో" అంటూ ఆస్పత్రి దద్దరిల్లేలా అరిచాడు జుట్టు పీక్కుంటూ

నా గుండె కవాటాలను ఒరుసుకుంటూ విపరీతమైన వత్తిడితో రక్తం పైకెగజిమ్ముబడింది. చెవుల్లో హోరు వినిపించే దడ. మరింతలోనే రక్తప్రసరణ ఆగిపోయినట్టనిపించింది. నిలబడలేనంత నిస్సత్తువ. కళ్లు బైర్లు కమ్ముతున్నాయి. గోడ కానుకుని ఒక్క నిముషంపాటు కళ్లు మూసుకుని నన్ను నేను కంట్రోలు చేసుకోవడానికి ప్రయత్నించి, అతికష్టంమీద భరించలేని ఆ వార్త కలిగించిన షాక్ నుండి తేరుకుంటూ కళ్లు తెరచి పైకప్పువంక చూశాను.

పూర్ణిమ డెడ్‌బాడీ ఉన్న గదిలో నుండి బయటకు వచ్చి మా ముందునుండి వెళుతూ ఆగదివైపు వేలితో చూపిస్తూ "ఆ గదిలో ఉంచారు" అందినర్స్.

కంట్రోల్ చేయలేని స్థితిలో ఉన్న జీవన్‌ని గట్టిగా పట్టుకుని నిద్రలో నడుస్తున్నట్లు నర్స్ చూపించిన గదివైపు అడుగులేశాను.

"పూర్ణిమా... పూర్ణిమా" అంటూ తలకొట్టుకుంటూ జీవన్ గుండెలవిసేలా రోదిస్తున్నాడు. బలవంతంగా అతడి చేతులు లాగి గట్టిగా వణుకుతున్న నా రెండు చేతులతో పట్టుకుని నడిపించి ఆ గదిలోకి అడుగుపెట్టాను.

ఒక గంట క్రితమే నేను చూసినప్పుడు చైతన్యం నిదురిస్తున్న జీవంతో సజీవంగా ఉన్న పూర్ణిమ ఇప్పుడు సుదీర్ఘనిద్రలో నిర్జీవమై బల్లమీద ఉంది. ఇంతకు క్రితం నేను చూసిన మరకల బెడ్‌షీట్ తీసేసి వేరేది మెడవరకు కప్పారు.

చైతన్యానికి, అచైతన్యానికి మధ్య ఎంత ఎంతటి పలుచని తెర. జీవత్వానికి, నిర్జీవత్వానికి ఎంత దగ్గరితనం.

అసలు జననమే మృత్యు గీతానికి స్వాగత ద్వారం!

పూర్ణిమను చూస్తున్న నాకు ప్రపంచమంతా స్తంభించినట్లనిపించినా చుట్టూఉన్న మనుమల అలికిడి, ఏడుపులు ఈ ప్రపంచం ఇంకా సజీవంగానే ఉందని రుజువు చేస్తున్నాయి.

పూర్ణిమ మృతదేహానికి ఒక పక్కగా నాగభూషణం నిలబడి ఏడుస్తున్నతల్లి చెల్లెలి దేహంపై పడిపోకుండా ఆపుతున్నాడు. ఆవిడ అతడి చేతుల్లో గింజుకుంటోంది. కరుణాకర్ కిటికీ చువ్వల్ని పట్టుకుని రెండు చేతుల మధ్యా కిటికీ చువ్వకు తల ఆనించి మౌనంగా దుఃఖిస్తున్నాడు. వెక్కిళ్లతో అతడి శరీరం కంపిస్తోంది.

నాగభూషణం కళ్లనుండీ కారుతున్న కన్నీరు!

ఆ పాషాణం ఇప్పటికి చల్లబడి కరిగింది కాబోలు ఎక్కడో దాగిన మానవత్వం కాసింత కదిలింది కాబోలు. కాని ఏంలాభం.

జీవన్‌ని పూర్ణిమ మృతదేహం దగ్గరకు నడిపించుకువెళ్లాను.

పూర్ణిమ దేహాన్ని చూసిన అతడిలో దుఃఖం అణిగిపోయింది. ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయా





డు. విగ్రహంలా నన్నానరా చేసుకుని నిలుచుని పూర్ణిమ ముఖాన్ని చూస్తూండిపోయాడు.

నాగభూషణం చేతులను ఎట్లాగో విదిలించుకుని వాళ్లమ్మ పూర్ణిమ దేహంపైపడి బిగ్గరగా రోదిస్తోంది. నాగభూషణం ఉన్నచోటే కూలబడిపోయి చేతుల్లో ముఖం దాచేసుకున్నాడు. కరుణాకర్ కిటికీ వద్దనుండి వచ్చి చెల్లెలి పాదాలు పట్టుకుని వాటిమీద తల ఆనించి విలపిస్తున్నాడు.

జీవన్ పూర్ణిమ శరీరాన్నే చూస్తున్నాడు.

ఒకప్పుడు మృదువుగా తను తాకిన శరీరం, తననల్లుకుపోయిన శరీరం, స్పర్శతోనే తన నిండా వెన్నెలలు పూయించిన శరీరం కలిసి ఉన్న కొద్ది నాళ్లలో తనలో ఉద్వేగాన్ని నింపి, ఆనందంపంచి ఇచ్చిన శరీరం, అగాధాల్లోకి జారిపోయే తనని ఒడ్డుకులాగి లాలించి, బుజ్జగించి, ప్రేమించడం నేర్పి రకరకాలుగా నవ్వి,అల్లరిచేసి, అలిగి, ఆటలాడి తనలో అణిగిపోయిన చైతన్యాన్ని వెలికితీసి సజీవపరచిన పూర్ణిమ శరీరమంతా కాలి బొబ్బలెక్కి, పగిలి, పుళ్లై, కొన్ని రసికారిన, కొన్ని ముద్దల్లా మిగిలిన ఆవుళ్లతో, జుట్టు తీసేయడంవల్ల వికృతంగా కనుపిస్తున్న పూర్ణిమను చూస్తుంటే అతడిలో ఏ ఆలోచనలు రేగుతున్నావో, ఎన్ని అగ్ని పర్వతాలు ఫెటిల్లున విస్ఫోటిస్తున్నాయో, ఎన్ని సముద్రాలెగిసిపడుతున్నాయో-

జీవన్ చూపు మాత్రం పూర్ణిమ ముఖంపై స్థిరంగా నిలిచిఉంది.

మనిషికీ మనిషికీ జరిగే సంఘర్షణ, మనిషికీ మనసుకీ జరిగే సంఘర్షణ, మనిషికీ మనసుకీ పరిసరాలతో జరిగే సంఘర్షణ విలువలకు, విలువరాహిత్యానికి జరిగే సంఘర్షణ ఏదీ ఇక ఆ ముఖంలో ప్రతిఫలించదు.

ప్రేమ మీరాగుండెను తడిమే ఏ స్పర్శా ఇక ఆ దేహానిదికాదు. ఎద మూలల్లోని ఏకాంతంలో హైబర్ నేషన్ ఉండదు. ఇక ఏగాయం నడచి వచ్చి గుండెమీద వాలిపోయి అలుపు తీర్చుకోదు. ఆనందమైనా, విషాదమైనా ఇక ఏ అనుభవాన్ని అనుభూతం చేసుకుని అనుభూతాన్ని నెమరువేసుకునేపనిలేదు.

కనురెప్పల మాటున సముద్రాల్నీ, గుండె చాటున తడిమంటల్ని దాచుకోనవసరంలేదు.

ఇక తనకి గతంలేదు, వర్తమానంలేదు, భవిష్యత్తులేదు. తానెవరికీ ఆధారంకాదు. తన బతుక్కి ఏ సారాంశమూ లేదు.

జీవన్ రెండుడుగులు ముందుకు జరిగి బల్లకానుకుని పూర్ణిమ శరీరంమీద కప్పిన బెడ్‌షీట్ తొలగించబోయాడు. అప్పుడే లోపలికి వస్తూన్న డాక్టర్ అది చూసి వారించబోయారు.

అడ్డుచెప్ప వద్దని అభ్యర్థిస్తూన్నట్లు నేను రెండు చేతులు జోడించి తల అడ్డంగా ఊపాను. ఆయన నన్ను జీవన్‌ని మార్చిమార్చి చూసి తన ప్రయత్నం విరమించుకున్నారు.

నాగభూషణం, కరుణాకర్ ఆశ్చర్యంగా చూశారు మావైపు. వాళ్లమ్మ ఏదేదో అంటూ ఏడుస్తూనే ఉంది.

జీవన్ బెడ్‌షీట్ నెమ్మదిగా కాస్తకాస్త తొలగించాడు- పూర్తిగా.

పూర్ణిమ విగత నగ్నదేహాన్ని చూడలేక గోడవైపు తిరిగి కళ్లు మూసుకున్నాను. మూసుకున్న కళ్లలో నుండి ధారాపాతంగా జాలువారుతున్న కన్నీళ్లు. అప్పటిదాకా నాలోనేను అదుముకుంటున్న దుఃఖం ఎంతగా ఆపుకుందామనుకున్నా ఇక ఆగలేనట్లుగా పొంగి పొంగి వస్తోంది.

కొంతసేపటికి జీవన్ నా భుజంమీద చెయ్యేసి వినీవినపడనట్లు పిలిచిన పిలుపుకు కళ్లు తెరిచిన నాకు ఒకచెయ్యి నామీదే వేసి తల తిప్పకుండా ఇంకా పూర్ణిమ శరీరాన్నే చూస్తూన్న జీవన్ కనుపించాడు.

''పూర్ణిమ చచ్చిపోయిందా? చంపేసారా?'' మెల్లగా నమ్మశక్యంకాక మృదువుగా ప్రశ్నించిన జీవన్ స్వరంలో ఏభావంలేదు. చాలా మామూలుగా అడిగాడు.

అతణ్ణి పిచ్చిగా చూశాను. అన్నిటికీ అతీతమైన నిర్లిప్తత జీవన్‌లో.

గొంతులో ఆత్మనిలిచి ప్రశ్నగా ధ్వనించిందనిపించింది. చెలరేగిన తుఫానులో క్షణకాలపు ప్రశాంతత అది.

''పూర్ణిమను చంపేశారు కదూ. కాల్చికాల్చి మరీ చంపారు. పూర్ణిమతో పాటే మా బిడ్డ... ని... కూడా...'' మార్పులేని స్వరంతో అంటూ బెడ్

షీట్ మెడవరకు కప్పి,కాలినపూర్ణిమ నుదుట, బుగ్గలమీద, పెదవులమీద- పుళ్లను కూడా పట్టించుకోకుండా వాటిమీదే గాఢంగా ముద్దు పెట్టుకుని మరోసారి ఆమె ముఖాన్ని చూసి ఏదో చిత్తరువును తన గుండెల్లో నింపుకుని ఆమె పెదవులను తన వేలితో స్పృశించి బెడ్‌షీట్ ముఖంపై కూడా కప్పేశాడు.

అతణ్ణి చూస్తూ అందరం బొమ్మల్లా నిలుచుండిపోయాం.

అంతరంగంలో ప్రళయరూపం దాలుస్తున్న తుఫాన్‌ని తట్టుకోవడానికేన్నట్లు జీవన్ ఒక నిమిషం కళ్లు మూసుకుని నుంచున్నాడు.

తర్వాత అడుగులో అడుగువేసుకుంటూ నాగభూషణం దగ్గరకు వెళ్లి షర్ట్ కాలర్ పట్టుకుని అతడి కళ్లల్లోకి లోతుగా, సూటిగా చూస్తూ నిలుచున్నాడు. శస్త్రాల్లా దూసుకుపోతున్న ఆ చూపులో శతకోటి భావాలు. అసహ్యం, కోపం, ఆవేదన, భయం, కసి, గుండెకోత... ఇంకెన్నో.

ఇప్పటికి నీకసి తీరిందా? నీ ఆవేశం చల్లబడిందా లేని పరువు ప్రతిష్ఠలకోసం పాకులాడిన నీకవి దక్కాయా? మా జీవితాల్ని ఛిద్రం చేసి తోడబుట్టిన చెల్లెల్నే చంపుకున్న నీరక్తదాహం తీరిందా? నీ ఆత్మసంతృప్తి చెందిందా?

ఎన్నో మౌన ప్రశ్నలు. చూసిచూసి నాగభూషణాన్ని కాలర్ వదిలేసి విసురుగా బలంగా వెనక్కు తోశాడు.

పూర్ణిమ దేహం దగ్గరకు వచ్చి మళ్లీ బెడ్‌షీట్ తీసి ఆమె ముఖం చూసి కళ్లు మూసుకున్నాడు.

అతడిలోని నిశ్శబ్దం నాకు అమితమైన భయాన్ని కల్గిస్తోంది.

ఆస్పత్రిలో అన్ని ఫార్మాలిటీస్ పూర్తిచేసి పూర్ణిమ శవాన్ని అప్పజెప్పేసరికి మధ్యాహ్నం మూడయింది. టాక్సీలో మృతదేహాన్ని ఇంటికి తీసుకొచ్చాం. మావెంట వచ్చిన కానిస్టేబుల్స్ జైలువాహనంలో అనుసరించారు.

కబురు తెలిసి వచ్చిన అమ్మ పూర్ణిమ శవంచూసి నన్ను పట్టుకుని ఏడ్చేసింది.

నాకేం ఫర్వాలేదు. మామూలుగా మనిషిగానే ఉన్నానన్నట్లు తలూపాను. నా రూపం అమ్మకు భయం కలిగించినట్లుంది. బెరుకుగా, అయోమయంగా చూసింది నన్ను.

వెంటనే అన్ని ఏర్పాట్లు పూర్తిచేసి,చేయవలసిన తతంగమంతా కానిచ్చిశ్మశానానికిబయలుదేరబోతూంటే నాగభూషణాన్ని అవతలకు పిలిచి పూర్ణిమ రాసిన ఉత్తరం జేబులోనుండి తీసి అతడి చేతిలో పెట్టాను.

ఏమిటన్నట్లు చూశాడు ''చదువు'' అన్నాను. పూర్ణిమ రాసిన ఉత్తరంలోని ఆఖరి వాక్యాలు వేలితో చూపిస్తూ-

ఈ సన్నివేశం నాకు బాధగానే ఉన్నా జీవన్‌తో కలపలేకయినా, ప్రాణంపోకుండా అడ్డుకోలేకపోయినా ఆ చెల్లెలి ఆఖరి కోరిక అయినా తీర్చవద్దా?!

''... నేను చచ్చిపోతే ఈ చరిత్రహీనులెవరూ నా చితికి నిప్పంటించరాదు. జీవన్‌తో కలిసి నీవే నా చితికి నిప్పంటించాలి. ఈ ఆఖరి కోరిక తీరుస్తావు కదూ''

ఆ వాక్యాలు చదువుకుని నమ్మలేనట్లుగాను, అదోమాదిరిగాను చూశాడు నావైపు.

''నిన్ను మోసపుచ్చడానికి నేను రాసిన ఉత్తరం కాదిది. నీతో గొడవ పడినరోజు మీ ఇంటికి వచ్చినప్పుడు పూర్ణిమ ఇచ్చిన ఉత్తరమిది'' అని చెప్పాను.

అతడి కళ్లలోని జీవం సిగ్గుతో తలవంచుకుంది. చాలా సేపటికి తలపైకెత్తి బలవంతంగా గొంతునొక్కుకుని, కళ్లు మూసుకుని అలాగే నన్నట్లు తలూపాడు. అక్కడినుండి కదలిపోయాడు.

జీవన్‌ని పూర్ణిమ శవం ముందు మెల్లగా నడిపించుకుంటూ శ్మశానానికి తీసికెళ్లాను- అందరూ శవం వెనక అనుసరిస్తుండగా.

పూర్ణిమ దేహాన్ని చితిమీద పెట్టాక అప్పటిదాకా నమ్మశక్యంకానంతగా తననితాను నిగ్రహించుకున్న జీవన్ ఒక్కసారిగా ''పూర్ణిమా పూర్ణిమా'' అని అరుస్తూ ఆమె దేహంమీదపడి పసిపిల్లాడిలా ఏడ్చేశాడు- వెక్కుతూ.

కంటిపాప మాటున వెలుగుల్ని వెంటబెట్టుకువచ్చిన కల కన్నీటికావ్యంగా మారింది. హృదయంలో ముద్రితమైన చిత్తరువు భౌతికంగా కనుమరుగుకాబోతోంది. ఊపిరిపోసిన, చైతన్యం తారాడిన దేహం అచేతనమై అనంత వాయువుల్లో కలిసిపోబోతూంది. ప్రేమను పలి




కించిన హృదయం, ఆ ప్రేమరాగాన్ని మరచి అలసిపోయి ఆ ప్రేమకోసమే బలయిపోయింది.

నేను నేనే కంట్రోల్‌చేసుకోలేని స్థితిలో ఉన్న నేను జీవన్‌ని కంట్రోల్ చేయలేకపోతున్నాను.

నాగభూషణం వచ్చి జీవన్‌ని పట్టుకున్నాడు. అతణ్ణి చూచి జీవన్ ''పో'' అని దాదాపు అరచినట్లుగా అన్నాడు అంతటి బాధలో, దుఃఖంలో కూడా కర్కశంగా ధ్వనించిందతడి స్వరం.

నాగభూషణం జీవన్‌ని విడిచిపెట్టి తల వంచుకుని వెనక్కడుగువేశాడు.

నేను పట్టుకుని బలవంతంగా తీసుకువస్తుంటే వద్దన్నట్లు చేతులు జోడించాడు జీవన్ - అభ్యర్థనగా. దానితో నేనూ ఊరకుండిపోయాను.

ప్రతి ఒక క్షణం భారంగా గడుస్తోంది- అసలు కాలమే స్తంభించిపోయిందేమో అనిపించేలా.

అంతరంగపు అంచుల చివరివరకు అభిమానంతో, ఆప్యాయతతో పాకిన మనిషి దూరమైపోతే, ఈ లోకం విడచిపోతే కలిగే బాధ మొదటిసారి అనుభవమైతే జీవితమే ఇక లేదేమో మరింక బతికి ఉండటం దేనికి అనిపిస్తుంది.

నా పరిస్థితే ఇలా ఉంటే జీవన్ పరిస్థితినెలావర్ణించగలను. అది నాకసాధ్యమైనది. నాభాషకు, నాభావానికి అందనిది. చేతకానిది.

జీవన్ ఏడ్చిఏడ్చి పూర్ణిమ శవంమీదే సొమ్మసిల్లిపోయాడు. మూఖాన నీళ్లు చల్లగా కొంచెంసేపటికి తేరుకున్నాడు.

అతణ్ణి - ఒక చేయి నా మెడమీద వేసుకుని, నడుంపట్టుకుని నెమ్మదిగా వెనక్కు తీసుకొచ్చాను. అలాగే నడిపించుకుంటూ చితి చుట్టూ తిరిగి చితిమంటను జీవన్ చేతికిచ్చి అతడి చేయిని నాచేత్తో పట్టుకుని నిప్పంటించాను.

పూర్ణిమ దేహాన్ని కొద్దికొద్దిగా అల్లుకుంటూ ఆ దేహాన్ని తమలోకి ప్రేమగా ఇముడ్చుకుంటున్న ఆ మంటలను చూస్తున్న మాలో అంటించిన ఆచితి నార్పేంతటి కన్నీరు - ఇద్దరిలోనూ లేదు.

ఒకసారి తమ చేతికి చిక్కినట్టే చిక్కి తప్పించుకున్న పూర్ణిమ దేహాన్ని కబళించాలని ఆత్రంగా కమ్ముకుంటూ ఆనందంగా నర్తిస్తున్న జ్వాలలు!

ఆకాశమంతా అలుముకున్న లేత ఎరుపు రంగులో మరింత వింతగా కన్పిస్తోంది చితిమంట.

ఆహుతవుతున్న ఆకారపు ఆత్మ ఆకాశాన్నంతా ఆవహించి జాలిగా మమ్మల్ని చూస్తూ ఈలోకం ఇంకా ఇంకా తనలో కొద్దో గొప్పో మిగిల్చిన కన్నీటిని అప్పుడొకబొట్టు అప్పుడొక బొట్టుగా రాలుస్తోంది.

జీవన్‌ని ఇవతలికి నడిపించి చితికి కొంచెం దూరంలో-నిలుచున్నాను.

మంటల వేడికన్నా మండుతున్న గుండెలో వేడి ఎక్కువ అయిపోయింది.

ఒక చరిత్ర ముగిసిపోయింది!!

ఒక స్వప్నం రాలిపోయింది!!!

లోకం అందుకోలేని ఒక ఎద వ్యథలో ఈ లోకాన్నే వదులుకుంది.

ఓదార్పులను ఎరగని రాత్రి తెల్లవారిపోయింది.

తను దూరంకావాలనుకున్న చరిత్రహీనులకేకాదు, మాకు కూడా దూరమైపోయింది. తనలోని శక్తిని తనవాళ్లు హరించేసారని మాలో ఉన్న శక్తిని తనకు తోడుగా వెంటబెట్టుకుని మమ్మల్ని శక్తిహీనుల్ని చేసి వెళ్లిపోయిన పూర్ణిమ శరీరాన్ని మంటలు పూర్తిగా ఆక్రమించేసుకున్నాయి.

నేను, నా భుజంమీద తల ఆనించి జీవన్ అలా చూస్తూండిపోయాం- ఇంకా మేము మాత్రం బతికే ఉన్నగుర్తుగా.

అయితే నాలో ఒక ప్రశ్నగానే మిగిలిపోయింది.

పూర్ణిమ బతుకులో అంతిమ విషాదగీతానికి పల్లవి రాసిందెవరు?

నేనా? జీవనా? లేక మా పక్కనే నిలుచుని ఉన్న ఆమె తోబుట్టువులా? 

# ఏరిన ముత్యాలు

★ ఒక దీపంనుంచి ఎన్ని దీపాలనైనా వెలిగించవచ్చు. అయినా మొదటిదీపం కాంతి మాత్రం తరగదు.

— బుద్ధుడు

★ ఆరోగ్యం పరిశ్రమలోనే ఉంది. ఆరోగ్యాన్ని పొందేందుకు శ్రమతప్ప మరో మార్గం లేదు.

-- వైండేల్ ఫిలిప్స్

★ దృఢమైన, ఆరోగ్యవంతమైన శరీరం ఒక మహాసామ్రాజ్యం.

-- గోల్డ్‌స్మిత్

★ ఆరోగ్యపోషణకు కొంత సమయం వెచ్చించకపోతే, జబ్బుపడి చాలా సమయం కోల్పోవలసి రావచ్చు.

-- సెబాస్టియన్ నైల్

★ అందరి ఆత్మలు ఒకేవిధంగా ఉంటాయి. అందరి ఆత్మల శక్తి సమానంగానే ఉంటుంది. కాకపోతే కొందరి ఆత్మల శక్తి వెలువడింది. కొందరిది వెలువడాల్సి వుంది.

-- గాంధీజీ

★ ప్రపంచంలోకల్లా అందరికంటే అవసరమైన మనిషివి నీవేనన్న ఆత్మవిశ్వాసంతో ఉండాలి.

-- గోర్కీ

★ చార్వాక మత సిద్ధాంతాన్ననుసరించి ఆత్మ, పరమాత్మ, ఉత్తరజన్మ, పూర్వజన్మ వంటివేమి లేవు. ఇహజన్మ, ఇహజీవితం, ఇహలోకపు అనుభవాలే ముఖ్యమైనవి.

-- రాహుల్ సాంకృత్యాయన్

★ ఒకే సూర్యుడు ప్రపంచాన్నంతా వెలిగిస్తున్నట్లు ఒకే ఆత్మ అందరిలోనూ ప్రకాశిస్తోంది.

-- గీత

★ పువ్వుల్లో సువాసనా, నువ్వుల్లో నూనె, పాలలో నెయ్యి, చెరుకులో బెల్లము ఉన్నట్టే మనిషిలో భగవంతుడున్నాడు

-- చాణక్యుడు

★ మానవునికి ఆత్మగౌరవంకంటే విలువైనది మరొకటిలేదు. ఆత్మగౌరవంలేనివాడు బందీనున్నాతో సమానం.

-- అంబేద్కర్

★ తమను శాసించుకోగలవారు ఇతరులను శాసించగలుగుతారు. ఆత్మ సంయమనం లేని వ్యక్తి రెండింటికీ పనికిరాడు.

-- హాజ్‌లిట్

★ సుఖాలు లభించినా, లభించకపోయినా ప్రతివ్యక్తి ఆనందంగా జీవించగల విధంగా ఆత్మకు శిక్షణ ఇవ్వాలి.

-- జార్జి ఇలియట్

---

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# చతుర ప్రపంచం

## బ్రేవో! డాక్టర్ క్రిస్టియన్...

ఏపని చెప్పినా ప్రేమగా, వినయంగా ఎలాంటి సణుగుళ్లూ లేకుండా చేసిపెట్టే భార్యకావాలని చాలామంది భర్తలు కోరుకుంటారు. తమ అభిరుచులకు అనుగుణంగా మనసెరిగి మసలుకొనే భార్యామణి రావాలని మరెందరో బ్రహ్మచారులు కలలు కంటుంటారు. కాని ఇది జరిగే పనికాదని చాలా మంది అనుభవజ్ఞుల అభిప్రాయం. 'మేడ్‌ఫర్ ఈచ్ అదర్' లాంటి జంటలు చాలా అరుదుగా కన్పిస్తాయని మనమూ ఒప్పుకోక తప్పదు.

కాని అలాంటి భార్యని సంపాదించడం అసాధ్యమేమీకాదని వాదిస్తున్నాడు బాన్‌కి చెందిన డాక్టర్ క్రిస్టియన్ క్రాజే. అరవైరెండో పడిలోపడ్డ ఆ వృక్షశాస్త్రజ్ఞుడు 'మనకి కావల్సిన లక్షణాలతో హైబ్రీడ్ పళ్లని, కాయల్ని సృష్టించుకోగలుగుతున్నప్పుడు అలాంటి భార్యను మాత్రం ఎందుకు సృష్టించుకోలేం?' అంటూ ప్రయోగాలు ప్రారంభించి విజయం సాధించాడు.

మొదటగా ఆయన తన ముఖ్యమైన నాలుగు అభిరుచుల్ని దృష్టిలో పెట్టుకొని నాలుగు రసాయనాల్ని తయారు చేశాడు. తరువాత ఇంచుమించు తన భార్య పోలికలేగల ముగ్గురమ్మాయిల్ని ఎంపిక చేసి వారందరితోనూ తాను చేసిన రసాయనాల్ని ఐదేళ్లపాటు త్రాగించాడు. అవి త్రాగిన వాళ్లలో అతని భార్య కూడా ఉంది. రసాయనాల ప్రభావం వల్ల వాళ్లలో విచిత్రమైన మార్పులు వచ్చేశాయి. అతని అభిరుచికి తగ్గట్టుగా సింపిల్‌గా అలంకరించుకొని ఒక భార్య రంజింప చేస్తుంటే, మరో భార్య అతను కోరుకునే విధంగా బట్టలు కుట్టి అందిస్తోంది. ఇంకో ఆవిడ అతనికి టేస్ట్‌కి తగ్గట్టు ఇంటి పనులు చేసుకుపోతుంటే, నాలుగో ఆవిడ బయటపనులన్నీ బ్రహ్మాండంగా చక్కబెట్టుకొస్తోందట. ఆ రకంగా తనకు కావాల్సిన లక్షణాలన్నీ ఆ నలుగురిలో పొందుపరచి సుఖిస్తున్నాడా పెద్ద



మనిషి. "ఇప్పటి వరకూ ఇంత విజయం సాధించానుగదా నిదానంగా అన్ని లక్షణాలూ ఒకామెలోనే పొందుపరిచే ప్రయత్నాలు చేస్తాను చూడండి" అని హామీ కూడా ఇస్తున్నాడాయన.

"అమ్మాయిలందరినీ హిప్నటైజ్‌చేసి కోరికలు తీర్చుకుంటూ, అడ్డమైన చాకిరీ చేయించుకుంటున్నాడు" అని కొందరు ఆయనపై ఆరో



చతుర... 119

పణలు చేస్తున్నారు. ప్రఖ్యాత శాస్త్రవేత్త డాక్టర్ వెస్సింగ్స్ ఈ ప్రయోగాల్ని తీవ్రంగా నిరసించాడు. ''ఇలాంటి ప్రయోగాలుమనని నాగరికత వైపుగాక రాతియుగంవైపు నడిపిస్తాయి. ఇకనైనా వీటిని కట్టిపెట్టడం మంచిది. అంతగా కావాలంటే ఆయన ఏకంప్యూటర్నో పెళ్లాడొచ్చుగదా?'' అని అంటున్నాడు.

డాక్టర్ క్రిస్టియన్ మాత్రం ఈ విమర్శల్ని లెక్కచేయకుండా నలుగురు భార్యలతో కులాసాగా గడిపేస్తూ సరదాలు తీర్చుకుంటున్నాడు.

## మేధావుల వింతచేష్టలు!

**క**వులు, రచయితలు క్రాంతిదర్శులు! కాలాన్ని శాసించే శక్తి, ప్రపంచాన్ని సరైన పంథాలో నడిపించే సామర్థ్యం వారిసొంతం. అయితే అంతటి మేధావులూ కొన్ని కొన్ని వింతచేష్టల్ని తమ అలవాట్లుగా చేసుకొని ప్రపంచాన్ని ముక్కుమీద వేలేసుకునేలా చేశారు.

ప్రపంచ ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత ఆనరే డిబాల్జాక్‌కి ఎరుపు రంగంటే చచ్చేంత పిచ్చి! అందుకే ఆయన ఎప్పుడు రచన చేయాలన్నా ధగధగలాడే ఎర్రని దుస్తులు, నిగనిగలాడే ఎర్రని బూట్లు ధరించేవాడు. అందంగా కత్తిరించిన చక్కని పేపర్లమీద రాయడం ఆయన మరో ప్రత్యేకత. రాసినంతసేపూ కప్పులు కప్పులు కాఫీ సేవించటం ఆయనగారి హాబీ! మరో విచిత్రమేమంటే - ఆయన పగలు రాసేవాడు కాదు. ఎప్పుడూ అర్థరాత్రి దాటాకే రాయడం ప్రారంభించేవాడు.

ప్రసిద్ధ ఆంగ్ల రచయిత డాక్టర్ శామ్యూల్ జాన్సన్‌కో గమ్మత్తయిన అలవాటుండేది. రోడ్డుపైన నడిచేటప్పుడు ఇరువైపులా వున్న కరెంట్‌స్థంభాల్ని, టెలిఫోన్ స్థంభాల్ని తాకుతూ పోయేవాడు.

రచన ప్రారంభించేముందు తన గదిని అందంగా అలంకరించుకోవడం ఛార్లెస్‌డికెన్స్ అలవాటు. అంతేకాదు, రాసేటప్పుడు నగలూ, నట్రా ధరించి రాయడం ఆయన ప్రత్యేకత.

విక్టర్ హ్యూగోకి రాసినంతసేపూ నిలబడి రాయడం అలవాటు. అందుకోసం నిలువెత్తు టేబుల్ నొకదాన్ని ప్రత్యేకంగా చేయించుకున్నాడతను.

ప్రముఖ అమెరికన్ హాస్యరచయిత మార్క్ ట్వెయిన్ పడుకోబోయేముందు రాతసామాగ్రిని మంచంమీద పెట్టుకునేవాడు. మెలకువ వచ్చినప్పుడు మంచంమీద పడుకునే రాసేయడం అతని అలవాటు.

ఫ్రెంచి రచయిత పీరెలోటి వీళ్లందరికంటే



నాలుగాకులు ఎక్కువ చదివిన దిట్ట. ఆయ నకు చాలా ఎత్తుమీద కూర్చుని రాసే అలవా టుండేది. అందుకే తమ తోటలోనున్న చెట్టు ఎక్కి, దాని చిటారుకొమ్మన కూర్చుని రాసుకునే వాడు. గమ్మత్తేమంటే - అది నిజమైన చెట్టు కాదు. వృక్షాకారంలో అతను ప్రత్యేకంగా రూ పొందించుకున్న ఆసనం.

ఇలాంటి విషయాల్లో భారతీయ రచయిత లు కూడా పాశ్చాత్యులకేం తీసిపోరు. 'గోదాన్' నవలా రచయిత మున్షీప్రేమ్‌చంద్ రాయాల నుకున్నప్పుడల్లా వాళ్లింట్లోని పాత కొయ్య మంచంమీద కూర్చుని రాసేవాడు. 'వందేమా తర' గీతకర్త బంకించంద్ర ఛటర్జీ రచన ప్రారంభించేముందు తన గదిగోడలని రకర కాల పెయింటింగులతో అందంగా అలంక రించేవాడు. రాసుకునేటప్పుడు తన గదిలోకి ఎవ్వరూ రాకుండా కట్టడిచేసేవాడాయన.

## విస్కీకోసం కుస్తీ

కుస్తీ పోటీల గురించి మనందరికీ తెలిసిందే. వాటిలో విజేతలైనవారికి అత్యధిక మొత్తంలో నగదు బహుమతులతోపాటు ట్రోఫీలు... మెడ ల్సూ - అబ్బో ... ఎన్నో దక్కే విషయం కూడా మనకి తెలును. అయితే ఫ్రాన్స్‌లోని జోవెన్ గ్రామంలో మల్లయుద్ధ విజేతలకిచ్చే బహు మతి పైవాటికి చాలా భిన్నంగా ఉంటుంది. ప్రతిష్ఠాత్మకమైన ఆ పోటీలో గెలుపొందిన వ్యక్తి కి అతని బరువుకు సరిపడా బరువుండే విస్కీ సీసాని బహూకరిస్తారు. మాటవరుసకు విజేత బరువు 100 కిలోలైతే అతనికి 100 కిలోల విస్కీబాటిల్ దక్కినట్లేనన్నమాట. అంటే దాని విలువ యాభైలక్షల రూపాయల పైమాటేగ దా.

ఇంచుమించు ఏటా మార్చి నెలలో జోవె న్‌లో కుస్తీపోటీలు జరుగుతాయి. వాటిలో పాల్గొ నేందుకు ప్రపంచం నలుమూలలనుంచి రెం డువేల మందిదాకా వస్తాదులు వస్తారు. సుమా రు 100 సంవత్సరాలుగా ఆ పోటీల్ని క్రమం తప్పకుండా నిర్వహిస్తున్న ఘనత ప్రఖ్యాతి వహించిన గ్రాంట్స్ విస్కీ కంపెనీవారికే దక్కు తుంది. విజేతలకి వారు బహూకరించే విస్కీ చాలా శ్రేష్ఠమైనది. సుమారు 50 సంవత్సరాల క్రితం ఆ కంపెనీ అధినేతలు స్వయంగా తమ స్వహస్తాలతో ప్రత్యేకంగా కాచిపెట్టిన సరుకది. మరో గమ్మత్తేమంటే పోటీలో దిగబోయేముందు ప్రతి మల్లయోధుణ్ని విస్కీతో నిండిన తొట్టిలో స్నానమాడించి పంపుతారట ఆ కంపెనీవారు. ఇకనేం - స్కాచ్‌ప్రియులూ ... గబగబ కుస్తీ అభ్యసించి ఫ్రాన్స్‌కు ప్రయాణం కట్టండి మరి...





# కక్కడంలో స్పెషలిస్ట్!

బల్లులు, ఈగలు, కుళ్లిన గ్రుడ్లు, తుప్పువట్టిన నాణాలు... ఇలా ఒకటని ఏమిటి? వేటినైనా నరే గుటుక్కున మింగి, తర్వాత నింపాదిగా బయటికి కక్కేస్తాడు స్టెవీస్టార్. తన అపూర్వ ప్రదర్శనలతో వందలాది ప్రేక్షకుల్ని మెప్పించి 'శెభాష్' అన్పించుకున్నాడు ఇరవై రెండేళ్ల ఈ స్కాట్‌లాండ్ యువకుడు.

స్టెవీస్టార్ ప్రదర్శనలో ఎన్నో ఆసక్తికరమైన అంశాలున్నాయి. మూడు డజనుల తుప్పువట్టిన నాణాల్ని వరుసగా మింగి తిరిగి అదేవరుసక్రమంలో వాటిని బయటకు కక్కగలడతను. దుర్గంధంతో ముక్కులదరగొట్టే 'గోల్డ్ ఫిష్'ను మింగి చిటికెలో బయటకి తెప్పిస్తాడు. 'ఐదు బల్లుల్ని మింగి, సజీవంగా వాటిని బయటకు రప్పించడం' అన్న అంశం అతనికి విశేష కీర్తిప్రతిష్టలనార్జించిపెట్టింది. స్టార్ ప్రదర్శనలో ప్రత్యేకించి అతనికి నచ్చే అంశాలు కొన్ని వున్నాయి. అందులో 'క్యూబ్'ని మింగే అంశం ఒకటి. విశేషమేమంటే - మింగేటప్పుడు అది రంగురంగులుగా ఉంటుంది. కాని బయటకు కక్కినప్పుడుమాత్రం రంగులన్నీ చెరిగిపోయి తెల్లగా వుంటుంది. అలాగే తాళం వేసిన తాళంకప్పను మింగే అంశం మరొకటి. తాళంకప్పను మింగాక దాని తాలూకు తాళంచెవిని మింగుతాడు స్టెవీస్టార్. ఆతర్వాత తాళంకప్పను అతను బయటకి తెప్పించినప్పుడు దాని 'కీహోల్'లో తాళంచెవి దిగబడి వుంటుంది. అంతేకాదు! వేసిన తాళంకూడా తీసే ఉండడం ప్రత్యేకత. అంటే - కడుపులోని నరాలు, పేగులు సాయంతోనే అతడా తాళాన్ని తీయగలిగాడన్నమాట. ఈ అంశం అతనికి 'అంతర్జాతీయం'గా కూడా ఎనలేని కీర్తిని సంపాదించిపెట్టింది. స్టెవీస్టార్ ప్రదర్శన విషయంలో గమనించాల్సిన విశేషం మరొకటుంది. కందిరీగలవంటి కీటకాల్ని మింగినప్పుడుగానీ, విషపూరితమైన బల్లుల్ని మింగినప్పుడుగానీ ఇంతవరకూ అతనికి ఎలాంటి హానీ ఎదురుకాలేదు.

మూడేళ్లన్నా నిండకముందునుంచే గోలీల్ని బలపాల్ని మింగడం - తిరిగి వాటిని బయటకు కక్కడం అలవాటుచేసుకున్నాడు స్టార్. ఆ అలవాటుని, అందులో అతను కనబరుస్తున్న ప్రతిభని గమనించి తల్లిదండ్రులతన్ని బాగా ప్రోత్సహించారు. అంతే! 15వ సంవత్సరం వచ్చేసరికల్లా అతనికదే వృత్తిగా మారిపోయింది. సంవత్సరాల తరబడి అతను చేసిన అభ్యాసం పొట్టనింపడమేకాక ఎనలేని పేరుప్రఖ్యాతుల్ని సంపాదించిపెట్టింది.





# ఏరిన ముత్యాలు

★ నలభై సంవత్సరాలు దాటిన ప్రతివాడూ దుర్మార్గుడే

—జార్జిబెర్నార్డ్‌షా

★ విజ్ఞానం ధనేచ్ఛలాగానే సంపాదించినకొద్దీ ఇంకా కావాలనిపిస్తుంది

—స్టైర్న్

★ జడప్రాయంగా ఉన్న అమితజ్ఞానంకన్నా చైతన్యరూపంలో ఉన్న పరిమితజ్ఞానం మిన్న.

—ఖలీల్ జిబ్రాన్

★ విజ్ఞానం ఒక్కటే ఆరోగ్యప్రదం. అదొక్కటే నిన్ను మానసికంగా బలవత్తరుణ్ణో చేయగలదు. నిజాయితీపరుణ్ణో, బుద్ధిమంతుణ్ణో చేయగలదు.

—గోర్కీ

★ విజ్ఞాన పూరితమైన మాటలువిని వాటిని అమలుచేసేవాడి హృదయంలోనే జ్ఞానజ్యోతులు వెలుగుతాయి.

—అయిడస్మాన్

★ వివిధ విషయాలను నీ దృక్కోణంనుంచే మాత్రమేగాక, ఎదుటివారి దృక్కోణంనుండికూడా పరిశీలించే సామర్థ్యాన్ని సంపాదించుకోవాలి. అందులోనే విజయ రహస్యం ఇమిడి ఉంది.

—నెపోలియన్

★ పత్రికలు అనధికార ప్రజాప్రతినిధులవంటివి.

—జీన్‌పాల్‌సార్త్.

★ ప్రపంచాన్ని భగవంతుడు ఎలా పాలిస్తున్నాడో తెలుసుకోనేందుకు నేను వార్తాపత్రికలు చదువుతాను.

—జాన్ న్యూటన్.

★ నేను అమెరికా అధ్యక్షపదవినైనా వదులుకుంటానుగానీ ఒక పత్రికకు ఎడిటర్ పదవివస్తే మాత్రం వదులుకోను.

—థామస్ జఫర్సన్

★ విద్య అనేది బాల్యానికే పరిమితంకాదు. నాకున్న కొద్దిశక్తితో ఇంకా నేర్చుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి.

—వివేకానంద

★ ఆపదలో ఉన్నవాడు తనని తాను తెలుసుకుంటాడు.

-- అన్నోన్

★ ప్రతి ఆపదా శాపంకాదు. జీవితంలోని మొదటి ఆపదలు అనేకసార్లు ఆశీర్వాదాలుగా మారతాయి.

-- షార్ప్

★ ఆపద ఒకర్ని బలవంతుడిగా మార్చితే మరొకణ్ణి బలహీనుడిగా మార్చుతుంది.

-- లెనిన్

---

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

# ప్రకృతి సౌందర్యానికి నెలవైన అన్నామలై అడవులు

**త**మిళనాడులోని అన్నామలై అడవులు ప్రకృతి సౌందర్యానికి పట్టుకొమ్మలు. కళాపిపాసుల్ని ప్రకృతి ఆరాధకుల్ని విశేషంగా ఆకర్షించే ఆ అడవుల్ని వాటి అందచందాల్ని తిలకించడానికిగాను ఏటా పన్నెండువేల మందికిపైగా యాత్రికులు అక్కడికి వస్తుంటారు.

కోయంబత్తూరు నుండి 80 కిలోమీటర్ల దూరాన ఉన్న ఆ అడవుల్ని చేరుకోవాలంటే బస్సులో 3 గంటలపాటు ప్రయాణించాల్సి ఉంటుంది. కోయంబత్తూరు నుండి కేరళలోని పెరాంబికుళం డామ్‌కు పోయే బస్సులు అన్నామలై అభయారణ్యాల గుండానే పోతాయి. 950 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంగల ఈ అరణ్యప్రాంతాన్ని 'వన్యప్రాణుల అభయారణ్యం'గా 1973లో రాష్ట్రప్రభుత్వం ప్రకటించింది. చాలాకాలం క్రితం వ్యాపార ప్రయోజనాల దృష్ట్యా ఆంగ్లేయులు టేకు చెట్ల పెంపకానికిగాను ఇక్కడ పరిశోధనలు జరిపారు. ఈ అడవుల్లో మూడు జీవనదులతోపాటు మరెన్నో చిన్న చిన్న డాములు ఉన్నాయి. వాటిద్వారా ఇక్కడి జంతుజాలానికి నీటి సౌకర్యం సమకూరుతోంది. ఈ ప్రాంతాన్నంతటినీ నేషనల్ పార్క్‌గా మార్చి అక్కడ పెరిగే జంతువులకు రక్షణ కల్పించాలని అదనపు సౌకర్యాలు కల్పించి సందర్శకుల సంఖ్య పెరిగేలా కృషిచేయాలని ప్రభుత్వం భావిస్తోంది.

ప్రకృతి సౌందర్యంతోపాటు సందర్శకులకు మరొక అదనపు ఆకర్షణ ఈ అడవులలోని గజసంపద. 'వరగాలియర్' ఏనుగుల శిబిరంలో సుమారు పాతికదాకా ఏనుగులున్నాయి. వాటన్నింటినీ అత్యంత శ్రద్ధతో జాగరూకతతో పెంచుతున్నారు. గమ్మత్తేమంటే - అక్కడి ఏనుగులన్నింటికీ నాయకత్వం వహిస్తూ వాటిని తన అదుపాజ్ఞలలో ఉంచుకుంటూ అటవీశాఖవారికి అత్యంత సహకారమందిస్తున్నాడో గజరాజు. భారీకాయంతో తొమ్మిది అడుగులపొడవున్న దంతాలతో రాజసం ఉట్టిపడేలా నడిచే ఆ గజరాజుని అంతా ముద్దుగా ఇన్‌స్పెక్టర్ జనరల్' అని పిల్చుకుంటారు. ఆ ఏనుగుల శిబిరంలో ఇప్పటివరకూ మూడు వందల యాభైకి పైగా అడవి ఏనుగుల్ని మచ్చికచేసుకోవడంలో ఇన్‌స్పెక్టర్ జనరల్ అటవీశాఖ సిబ్బందికి ఎంతగానో సహకరించింది.







కరియన్ శోలా ప్రాంతంలో ఆకులూ పూలు రాలగా బోసిపోయిన తరువులు



ఎడమవైపునుండి రెండవది 65 ఏళ్ళ
వయస్సున్న గజరాజు 'ఇనస్పెక్టర్ జనరల్'



దట్టమైన చెట్ల గుబుర్లను చీల్చుకుంటూ పుడమితల్లిని స్పృశిస్తున్న సూర్యకిరణాలు.



సందర్శకులకు కనువిందు చేస్తున్న పచ్చికబయళ్లు - మనోహర జలాశయాలు



కేరళకు నీళ్లు సరఫరా చేసే
పెరాంబికుళం డామ్

అటువంటి ఇన్‌స్పెక్టర్ జనరల్‌కి అనుకోని పోటు తప్పలేదు. 1987 ఆగస్టు 15 నాటి రాత్రి గుంపులోని మోహన్ అనే మరో మదకరీంద్రుడితో జగడం మొదలయింది. చిలికి చిలికి గాలివానయినట్లుగా ఆ జగడం మరింత జటిలమై రెండూ విజయమో వీరస్వర్గమో అన్నట్లుగా పోరాడాయి. ఎట్టకేలకు తన ప్రత్యర్థిని మట్టికరిపించింది ఇన్‌స్పెక్టర్ జనరల్. కాని మరునాటి ఉదయం పరిశీలిస్తే వాటి శరీరాల నిండా భయంకరమైన గాయాలున్నాయి.

పోరాటాలు, గాయపడటాలు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గారికి కొత్తేమీ కాదు. 1977లో ఒకే సమయంలో రెండు బలిష్ఠమైన ఏనుగులతో పోరాడి విజయాన్ని సాధించింది. ఆ పోరాటంలో దాని శరీరాన 19 గాయాలూ మానడానికి చాలా కాలం పట్టింది. అన్నామలై అడవులకి ఇన్‌స్పెక్టర్ జనరల్‌కి అవినాభావ సంబంధం ఉందనిపిస్తుంది. ఆ అరణ్యం పేరు చెబితే సందర్శకులకి ముందుగా ఈ గజరాజే గుర్తొస్తుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. ఇటువంటి ప్రత్యేకతలింకా అనేకం సంతరించుకున్న అన్నామలై అభయారణ్యాలు సందర్శకులకు అద్భుతమైన అనుభూతుల్ని మిగులుస్తాయి. 

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444 Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD /402